# కొత్తబాట





రచన:

మంజుశ్రీ



విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ.

మా అమ్మ
పవిత్ర పాదముల
సమర్పితము

— మంజుశ్రీ



హైదరాబాదు నగరంలో జూన్ నెలలో ఒకనాటి సాయంకాలం నెంబరు బి. సెకెన్ బస్సుకోసం ఆర్. టి. సి. బస్సు స్టాపువద్ద సత్యనారాయణమూర్తి నిలుచున్నాడు. అతడు నిలుచున్న ప్రదేశాన్ని బడే చౌడీ అంటారు. అక్కడ ఓ చిన్న ఆంజనేయస్వామి దేవాలయంకూడా వుంది. ఎప్పుడూ కోలాహలంగా వుంటుంది. సుల్తాన్ బజారు పోలీసు స్టేషను పక్కగానే వుంటుంది ఆంజనేయస్వామి దేవాలయం. మరి నగరంలోని చిత్రం అదే, చాలా చిన్నది ఆలయం. నిరంతరం కోలాహలంగావున్న వీధిలో గుడి గంటల చప్పుళ్ళు. పక్కనే పూలూ, పళ్లూ, కూరలూ అమ్ముకునేవాళ్ళ కేకలతో అణగి పోతూంటాయి. గంధపుబొట్లూ, టోపీలూ పెట్టుకొని మార్వాడీలు కనబడుతూవుంటారు. గోచీలు పెట్టుకొని కన్నడిగ స్త్రీలూ, మేలి ముసుగులు ధరించి మహారాష్ట్ర స్త్రీలూ దండాలు పెట్టుకుని ప్రదక్షిణాలు చేస్తూంటారు. గుడి బయట గోడల నిండా నూనెమరకలూ, ఎర్రటి రంగూ కనబడుతూంటాయి. అది పెద్ద గుడి అనటానికి వీలులేదు. మామూలుగా వేపచెట్ల క్రింద కనపడే అంకమ్మ మఠంలా వుంటుంది. అరచేతి మందం కలిగిన ఆకులతో అదేదో తీగ సాగి ఎర్రటి మొద్దు పూలు పూస్తున్నది.

సాయంకాలంపూట చాలా సందడిగా వుంటుంది, వీధి వెడల్పయింది కాదు. అయినా ముఖ్యవీధుల్లో ఒకటి. పుస్తకాల షాపులూ, బట్టలకొట్లూ ఆ వీధిన సందడిగా వుంటాయి.

సత్యన్నారాయణమూర్తికి పొద్దుటనుంచీ నీరసంగా వుంది. మధ్యాహ్నం యూనివర్సిటీకి వెళ్ళి వచ్చాడు. నాన్న దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. ఆ పెద్దమనిషిని కలుసుకుందుకు రెండురోజులనుంచీ తీరిక లేకపోయింది. నగరంలో అతడి కెవరూ తెలీదు. అదృష్టవశాత్తు వచ్చినరోజున హోటల్‌లో భోజనము చేస్తుంటే తనతో ఇంటర్ మీడియట్ చదువుకున్న స్నేహితుడు కన్పించాడు. ఎంతో అప్యాయంగా చేతుల్లోకి చేతులు తీసుకుని, తన రూము అడ్రసు యిచ్చాడు. సత్యన్నారాయణమూర్తికి ఆనందమయింది. కాని అది అట్టేసేపు నిలువలేదు. ఆ స్నేహితుడు ఇంటర్ చదువుతున్నప్పుడు తనతో పాటు చదువుకునేందుకు తమయింటికి వచ్చేవాడు. ఒక్కొక్క రోజు రాత్రిపూట తమ యింట్లోనే నిద్ర పోయేవాడు. పొద్దు పోయినదాకా చదువుకోవటమూ, సినిమా హోటలుదాకా పోయి టీ త్రాగి రావటమూ, తెల్లవారుఝామున లేచి చదువుకోవటాలూ, ఆ స్నేహితుడు చాలా దగ్గర స్నేహితుడన్నమాట. అందువలన అతడు కుటుంబంలోని ఒక్కొక్క వ్యక్తి గురించే క్షేమ సమాచారాలు ఆరా తీయడం మొదలెట్టాడు. అత డెప్పుడైతే అలాంటి ప్రశ్న లడగటం మొదలైందో సత్యన్నారాయణమూర్తి ఆనందం ఆక్షణంలోనే ఇగుర్చుక పోయింది. అతణ్ణి చూసి వణకిపోయినాడు. నెర్వస్ నెస్ వచ్చేసింది. అప్పటిదాకా మనస్సు అమ్మయ్య అని విశ్రాంతి

అనుభవిస్తున్నదల్లా, అతడి రూముకు ఛస్తే పోకూడదను అనుకున్నాడు; ఎవరైనా తమ ఇంటినిగురించి అడిగితే సత్యన్నారాయణమూర్తి అలానే అయిపోతాడు. ఇతణ్ణిచూసి స్నేహితుడు కూడా ఆశ్చర్య పడిపోవాల్సివచ్చింది.

"ఎందుకిలా చిక్కిపోయావు ?" అన్నాడు స్నేహితుడు.

"ఎబ్బే ఏం చిక్కాను" అన్నాడు మూర్తి.

"నువ్వు అదృష్టవంతుడవోయీ. పెద్దచదువు చదవటమనేది అందరికీ సమకూడదు."

మూర్తి తల వంచుకున్నాడు.

"నువ్వెక్కడ వుంటున్నావు"అని అడిగాడుస్నేహితుడు. అతడి పేరు రామారావు.

ఈ ప్రశ్నకు సమాధానం చెప్పటానికి మూర్తి కిష్టంలేదు. అందుకని "నీకు జీతమెంత ఇస్తారు" అని అడిగాడు.

రామారావు అడిగిన ప్రశ్న విషయం మరచిపోయి తన సోదంతా మొదలుపెట్టాడు. ఆఫీసూ, సూపరింటెండెంటు ఎంత కర్కోటకుడైనదీ, భోజనం పడకపోవటమూ, రూము అద్దె యెక్కువ కావటమూ, మొదలైనవన్నీ వర్ణించి వర్ణించి టైమయిందంటూ వొకసారి రూముకు రమ్మని మరీమరీ చెప్పి పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ వెళ్ళిపోయాడు. మూర్తిఅతడు పోయిన దెసనే చూస్తూ చేతిలోవున్న అడ్రసు కాగితాన్ని గుండ్రంగా చుట్టి విసరివేశాడు. రామారావు సరోజ అక్కయ్యను గురించి అడగివుండకపోయినట్టయితే మూర్తి అలా చేసివుండేవాడుకాదు. "రామారావు అలాటి ప్రశ్నె ఎందుకడిగాడు" అని ఆలోచించాడు మూర్తి. "మీ సరో

జక్కయ్యకి పెళ్ళయిందా, వాళ్ళెక్కడ వుంటున్నా రిప్పుడు?" అని అడిగాడు రామారావు.

ఆ ప్రశ్నతోటి మూర్తికి రామారావు కన్పించక పోయినా బావుండే దనిపించింది. తరువాత రెండు రోజులూ యెవరూ కనపడలేదు. రెండు రోజులనుంచీ పరంధామయ్య గారింట్లో వుండటం ప్రాణాంతకంగా వుంటోంది మూర్తికి. లేక పోతే ఇంత పెద్ద నగరంలో తన కెవరున్నారు. ఏ హోటల్లోనో వుండాలంటే తనదగ్గర వున్న ఇరవై రూపాయలు ఎంతలో అయిపోతాయి. ఆ ఇరవై రూపాయల విలువ ఎటువంటిదో తనకు తెలుసు, తండ్రికి తెలుసు.

సత్యనారాయణమూర్తి ఆలోచిస్తూ నిల్చుండిపోయి నాడు. "సి" వచ్చి వెళ్ళిపోయింది. "బి" కూడా వచ్చింది. ఎక్కుదామని వెళ్ళాడు. ఎక్కకముందే కదలిపోయింది. తనతోపాటుగా ఇంక నలుగురైదుగురు దిగబడి పోవాల్సి వచ్చింది.

కాస్త కాఫీ అయినా త్రాగకపోతే లాభం లేదనిపించింది అతడికి. పదడుగులు వేసి కాఫీ త్రాగివద్దామని వెళ్ళాడు. అప్పుడే యూనివర్శిటీ మీదుగా సికింద్రాబాదు వెళ్ళే బస్సు వెళ్ళిపోయింది. మూర్తి కాఫీ తాగివచ్చాడు. కాస్త ప్రాణం కుదుటబడ్డది. ఇంతలో బస్సు వచ్చింది. ప్రయత్నించి తానే ముందుగా యెక్కాడు. ఎదురుగ్గా నలుగు రైదుగురు ఆడ వాళ్ళు కన్పించారు. అంతడికళ్ళకు మైకం కమ్మినట్లైంది. ఊహించకుండా ఎలక్ట్రిక్ షాక్ తగిలినట్లైంది. క్షణమైనా ఆలోచించకుండా వెంటనే బస్సుదిగాడు. అక్కయ్య తనని

చూసింది. సందేహంలేదు, తనని చూడబట్టే తాను కనుక్కో గలిగాడు. డ్రై అక్కడే నిల్చున్న మూర్తిని కండక్టరు "గెట్ ఇన్ మిష్టర్, గెటిన్" అన్నాడు.

అక్కయ్య కళ్లు విప్పార్చుకుని చూస్తూనే వున్నది.

తాను ఎక్కనని తలకాయ వూపాడు.

అక్కయ్య ముఖం విప్పారి, మూర్ఛవచ్చే ముందు బిచ్చగత్తె మొహం ఎలా మారిపోతుందో అలా మారి పోయింది క్షణంలో.

కండక్టర్ బటన్ నొక్కాడు.

బస్సు కదలిపోయింది.

మూర్తికి యేడుపొస్తున్నది.

నట్టనడి వీధి. ఎలా ఆపుకోవాలి. ఇలా ఎందుకు జరిగింది. ఇలా ఎందుకు జరిగింది. అతడి గుండెల్లో బాధ అలలు అలలుగా పైకిలేస్తున్నది. అక్కడ కొద్దిగా మసుగు ప్రదేశం దొరికితే బావుండు ననిపించింది. యేడ్పు ఆపుకుని నిలబడటం యేలా. ఇంత విషాదం యేలా భరించాలి? క్షణక్షణం అతడి శరీరం అతడికే బరువైపోతున్నది. చుట్టూ ప్రపంచం రంగు రంగులుగా కనిపిస్తున్నది. మనుష్యులందరూ సుఖంగానూ, సంతోషంగానూ వున్నారు. తానొక్కడేనా ఇలా దుఃఖపడేది. ఎప్పటికి యీ పద్మవ్యూహంలోంచి బయటపడటం? వీళ్ళ ముఖాలనిండా ఎందుకింత సంతృప్తి, ఏమిటి యీ సంతోషం. ఆకలికి అడుక్కుతినే వాళ్ళుకూడా హాయిగా కనబడు తున్నారు. అవును, వాళ్ళకు సమస్య లేమీలేవా?

తనకెందు కీ సమస్యలు. ఎలా బ్రతకటం.

మూర్తి ముందుకు కదిలాడు. అప్పుడే రెండు మూడు బస్సులు వెళ్ళిపోయినయ్. సుల్తాన్ బజారు సెంటరులోకి వచ్చి నిలుచున్నాడు మూర్తి. పేవ్‌మెంటుమీద పాత పుస్తకాలు పరచివుంటే చూస్తున్నాడు. ప్రక్కనే పువ్వులుపోసి అమ్ముతున్నాడెవరో. సాయంకాలం కావటంచేత వీధంతా సందడిగా వుంది. రంగు రంగుల చీరలు, సూట్లు, ఒకరినొకరు నెట్టుకుంటూ వడిగా, వడివడిగా ముందుకు పోతున్నారు రకరకాల మనుష్యులు. అందంగా కలకల్లాడుతూ నడుస్తున్నారు తూలుతూ, పేలుతూ, నవ్వులతో—లైట్లు వెలిగాయి.

సత్యన్నారాయణమూర్తి ఆలోచించాడు

తా నివాళ సికింద్రాబాద్ పోలేదు.

ఇంటికి వెళితేనే మంచిది.

తన మనసు రెండుగా విభాగింపబడి, వొకభాగం నిరంతరం వాంఛిస్తున్నది కనులముందే జరిగింది.

అక్కయ్య ఇప్పుడు బావుంది, అందంగా, ఆనందంగా. అందరిలాగా, కాని ఇవాళ ఆమె మనసులో సంచలనం రేగి వుంటుంది తన మనసు లోపలనే. ఆమె సుఖంగా, సంతృప్తిగా జీవిస్తుంటే ఆమె నిశ్చలతను తాను భంగ పరిచాడు. ఇవాళ ఆమె బాధపడుతుందా ?

మూర్తికి వొకరకమైన నిర్లిప్తత కలిగింది.

ఆమె బాధపడేదైతే తమను ఇంత బాధపెడుతుందా.

తన వొక్కడి సౌఖ్యంకోసం, ఇంతమంది దుఃఖ పడేట్లు చేసింది.

అవును, ఇప్పుడు వాళ్ళు వ్యథ చెందుతున్నారన్న విషయం ఆమె ఎందుకు ఆలోచిస్తుంది. ఆమె ఇదివరకంటే ఆరోగ్యంగావుంది. ఆనందంగావుంది. పోనీ అదేచాలును అనుకున్నాడు మూర్తి.

ఒక్కసారిగా అతనికి అమ్మ గుర్తు వచ్చింది.

అతడి మనస్సు వ్యథ చెందింది.

అలానే ముందుకు నడుస్తున్నాడు. అంతులేని జనసందోహం. తాను ఎటుపోతున్నాడు? వీళ్ళందరివలెనే తాను మాత్రం ఎందుకు హాయిగా వుండకూడదు? తన పిచ్చిగాని, వీళ్ళంతా ఆనందంగా, హాయిగా వున్నారా? వీళ్ళకూ ఎన్నెన్ని సమస్యలున్నాయో ఎవరెరుగుదురు. ఒక్కొక్క జీవితం వెనుక ఎన్నో గాథ లుంటాయి. పైకి మాత్రం ఇలా కనబడుతుంటారు. ఒక్కొక్కరి అంతరాంతంలో ఎంత నీరవాక్రోశం వుంటుందో. ఎంతోమంది విధిలేకే చిరునవ్వులు చిలికిస్తారు. అటువంటివారిలోనే తను జమ.

యూనివర్శిటీ గురించి ఆలోచన వచ్చింది ఇంతలోనే. తనకు సీటు దొరుకుతుందా? దొరకకపోయినా తనకు దిగులు లేదు. ఇక్కడ వుండటం తనకు సంతోషదాయక మేమీ కాదు. ఇలాగే ఎప్పుడైనా అక్కయ్య కనబడుతుందేమో.

ఇంటికి వచ్చేసరికి ఇల్లంతా సందడిగావుంది.

పరంధామయ్యగారు ఇంకా ఇంటికి రాలేదు. బయట వరండాలో లైటు వెలిగించలేదు. చీకటిగా వుంది.

ఆ ఇల్లు బాగా పురాతన కాలపుది. నవీనయుగంలోని అమరికలు ఏవీ కన్పించవు. అసలు ఎవరో వాకరు

వుంటున్నాను కాబట్టి ఆ మాత్రమైనా నిలిచివుంది. ఇంటి యజమాని దయతలచి యెప్పుడో వుత్తరం వ్రాస్తాడు అద్దె పంపించమని, కాని ఆలనా పాలనా పట్టదు. పూర్వకాలపు ఔన్నత్యాన్ని తెల్పుతూ పడిపోకుండా నిల్చివుంది.

ఆ వరండాలోనే మూలస్తంభాన్నానుకుని సత్యన్నారాయణమూర్తి కూచున్నాడు. అతడికి లైటువేసుకునే అవసరం కన్పించలేదు. లైటు వేసుకుందామన్న ఆలోచనకూడా కలగలేదు. అలానే నీరసంగా కూచుండిపోయినాడు. ఆ ప్రశాంత వాతావరణంలో యెక్కడలేని నిర్లిప్తతా అతణ్ణి ఆవరించుకుంది. అతడి హృదయమంతా ఆగంతుకంగా యెడారి దాటిన తర్వాత కన్పించిన అక్కయ్యతో నిండిపోయింది. అతడికే ఆలోచనా క్షణంకన్న యెక్కువ నిల్వటంలేదు. ఆ క్షణంలోనే చిత్తం దుఃఖాక్రాంతమైపోతున్నది. చిన్ననాటి రోజులన్నీ కళ్ళయెందు తిరుగుతున్నాయి; ఆ మంచి మంచి ఘడియలను నెమరువేసుకుంటుంటే యీ రోజుల్లోని చిక్కటి విషాదం మరీ చిక్కబడిపోతున్నది. ఆ రోజుల తీయందనం మనస్సుకి నిరాశ కల్గిస్తున్నది.

గతానికీ, భవిష్యత్తుకీ మధ్య నున్న వర్తమానమనే వంతెనమీద నున్న తను ఏక్షణానో ఈకాలమహాప్రవాహంలో పడి కొట్టుకుపోతే బావుండును అని కోరుకుంటున్నాడతను. జీవితంలో క్షణక్షణానికీ తన కిలాంటి విషమపరిస్థితు లెందుకు ఎదురవుతున్నాయో అత డూహించలేకపోతున్నాడు.

అప్పుడే చంద్రోదయ మవుతున్నది.

సత్యన్నారాయణమూర్తి కళ్ళవెంట ధారాపాతంగా కన్నీళ్ళు కారుతున్నాయి. ఎక్కడినుంచో పువ్వులవాసన తేలి వస్తున్నది. బజార్లోని టీ స్టాలు నుంచి సినిమా సంగీతం విని పిస్తోంది. వీధివాకిలివద్ద బిచ్చగాడెవడో నించుని దీనంగా అరుస్తున్నాడు.

అయినా సత్యన్నారాయణమూర్తి మనసు తన ఆలోచ నలనుంచి తేరుకోనలేకపోయింది.

అతడి తలకాయలో ఇదమిద్ధమని నిర్ణయించరాని భావ సంచలనం రేగుతున్నది.

ఇప్పుడు అక్కయ్య ఏం చేస్తుంటుంది?

తనలాగే ఆమెకూడా తననిగురించి ఆలోచిస్తుంటుందా? పాపం మనసులో బాధ పడుతుంటుంది.

అలా అత డెంతసేపు కూర్చున్నాడో అతడికే తెలి యదు. ఇంట్లో నానా అల్లరిగావుంది. చిన్నపిల్లలు యేడు స్తున్నారు. పెద్దవాళ్లు సముదాయిస్తున్నారు.

మధ్యమధ్య విసుక్కుంటారు. సత్యన్నారాయణమూర్తికి వొక్కసారి జ్ఞానం కలిగింది. సిగ్గు నిలువెల్లా దహించివేసింది. తను పరాయివాళ్ళింటికి వచ్చాడు. పోనీ వాళ్లు తమకేమైనా బంధువులా అంటే అదీకాదు. కేవలం తమ తండ్రి చిన్ననాటి స్నేహితుడు పరంధామయ్యగారు. ఆ స్నేహాన్ని పురస్కరించు కునే తాను వచ్చాడు; తనకు వేరే ఆశ్రయం లేనందువల్ల. అటువంటప్పుడు తన వాళ్ళకు యేలాంటి కష్టమూ కలగకుండా ప్రవర్తించటం కనీసధర్మంకదా - ఇప్పటికే చాలా పొద్దు పోయింది. బజార్లో టీ స్టాలునుంచి రికార్డు సంగీతం విని

పించటం లేదు. బిచ్చగాడి అరుపుకూడా వినరావటంలేదు. నడిమిహాల్లో పక్కలమీద పిల్లలు కీచులాడుకోవటం మానేసి నిద్రపోతున్నారు. ఇప్పుడు తనని వాళ్ళు చూస్తే ఎంత నొచ్చుకుంటారు. తనకి భోజనం పెట్టాలంటే మళ్ళీ యెవరికో ఒకరికి శ్రమ కలుగుతుంది.

సత్యన్నారాయణమూర్తి కేం చెయ్యాలో పాలుపోలేదు. పరంధామయ్యగారు ఇంట్లో లేరు. ఆయన వస్తారుకదూ అప్పుడే! తెలుసుకుంటారు అనుకున్నాడు. అతడి ప్రవర్తన అతడికే లజ్జాకరంగాతోచింది. బాధ పడ్డాడు. వెన్నెట్లో గులాబి పూలు రెండు మెరుస్తున్నాయి. పక్కింటి వాళ్ళకుక్క పుంజీవుండి మొరుగుతోంది. ఇంతలోకే గడియారం గంటలు కొట్టటం విన్పించింది. పది. అతని మనసు కొద్దిగా తేలికపడ్డది. ఇంకా యెక్కువ టైమ్ అయివుంటుందనుకున్నాడతను. సంశయంతో బాధ పడుతుండగా, ప్రక్కన హాలు తలుపు ఎవరో తెరచినట్లుగా తోచిందతడికి. అతడు వొక్కసారిగా అటు తిరిగాడు.

"ఈ కుఱ్ఱాడింకా రాలేదేం" అని అడుగుతోంది ఇల్లాలు.

"వస్తాడు లేమ్మా! నీకెందుకు నువ్వు పడుకో నేనున్నానుగా. ఎప్పుడో దిగుతాడు. ఏ సినిమాకుగాని పోయివుంటాడు. మామూలేగా..." కూతురు విసుగ్గా సమాధానం చెపుతోంది.

"సరేను. నువ్వు పడుకునేవు సుమీ" అన్నది తల్లి. కూతురు మాటాడలేదు.

సత్యన్నారాయణమూర్తి యీ సంభాషణ సారాంశం తనని గురించే అని తెలుసుకున్నప్పుడు, అవమానంతోనూ, సిగ్గుతోనూ కృంగిపోయాడు.

కాని అతడూహించని విధంగా వొకటి జరిగిపోయింది. వరండాలో చప్పున లైటు వెలిగింది. అతడు తడబడ్డాడు. తనని తాను యెలా రక్షించుకోవాలో అతడికి తోచలేదు. అంత అవమానకరమైన పరిస్థితులలో పట్టుబడవలసివస్తుందని అత డెప్పుడూ వూహించివుండడు. ఉన్నవాడు వుండక త్వరత్వరగా చొక్కాయెత్తి కళ్ళు తుడుచుకున్నాడు. తనమీద తనకే అసహ్యం కలిగింది.

ఇక వసుధ ఇతణ్ణి చూసి కొయ్యబారిపోయింది. తనని తాను సంబాళించుకునేసరికి పది క్షణాలు పట్టింది. ఇంతకు ముందుగా తల్లితో తానన్న మాటలు అతడు వినివుంటాడేమో నన్న వూహతో చేసరికి ఆమె సిగ్గుతో కృంగిపోయింది.

అలానే అతణ్ణి చూస్తూ నిల్చోవటం లజ్జాకరంగా తోచి ఎప్పుడొచ్చారు ? అని అతణ్ణి పలకరించింది.

అతడు కళ్లు తుడుచుకోవటం ఆమె చూడనేచూసింది.

"ఇప్పుడే" అన్నాడు.

"ఎంతసేపయింది" అని అడిగింది ఆమె.

"ఇంతకుముందే" అన్నాడతను.

ఆమె మనసు కొంచెం తేలికపడింది.

"మీకు ఒక ఉత్తరం వచ్చింది" అని వసుధ లోపలికి వెళ్ళిపోయింది. వచ్చి కార్డు చేతికిస్తూ "మీరు ఇక్కడెందు

కూర్చున్నారు. ఇంట్లోకివస్తే యేంపోయింది ? పోనీ లైటన్నా వేసుకోలేదు."

అతడు వేటికీ సమాధానం చెప్పలేదు.

ఆ ఉత్తరం తండ్రి వద్దనుంచి వచ్చింది. క్షేమ సమాచారాలన్నీ విపులంగా వ్రాస్తూ సికింద్రాబాదులో వుంటున్న ఆ పెద్దమనిషిని కలుసుకున్నదీ లేనిదీ వ్రాయమని, కలుసుకోక పోయినట్లయితే తక్షణం కలుసుకుని తా నిలా నరసింహయ్యగారి అబ్బాయినని చెప్పుకోవాల్సిందనీ వ్రాశాడు. పరంధామయ్య యింట్లో క్షేమ సమాచారాలు వ్రాయమనీ, ఇంకా ఇలానే ఏవో వ్రాశాడు.

వసుధ గోడకు చేర్లగిలబడి అలాగే అతడి వేపే ఇంత సేపూ చూస్తూ నిలబడింది.

అతడి ముఖం కళా విహీనంగా వుండటమూ, కన్నీటి చారికలతో వుబ్బివుండటమూ ఆమెకు స్పష్టంగా కన్పించినా, ఎందుకో ఆమె ఊహించలేక పోయింది.

అతడు ఉత్తరం చదివి మడిచి జేబులో పెట్టుకున్న తర్వాత "వడ్డించమంటారా ?" అని అడిగింది.

సత్యన్నారాయణమూర్తి అయోమయంలో పడిపోయినాడు.

"ఆకలి లేదు" అన్నాడు. అది అబద్ధమని అతడికీ తెలుసు. వసుధకూడా అనుభవజ్ఞురాలుకాదు. ఆమె వయస్సు కూడా ఇటువంటి విషయాలలో గణనకు రాదు. అతడితో ఎలా మాట్లాడాలో ఆమెకూ తోచలేదు. ఫరవాలేదు, ఆకలవుతుందిలెండి; పోనీ కొద్దిగానే తినండి......ఇంకా ఇలాంటివే

నాలుగైదు వాక్యాలను ఆమె మనసులోనే మననం చేసుకుంది. పైకి అందామనుకుంటే ఆమెకు సిగ్గులాంటి అపరిచిత భావం వొకటి అడ్డువచ్చింది. కాని ఇంతలోకే తాను తల్లితో విసుక్కుంటూ మాటాడిన మాటలు విన్నాడేమోనన్న భావం ఆమె ఊహకంది, ఆమె కృంగిపోయింది; ఆ భావం రానంత వరకూ ఆమె ఎక్కువ ఆలోచించలేదు. కాని ఎప్పుడైతే ఆ ఊహ ఆమెను వశ్యురాలినిగా చేసుకుందో, అప్పుడే ఆమె సర్వాంగాలూ బాధతో కుంచించుకుని పోయినాయి. ఇతడు యెంతో దూరాన్నుంచి, స్వపరిజనాన్ని వదులుకొని యీ మహానగరానికి వచ్చాడు. ఏదో స్నేహభావంకొద్దీ వచ్చాడు కానీ, యీ వూళ్ళో అతడికి హోటళ్ళు కరువైనవా – అతడి బాధ లెలాంటివో, ఆ కుటుంబాన్ని గురించి తండ్రి కొంత తల్లితో చెపుతుంటే తానూ వింది. వసుధకు జాలి కలిగింది.

"లేవండి మరి...నాన్నగారు వరంగలు వెళ్ళారు..... ఇంకా ఆలస్యం యెందుకు ?" అన్నది.

సత్యన్నారాయణమూర్తి లేచాడు. అతడి కేమిటో అంతా కొత్తగా వుంది. అతడు మనస్సుకిలా చెప్పుకున్నాడు – "రేపైనా యిక్కడి నుంచి వెళ్ళిపోవాలి. తన మూలకంగా ఇతరులకు కష్టమెందుకు. గృహిణి ఏదో జబ్బుతో బాధపడు తున్నది. ఇంటినిండా చిన్న చిన్న పిల్లలు, పరంధామయ్య గారికి వుద్యోగమంటూ యేమీ లేదు. ఆయన యేమి సంపా దిస్తాడో యెవరికీ తెలీదు. మొత్తానికి తిరుగుడెక్కువ."

సత్యన్నారాయణమూర్తి లేచి వెళ్ళాడు.

వంటింట్లో పీట వేసివుంది.

దానిమీద కూచున్నాడు.

వసుధ కీ అనుభవం కొత్తగా వుంది.

ఏం మాట్లాడాలో కూడా తోచకుండా వుంది.

సత్యన్నారాయణమూర్తి తల వంచుకొని భోంచేస్తున్నాడు. వసుధ వంటింట గడపవద్ద నిల్చొని ఆకాశంవైపు చూస్తున్నది.ఆమె కేమి టేమిటో ఆలోచనలుకలుగుతున్నాయి. ఈమధ్య కొన్నాళ్లపాటుగా నిద్రిస్తూవచ్చిన స్త్రీత్వం ఇప్పుడే కళ్లు నులుముకుని, మేల్కొన్నట్లుగా అయింది. ఏమి టేమిటో ఆలోచిస్తోంది. ఇన్నాళ్ళనుంచీ ఆమె కేమాత్రమైనా తీరిక లేదు. అలసి సొలసి సాయంకాలం స్కూలునుంచి ఇల్లు చేరుకుంటే, వంటచేసి పిల్లల కింత తినిపించి తాను యెంగిలిపడీ పడకముందే నిద్రవచ్చేది. ఇవాళ స్కూలుకి సెలవు.

వసుధ అతడికేసి చూసేసరికి, అతడు తినటం మానేసి వేళ్ళ గుండ్రంగా రుద్దుతున్నాడు విస్తట్లో. అన్నీ అలానే వున్నాయి. అతడి విచార మేమిటో అనుకుంది ఆమె.

"ఏం కావాలండీ?" అన్నది.

అతడు వొక్కసారి తలయెత్తి ఆమె కళ్ళలోకి చూసి, ఏమీ వద్దని తలవూపి మళ్ళీ తల దించుకున్నాడు.

రెండు మూడు సంవత్సరాల క్రిందట తాను మద్రాసులో చదువుకుంటూ ఎప్పుడైనా ఇంటికివస్తే పక్కనే కూచుని కడుపు నిండినా, ఇంకా ఇంకా కడుపు పగిలిపోయే టట్లుగా తినిపించే అక్కయ్యే గుర్తొస్తున్నది. ఆ తలపునుండి అతడు విముక్తుడు కాలేక పోతున్నాడు. క్షణక్షణానికి అవే తలపులు అతడిని చుట్టుముట్టుతున్నాయి. అవే దృశ్యాలు

అతడి మనోనేత్రం ముందు మెదలుతున్నాయి. అతడి కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి.

వసుధ అతడిని చూస్తుంటే యేమిటో అనిపించింది. కోపమొచ్చి ఒక్క దెబ్బకొడితే రెప్పల్లో కన్నీరు క్రిందికి జారకుండా ప్రయత్నించే ఒకటో తరగతి కుర్రాడు గుర్తుకి వచ్చాడామెకు అతడిమీద జాలికలిగింది. ఇతడికి తల్లి లేదనీ, చాలా సున్నిత హృదయుడనీ, ఇంకా వీళ్ళ యింటి సంగతులు తండ్రి తల్లితో చెపుతుండగా యథాలాపంగా వింది వసుధ ఇంతకుముందు.

ఆమెను క్షణక్షణమూ బాధించే విషయం ఏమిటంటే, తల్లితో తాను విసుగుతో జవాబిచ్చిన విధం అతడు విన్నాడేమోననే—

చందమామ బాగా పైకి వచ్చేశాడు.

వసుధ మళ్ళీ అతడివేపు చూసింది.

చిత్రం! అతడు తనవేపే చూస్తున్నాడు.

అందుకే ఇన్నాళ్ళనుంచీ నిద్రపోతున్న స్త్రీత్వం కళ్ళు నులుముకొని లేచింది.

అయితే ఏమిటి, అలా నిర్వీర్యుడై చూస్తాడు!

వసుధకి వున్నపళంగా తాను ఎంతో పెరిగిపోయినట్లు, లావైనట్లు అనుభూతి కలిగింది.

అతడు తల వంచుకున్నాడు. విస్తట్లో వేళ్ళు రాస్తున్నాడు.

వసుధ పెదవులు బిగబట్టింది.

ఎక్కడనుంచో పూలవాసన తేలి వస్తోంది.

"ఏమి కావాలండీ?"

ఆతడు తల యెత్తి కళ్ళల్లోకి చూశాడు.

"కొద్దిగా అన్నం పెడతానండీ ?"

తల అడ్డంగా ఆడించాడు.

"ఏం కావాలండీ ?"

ఆమెకు వెగటుగా వుంది. మాటి మాటికీ అండీ అండీ అనాల్సి వచ్చినందుకు.

అందుకే ఆవాళ రాత్రి మామూలుకన్నా విరుద్ధంగా పక్కమీద చేరినవెంటనే కాకుండా కాసేపటిదాకా వసుధకి నిద్ర పట్టలేదు.

వరండాలో హోల్డాలు పరుచుకుని పడుకున్న సత్యన్నారాయణమూర్తికి నిద్రలోకూడా—నెంబరు సెవెను "బి"—బస్సూ, అక్కయ్యా కన్పిస్తూనే వున్నారు లీలగా మధ్య మధ్య—

# 2

సరోజనీ ప్రతిరోజులాగా భర్త యెదురుగా కూచో లేదు అతడు భోజనానికి కూచున్నప్పుడు. రహస్యంగా ఇంటికి వచ్చినప్పటినుంచీ పదిమార్లయినా ఆమె కళ్ళు తుడుచుకుంది. తలనొప్పిగా వుంది అని చెప్పి మేడమీద గదిలోపోయి కూచుంది. అలా కూర్చుంటున్నందుకు ఆమెకు బాధగానేవుంది. అయినా ఆమె తనను తాను సంబాళించుకో లేకపోయింది.

తనను చూసే తమ్ముడు ఆలా యెందుకయిపోయినాడు. ఎన్నాళ్ళ తర్వాత కన్పించాడు? సరిగ్గా రెండు సంవత్సరాలైంది తాను వాణ్ణిచూసి. తన అదృష్టం ఎందుకిలా వుంది. లోకంలో లేంది తన కెందుకిలా అవమానం జరుగుతున్నది. చిన్నతనంలో తానంటే ఎంత ప్రేమగా వుండేవాడు సత్యం. ఇంట్లో అందరు పిల్లల్లోకీ తన మధ్యా, సత్యం మధ్యా ఎందుకో ఎక్కువ ప్రేమ. తన తరువాత పుట్టినవాడవటమే అందుకు కారణం కావచ్చు. చిన్నతనంలో స్కూల్లో తను సత్యంకంటె వొకట క్లాసు ఎక్కువ. పుస్తకాలన్నీ నలపకుండా వొక్కొక్క పరీక్ష ప్యాసై తమ్ముడికి యిస్తుండేది. విడదీయలేని మమకారంతో వుండేవాళ్ళు చిన్నతనంలో కాని, ఇవాళ తనని

చూసి భయంతో, బాధతో తమ్ముడు యెందుకు తప్పుకొని పోయినట్టు. కనీసం మాటవరసకి తన క్షేమసమాచారాలు చెప్పవచ్చునే —.

తాను జీవితంలో యెంత సాహసం చేసింది. అయినా తనకు సుఖం లేదు. నిజంగా సుఖం లేదు. దేనినయితే తాను సుఖంగా భ్రమిస్తున్నదో అది సుఖంగాదు. ఇవాళ తనతో రక్తాన్ని పంచుకుని పుట్టినవాడు తనతో మాటాడనన్నా మాటాడ లేదు. ఇక మనస్సుకి శాంతి యెలా వుంటుంది. శాంతి యెక్కడినుంచి వస్తుంది. అశాంతితో యెలా బ్రతకాలి. సుఖమంటే డబ్బూ, భాగ్యభోగాలుకావు. సుఖంయొక్క నిర్వచనం వేరేవుంది. అలాంటి సుఖం తా ననుభవించ లేదు. చప్పున ఆమెకు తులసి జ్ఞప్తికి వచ్చింది. తాను సాయంకాలం తులసివాళ్ళ ఇంటికే వెళ్ళింది. తులసి ఎంత ఆనందంగా చెప్పింది. బొంబాయినుండి వచ్చాడట వాళ్ళన్నయ్యా, తులసి అన్ననుగురించి ఎంత గొప్పగా చెప్పుకుంది. ఆమె హృదయం మూలిగింది. సత్యం – నాన్నా నేనేం పాపం చేసుకున్నారా – ఈ ప్రపంచం నీ నోట్లోకూడా విషం కక్కిందా – నీ మనస్సు విరిచేసిందా – ఇంతకూ నేనేం చేశాను. కుటుంబగౌరవాన్ని ధిక్కరించ లేదే – మీ పరువుని చిన్నబుచ్చ లేదే – కొద్దిగా యెదురు తిరిగాను. నీచమైన తలపులతో కుళ్ళిపోయిన సమాజాన్ని లక్ష్యపెట్టదలచ లేదు. అందుకేనా నేను కంటగింపయి పోయినాను. నాన్న అంటాడు నేను పుట్టి స్వార్థం గడ్డకట్టుకపోయినదాన్నని. పిచ్చిదాన్ని – స్వార్థం లేకపోతే బ్రతకటమే అనవసరం.

ఈ లోకంలో ప్రేమకూ, బ్రతుకుకూ అర్థం లేదు. అలాంటప్పుడు మనిషి బ్రతికి చేసేదేమీ లేదు. ఈ బాధని కళ్ళారా చూడకుండా వుండటమే మంచిది. మంచి ఆలోచన లకు చోటులేని మనస్సు కల్లోలమై ప్రశాంతతకోసం ప్రాకు లాడింది.

కిటికీలోంచి చూస్తుంటే ఆకాశంమీద చందమామ కన్పిస్తున్నాడు. సంపెంగ చెట్టొకటి యేపుగా పెరిగి వెన్నెలను కిటికీలోంచి గదిలోకి రానీయకుండా అడ్డుకుంటున్నది. పువ్వుల వాసన మత్తుగలిగిస్తున్నది.

సరోజని అనుకున్నది; నిన్నటివరకూ తనమనసు కెంత ప్రశాంతత. ఈ జీవితంలో తాను కోరదగ్గది యేమీ లేదు అనుకునేది. స్త్రీ జీవితంలో అన్నిటికన్నా మిన్నగా యేమి వాంఛిస్తుంది. అటువంటిది తన సుకృతంలా లభించింది. ప్రాణాధి కంగా ప్రేమించే భర్త తనకు లభించాడు. అయినా యేమిటి తనకీ కొరత. ఎందుకు తనకీ బాధ? తను తన వాళ్ళను మరచిపోలేక పోతున్నది. ఒక చల్లటివేళ తనకు తండ్రీ, తల్లీ, అన్నాతమ్ముళ్ళూ అంతా గుర్తువస్తారు. దరిద్రంతోనూ, రోగాల తోనూ బాధపడిపోతున్న ఆ సంసారం తలపుకువస్తేనే మనస్సు వికలమైపోతున్నది. తాను కొత్తలో వాళ్ళందరినీ మరచి పోవటానికి ప్రయత్నించి, అందులో కృతకృత్యురాలైంది. కాని తరువాత తరువాత అప్పుడప్పుడు గుర్తొస్తుండేవాళ్ళు. వాళ్ళను పూర్తిగా మరచిపోవడానికని అతణ్ణి క్షణమైనా వదలిపెట్టి వుండేదికాదు. సినిమాలకని, షికార్లకని అతడి తోనే తన లోకంగా మారిపోయింది.

కాని ఇవాళ యెంత దుర్దినం?

ఒక రకమైన ప్రశాంతత కలవాటుపడిన తన జీవితంలో తమ్ముడు కన్పించి మళ్ళీ అలజడి రేపాడు. ఎంత దీనంగా వున్నాడో - బాగా చిక్కిపోయాడు. అవును. ఇంటిదగ్గర ఆలనా, పాలనా - తమ్ముడిసంగతి తనకు బాగా తెలుసు. ఇరవై యేళ్లు నిండాయన్న మాటేగాని కడుపునిండా అన్నం తినటమైనా తెలీని, చేతగానివాడు. ఆ అభిమానంతో ఎంత బాధపడుతున్నాడో, ఎన్ని కష్టాలుపడుతున్నాడో ఇక్కడికెందుకు వచ్చినట్టు. ఏదైనా ఉద్యోగం వచ్చిందేమో? కొంతలో కొంతనయం.

సరోజని కీ తలుపులతో కళ్లలో నీళ్లు నిండుకొచ్చాయి. సంపెంగ చెట్టునుంచి గాలి వీచినప్పుడల్లా మత్తుగా వాసన చుట్టుకుంటున్నది. ఆమె మనసు తెల్లకాగితంలా అయిపోయింది. ఆలోచనలతో అలసిపోయింది. ఏమి చేయటానికీ తోచలేదు. అలానే కుర్చీలో కూర్చుని కళ్ళు మూసుకుంది. మనసులో ఎంతో నీరసం కనిపించింది.

అలా ఒక అరగంట గడచివుంటుంది

ఆమె అలానే ఆ వెన్నెలరాత్రి చీకట్లో పాలరాతి విగ్రహంలా కుర్చీలో కూర్చునివుంది. సాయంకాలం ఇంటికి వచ్చినప్పటినుంచీ అలానే వుంది. తులసి వాళ్ళింటికని బయలుదేరినప్పుడు కట్టిన ఖరీదైన చీర అలానేవుంది. చీర కూడా మార్చలేదు. అంత నీరసం అలుముకుంది, క్షణక్షణానికీ ఆమె కళ్ళలో తమ్ముడు మెదలుతున్నాడు. ఆమె కళ్ళు అశ్రుపూరితాలవుతూనూ వున్నాయి.

శ్రీనివాసమూర్తి పిల్లిలా అడుగులో అడుగు వేసుకుంటూ మేడమెట్లు యెక్కాడు. కొద్దిగాకూడా చప్పుడు కాకుండా వెళ్ళి ఆమెను నవ్వించాలని అతడు ఆనందంగా ఆలోచించాడు. అందుకే అలా వెళ్లాడు. ఆమె కుర్చీ వెనకాల నిల్చుని ఆమె కళ్ళు మూశాడు; సరోజిని వులికి పడింది. అతడు గతుక్కుమన్నాడు. అతడి హృదయంలో ఆ ఒక్క క్షణంలోనే చెప్పలేని అలజడి కలిగింది. ఆమె సర్వాంగాలూ సిగ్గుతోనూ, అలాంటి పరిస్థితులలో పట్టుబడినందుకు యేహ్యాభావంతోనూ కృంగిపోయాయి. అతడి చేతి వేళ్లు ఆమె కన్నీళ్లతో తడిసిపోయాయి. చప్పున అతడు చేతులు తీసివేశాడు. ఆమె కంఠం గాద్గద్యం వహించింది. మాటాడితే పట్టుబడిపోతానని భయపడింది. చిన్నగా లేచి అతడికి అభిముఖంగా నిల్చుంది. ఆమె కళ్లలోకి చూడాలని అతడు వ్యర్థ, ప్రయాసపడుతున్నాడు. పాపం! అతడికి వీలుకాకుండా వుంది. సరోజిని చెంగుతో కళ్లు తుడుచుకుంది. మరీ దగ్గరగా జరిగి అతడి వక్షంమీద తల ఆన్చింది. అతడూ యేమీ మాట్లాడలేకపోయాడు. ఇంతకుముందు ఇలాటి దృశ్యాలు అతడు యెరిగి వుండలేదు. ఆమె లలితములైన బాహువులు అతడి కంఠాన్ని పెనవైచుకున్నాయి. క్షణంసేపు అలానే వుండిపోయింది. ఆమె. ఆమె మనసు యేమిటో తేలిక వహించినట్లయింది. "ఇప్పుడే వస్తాను" అని విడిపించుకుని, అడుగులో అడుగు వేసుకుంటూ మేడమెట్లుదిగి వెళ్లిపోయింది. వెళ్లిపోతున్న ఆమె వేపే విస్మయంగా చూస్తూవుండిపోయాడు. శ్రీనివాసమూర్తి తరువాత గదిలో లైటు వెలిగించుకొని కుర్చీలో కూర్చుని

ఆలోచనలలో మునిగిపోయాడు. అతడి కెంత ఆలోచించినా ఏమీ బోధపడటంలేదు.

అతడి కెందుకో అంతరాంతరాల్లో ఆమెమీద జాలి కలిగింది. అక్కడ ఏదో పుస్తకం వుంటే తీసుకుని చూస్తూ కూర్చున్నాడు.

సరోజిని అరగంటన్నా గడవకముందే వచ్చింది.

ప్రతిరోజూ ఆమె ముఖాన్ని వెలిగిస్తుండే చిరునవ్వు అతడు చూడలేదు. నిరాశాదేవతలా వచ్చింది ఆమె ఆలోచిస్తున్నది., అతడు తప్పకుండా అడుగుతాడు. అందుకు యేమి చెప్పాలి? అదీ ఆమె ఆలోచన.

ఆమె కెందుకు కన్నీళ్ళు?

ఆ విషయం ఎలా అడగాలి?

ఆమె ఏమి చెపుతుంది?

అదీ అతడి ఆలోచన!

సరోజిని బ్లాంకెట్ మలిసి పక్కమీద పరచింది. పక్కమీద మాట్లాడకుండా కూర్చుంది. శ్రీనివాసమూర్తి ఆ పుస్తకాన్ని అతికష్టంతో చదువుతున్నాడు. అతడి కళ్ళు అందులోని పంక్తుల్ని చదువుతున్నాయి. కాని అతడి మనసు నంతా ఆమే నిండివుంది.

ఒక పేజీ చదవిన తర్వాత రెండో పేజీ త్రిప్పబోయి నప్పుడు అతడికి కనిపించింది. ఏమిటుంది యీ పేజీలో! మళ్ళీ మొదటినుంచీ చదివేందుకు ప్రారంభించాడు. కాని అతడికి విసుగ్గావుంది. పుస్తకాన్ని అతను అవతలికి విసరివేశాడు. కుర్చీలోంచి లేచాడు. సరోజినివేపు చూశాడు. ఆమె కళ్ళు

దిగులుగా వున్నాయి. శ్రీనివాసమూర్తి రేడియోవేపు వెళ్లి ట్యూన్ చేశాడు. మళ్ళీ వచ్చి కుర్చీలో కూర్చున్నాడు.

రేడియోలోంచి సైలెన్ వాద్యం వినిపిస్తున్నది. తియ్యగా గుండెలను కదలిస్తున్నది.

సరోజిని పక్కమీద చారగిలబడింది.

"సరూ!" అని పిలచాడు శ్రీనివాసమూర్తి.

ఆమె లేచి కూర్చుంది.

"మంచినీళ్ళు" అని సైగ చేశాడు.

ఆమె మంచినీళ్లు తెచ్చింది.

అతడు అడగదల్చుకున్నది అడిగేశాడు.

"అబద్ధం చెప్పకూడదు. అబద్ధం చెప్పితే వొట్టే" అన్నాడు.

ఆమె దిగులుగా నవ్వింది.

అతడి జుట్టులోనికి వేళ్లు జొనిపి లాలనగా – "యేమీ లేదు" అన్నది.

నమ్మలేను అన్నట్లుగా చూశాడు అతను. ఆమె దిగులుగా నవ్వింది.

తెల్లటిసిల్కు చీరతో ముడుచుకుపోయిన కలువ పువ్వులా వున్నదామె. ఆమె కళ్లు కొద్దిగా వుబ్బి వున్నాయి; మంచుకు తడిసిన మల్లెపువ్వులా అతడి పాదాలవద్ద కూర్చున్నదామె.

ఆమె తలను రెండు చేతుల్లోకి తీసుకుని ముఖాన్ని తన వేపుకి తిప్పుకుని సగం మూసిన కళ్లలోకిచూస్తూ అతడన్నాడు– "ఏమిటి దాస్తున్నావు?"

లేచి నిల్చుని ఆమెను లేవదీశాడు.

"అమ్మ గుర్తు వచ్చింది. అందుకని" అన్నది.

అతడికి చెప్పలేని జాలి కలిగింది.

ప్రేమనంతా కూడగట్టి గౌరవించాడు ఆమెని. ఆవాళ రాత్రంతా ఆమె మనసు బాధపడుతూనే వుంది. అతడి కౌగిలిలో ఆమె తననితాను స్వాంత పరచుకోలేక పోయింది. "ఈసుఖాన్ని ఆశించేకదా నువ్వు వచ్చింది. ఇదేనా సుఖం. నిన్నునువ్వు వంచించుకున్నావు. ప్రపంచంలో అన్నిటికన్నా కోరదగ్గసుఖం ఇదేనా—ఆవాళ నీ తండ్రి, నీ తల్లి, అన్నా తమ్ముళ్ళు ఎంత కుమిలిపోయారో ఆలోచించలేక పోయావు. కేవలం నీసుఖాన్ని నీవు చూసుకునే వచ్చేశావు" అని యెత్తి పొడిచింది మనసు.

ఆమె మనస్సుకి యెదురుతిరిగి మాటాడటానికి శక్తి చాలలేదు.

ప్రశాంతంగా నిద్రపోతున్న అతడి చేతుల్ని తనమీద నుంచి తీసివేసి ఆమె కిటికీ ప్రక్కనకుర్చీలోకి పోయి కూర్చుంది.

తాను యెక్కడవుంది.

ఇవాళ తనకు సమస్యలు లేవు. అయినా తాను యెందుకు బాధపడాలి. తనమీద సానుభూతియైనా లేని వాళ్ల కొరకు తా నెందుకాలోచించి మనస్సు కష్టపెట్టుకోవాలి. ప్రపంచంలో యెంతోమంది యెన్నో రకాలుగా కష్టపడు తున్నారు. వాళ్ళందరి కొరకూ తాను బాధ పడగలదా — అయినా తనను మరచిపోయిన వాళ్ళని తాను మరచిపోవాలి. తనను దూరంచేసుకున్న వాళ్ళని తాను దూరం చేసుకోవాలి, అయినా అన్నయెవరు? తమ్ము డెవరు?

ఆమె మనసు వేదాంతంతో నిండిపోయింది.

తనని తాను వోదార్చుకోవటానికని యీ మనస్సు ఎన్నో ఆలోచిస్తుంది. కేవలం ఒక రకమైన వోదార్పుకోసమే భగవంతుడూ, అదృష్టమూ, దురదృష్టమూ, కర్మా మొదలైన వన్నీ సృష్టింప బడ్డాయి.

ఆమె చేతులు జోడించుకుని "నావల్ల యేమీ తప్పు లేదు. నేను బాధపడాల్సిన అవసరం లేదు" అని పదేపదే అనుకుంది.

మెల్లగా కుర్చీలోంచి లేచి అడుగులో అడుగు వేసుకుంటూ పక్కమీదకు చేరింది. ఆలోచనలతో అలసిపోయి వుండటంవల్ల త్వరగానే ఆమె కళ్లు ప్రశాంతతతో మూసు కున్నాయి. కాని ఆమెకు తెలీదు. శ్రీనివాసమూర్తి అప్పటి దాకా నిద్రపోలేదని.

కాని ఆమె ప్రొద్దున్నే కళ్ళు తెరచేసరికి శ్రీనివాస మూర్తి ఆమెమీదికి వొరిగి చూస్తుండటం గమనించింది. అతడికెందుకో దిగులైంది. ఆమెకళ్ళు బాగా వుబ్బివున్నాయి. సరోజిని యెందుకు బాధపడుతున్నదో తెలుసుకోవాలని అతడి మనస్సు ఆరాటపడుతున్నది, కాని యెలా తెలుసుకోవలెనో తెలియటం లేదు.

ఆమె వదనాన్ని అరచేతుల మధ్య బంధించి "రాత్రి సరిగా నిద్ర లేదులావుందికదూ నీకు" అని అడిగా డతను.

పేలవమైన చిరునవ్వుతో ఆమె "ఉహూఁ...యెందుకు లేదూ" అన్నది. "అద్దంలో చూసుకో ఒక్కసారి, కనీళ్ళు

యెలా వాచివున్నాయో తెలుస్తుంది" అన్నాడతను. ఆ క్షణంలో ఆమె మనసుకిలా అనిపించింది.

"ఈ ప్రపంచమంతా నాశనమైనా తనవాళ్లూ, పరాయి వాళ్లూ తనముందే యెన్ని బాధలు పడుతున్నా తను లెక్క పెట్టదు. బాధపడదు. లెక్కపెట్టకూడదు. బాధపడకూడదు. ఎవరేమైనా అనుకోనీ, ఏది ఎలా జరగనీ, ఇకగాడి హృదయం మాత్రం తనకోసమై బాధపడకూడదు."

అతడివేపు ఆప్యాయంగా చూసింది. ఉత్సాహం తెచ్చుకొని కూనిరాగంతో అద్దంముందుకుపోయి నిల్చుంది. తనని తాను చూసుకుంది. ఇంకెప్పుడూ తనకీ కన్నీళ్ళు రాకుండా వుండుగాక! ఆమె మామూలుగా రోజూటివలెనే క్రిందికి దిగి పోయింది. అతనిమనసు తేలికైంది.



# 3

తల్లి చనిపోయినప్పుడు సరోజినికి ఉత్తరం ఆలస్యంగా చేరింది. అందుకు కారణం లేకపోలేదు. ఆమె తండ్రికి సరోజినికి ఉత్తరం వ్రాయాలన్న తలపే కలుగలేదు. పెద్దన్న రామేశానికి, తల్లి యిలా అకాలంగా దిగులుతో మరణించడానికి కొంతలో కొంత సరోజినే కారణం అని ఒక రకమైన తలపు వుంది. తమ్ముడు సత్యన్నారాయణమూర్తికి దిగులుతో యీ లోకమంతా చీకటిమయం కాగా ఏమీ ఆలోచించలేకపోయాడు. అతడు పదిరోజులపాటు పిచ్చివాడిలా అయిపోయాడు. అతడికా సమయంలో యెవరూ గుర్తుకు రాలేదు.

ఈ ఇరవై సంవత్సరాల నిండు జీవితంలో తల్లిని అధికంగా ప్రేమించాడు. ఒకసారి మద్రాసులో చదువుకుంటుండగా యెందుకో అతడికి తల్లి చనిపోయినట్లు ఒక పాడుకల వచ్చింది. అప్పటికి పరీక్షలు పదిహేను రోజులేవున్నా, ఆర్థికమైన అనేక యిబ్బందులతో కొట్టుమిట్టాడుతున్నా, యెవరికీ చెప్పాపెట్టకుండా తెనాలి పడి వచ్చాడతను. అటువంటి అనుబంధం పెంచుకున్నాడతను చిన్ననాటనుంచీ. రాగానే తల్లి సలక్షణంగా కన్పించింది. అయినా అతడు యేడ్పుని ఆపుకోలేక పోయాడు. ఇంట్లో వాళ్ళంతా గాభరా పడ్డారు.

ఆశ్చర్యపడ్డాడు, ఏమీ తెలుసుకోలేకపోయారు. ఆ సాయం కాలాని కెలాగో అక్కయ్యకి చెప్పగలిగాడు.

తల్లి తరువాత ప్రాణాధికంగా ప్రేమించాడు అక్కయ్యని. అక్కయ్య ఇలాటిపని చేసిందని విన్నప్పుడు అతని నవనాడులూ కృంగిపోయాయి. నిజమని నమ్మలేకపోయాడు. చెప్పలేని అసహ్యం కలిగింది అతగాడికి. కసికూడా రేగింది.

అటువంటి సత్యన్నారాయణమూర్తి తల్లి చనిపోయి నప్పుడు అక్కయ్యకి ఉత్తరం వ్రాయలేకపోయినాడు.

అటువంటప్పుడు తన గతి ఎవరూ చూడక, తనని వోదార్చేవాళ్ళు లేక తుండుగుడ్డ వొకటి కప్పుకుని వీధి అరుగుమీదనే కూచుని అక్కయ్య వస్తుందేమోనని ఆశతో చూసే తొమ్మిదేళ్ళ వాసుకి తలవనితలంపుగా అక్కయ్య యెలా వస్తుంది? ఆక్కయ్యకు తెలియవద్దా అన్న ఊహ కలిగింది.

వాడి కాళ్లూ, చేతులూ పుల్లలవలె అయిపోయినయి. నాలుక మొద్దుబారిపోయింది. ఒంటిమీద నీళ్ళు పోసుకొని ఏ పదిరోజులైందో పట్టించుకున్నవాళ్ళే లేరు. జుట్టంతా పెరిగి చెవుల కిందిదాకా జారి వికారంగా వున్నాడు. వాడికి ఈ ఇల్లూ, వాకిలీ శూన్యంగా, నీరసంగా కనబడుతుండేది. అక్కయ్యవస్తే మళ్ళీ బాగుపడుతుంది అనుకునేవాడు. అక్కయ్య రాదని వాడికీ తెలుసు. ఇంకోప్పుడు, ఇంకోప్పు డయితే రాదేమో, అమ్మ చచ్చిపోయినప్పుడయినా రాకుండా వుంటుందా? అని. వాడి మనసు వస్తుంది తెలిస్తే అని గట్టిగా చెప్పింది.

వాడికి అక్కయ్య గురించి తండ్రిని అడగాలంటే భయం. చిన్నన్నయ్య ఇంట్లోనే వుండడు. పైన తన కెప్పుడు చిన్నన్నయ్య దగ్గరకు పోవాలంటేనే భయంగా వుంది. జుట్టంతా గొరిగించుకుని పిచ్చివాడులా తయారయినాడు. పెద్దన్నయ్య వద్దకు వెళ్ళి నిల్చుంటానికే వాడికి ధైర్యం చాలటం లేదు.

అటువంటప్పుడు వాడికి ఒక విషయం మదిలో మెదిలి అంత దుఃఖంలోనూ, మనసుకి సంతోషం కలిగింది. వాడి చిన్న సత్తురేకుల పెట్టె దగ్గరకు వెళ్ళి పరిశోధించాడు. అట్ట ముక్కలూ, సినిమా ఫిల్ములూ, బలపాల్ఘూ, పెన్సిళ్ళూ, విరిగి పోయిన పాళీలూ, నెమలియీకెలూ ఒక టిమిటి అన్నీ పైకి తీసి చూచాడు. పాతలాగు మడతలో వాడికి కావలసిన వస్తువు దొరికింది. ప్రాణం తేలికపడింది. అది సరోజినక్కయ్య ఒక రోజు రహస్యంగా తన చేతికిచ్చిన కార్డు. ఆ రోజున ఎందు కిస్తున్నదో వాడు తెలిసికోలేకపోయాడు. ఎందుకిస్తున్నావు అని అడగకుండానే తీసుకున్నాడు. అక్కయ్య మరీ మరీ చెప్పింది. "ఎక్కడా పారెయ్యవద్దు. భద్రంగా దాచుకో. ఎప్పుడైనా నేను వూరెళ్ళినప్పుడు దానిమీద నువ్వు వ్రాయ దలచుకున్నది వ్రాసి పోస్టు డబ్బాలో పడవేస్తే నాకు చేరు తుంది.

"నువ్వెక్కడకెళ్తా వక్కయ్యా" అని అడిగాడప్పుడు వాడు.

సరోజినక్కయ్య అప్పుడు మాట్లాడలేదు.

వాసు ఆ కార్డు పైకి తీసుకున్నాడు. దానిమీద అడ్రసు ఇంగ్లీషులో వ్రాసి వుంది. దాన్ని యెవరికీ చూపించదలచుకో

లేదు వాసు ! సరోజినక్కయ్యమీద అందరికీ కోపమే. వాడికి కలం కావాలి యిప్పుడు. అది ఒక పెద్ద సమస్య. పిల్లిలా అడుగులు వేసుకుంటూ అన్నిచోట్లా వెతికాడు. ఎక్కడా కన్పించలేదు. ఎలా అయితేనే పక్కింటివారి కాలేజీ కుర్రాడివద్ద నుంచి సంపాదించగలిగాడు. దాని మీద ఏమని వ్రాయాలో వాడికి తెలియలేదు. వాడు ఉత్తరాలు చాలాచదివాడు. కాని ఇంతమటుకూ ఎవరికీ వ్రాయలేదు. దానిమీద రెండేరెండు వాక్యాలు వ్రాశాడు: "ఫలాని రోజున ఫలాని తారీకున అమ్మ చచ్చిపోయింది. అక్కయ్యా వొక్కసారి నువ్విక్కడకు రా!" అని.

పోష్టు ఆఫీసుకి వెళ్ళాడు. ఎప్పుడయినా తమకు ఉత్తరాలు రావలసివస్తే తెచ్చిచ్చే జవాను కనపడ్డాడు. అక్కడ అతడిని అడిగాడు, "ఏ డబ్బాలో వేస్తే యీ ఉత్తరం హైదరాబాదు చేరుతుంది?" అని. ఆతడు చెప్పాడు. దానిలో పడవేసి వాసు సంతోషంగా ఇంటికి వచ్చాడు. ఇంటికి వచ్చిన మరుక్షణంనుంచీ వాడికి వొకటే ఆలాపనయింది. బయట ఏ రిక్షాబండి చప్పుడు వినిపించినా, లేక ఏ జట్కాబండి పరిగెత్తిపోతున్నా, అక్కయ్యే వస్తున్నదన్న భ్రాంతి కలిగేది. సాయంకాలం ఆరుగంటలదాకా వీధి అరుగుమీదనే కాపలా కాసేవాడు.

అందువలన సరోజినికి ఉత్తరం ఆలస్యంగా వచ్చింది. ఆఫీసులో శ్రీనివాసమూర్తి కా ఉత్తరము అందింది. అతడు తనదేనని చదువుకున్నాడు. అతడి కెంతో దిగులయింది. ఎలా సరోజినికీ విషయం తెలియచెయ్యాలో తోచలే దతడికి.

ఆఫీసు నుంచి చాలా దిగులుగా వచ్చాడు.

సరోజిని చిరునవ్వుతో ఎముకు రాటవం మరీ బాధ కలిగించింది. తెలియకుండానే ఆమెతో ఓదార్పు మాటలను పలికాడు. ఆమె కేమీ అర్థం కాలేదు. దగ్గరకు తీసుకున్నాడు. ఎలానో ఆ ఉత్తరాన్ని అందించాడు.

సరోజిని కుప్పకూలిపోయింది.

ఆమె కండ్లకు పొరలు కమ్మినట్లయింది.

సర్వ ప్రపంచం ఆమె కంటికి కన్పించటం లేదు.

ఎదుట భర్తా లేడు. ఎవరో తనని దారుణంగా హింసించారు. ఏం చెయ్యాలి తను. ఇక సర్వం ముగిసింది. ఆమె హృదయంలోంచి అలలు అలలుగా దుఃఖం పైకి వుబికింది. ఎవరో తన హృదయంలో చిచ్చుపెట్టి మంటలను రేపినట్లయింది.

ఆమె వెంటనే బయలుదేరి తెనాలి వచ్చేసింది. ఆమె నొక్కదాన్ని ఇలాంటి పరిస్థితులలో వదిలిపెట్టివుండడానికి శ్రీనివాసమూర్తికి మనస్కరించలేదు. అతడూ ఆమె వెంబడే వచ్చేశాడు. అవమానకరమైన దృశ్యాలనే యెదుర్కొనవలసి వుంటుందని అతడికి తెలుసు. అయినా ఆమెతో వచ్చాడు.

వాకిలిముందు సరోజిని నొక్కతెనే వదలిపెట్టి అతడు వూళ్ళోకి వెళ్ళిపోయాడు.

ఇంటిలో అందరి హృదయాలు దుఃఖంతో మూలిగినై. ఒక్క వాసుకే అక్కయ్య ఆగమనం సంతోషాన్ని కలిగించింది.

కాని సరోజినితో నొక్కరూ ఒక్కమాట మాట్లాడలేదు. ఒక మూల కూచుని హృదయం పగిలిపోయేట్లు

యేడ్చింది. తన జన్మ కారణభూతురాలయిన ఆమె లేదు. ఆమెకోసం భ్రాంతితో సరోజిని కళ్ళు ఇల్లంతా వెతుక్కున్నాయి. తనను కని, పెంచి, తన సుఖంకోసం మనసా, వాచా చాలా బాధపడి బాధపడి తనువు త్యజించిన అమ్మలేదు. ఆమె ఇక కనపడదు.

ఈ ఊహతో సరోజినికి తనమీదే తనకు యేహ్యాభావం కలిగింది. ఇలాటి సంఘటన ఒక రోజున తన కెదురౌతుందనీ, అప్పుడు ధైర్యంగా నిలబడి తాను తనకు సమాధానం చెప్పుకోవలసి వస్తుందనీ, ఆమె వూహించలేదు.

అమ్మ చివరి లక్షణాలలో తనని గురించి యెంతగా అనుకుందో యీ తలపు కలిగేప్పటికి సరోజిని మరి నిలవలేక పోయింది. ఇటువంటి పరిస్థితులలోనైనా యెవరూ తనని వచ్చి వోదార్చకపోవటం ఆమెకి మరీ గుండెపగిలేటట్లు చేసింది. అంత ధైర్యమూ, వివేకమూ కలదికూడా తనని తాను తిట్టుకుని ముఖాన కొట్టుకుని, తన పుట్టుకను నిందించుకుంది.

పెద్దన్నయ్య వచ్చి వొక్కసారి అసహ్యంగా చూసి పోయినాడు. సత్యమేదీ అని అడగాలని ఆమె ఎంతో అనుకుంది. ఎవరిని అడగాలో ఆమెకు తోచదు.

వాసు తానిలా యేడుస్తుంటే భయపడిపోయాడేమో దగ్గరకే రాలేదు. ఒకమూల మంచంమీద వున్నప్పుడు అమ్మకి వుపయోగించిన వస్తుసముదాయమంతా వుంది. సరోజిని తనను తాను సంబాళించుకుని లేచింది.

తండ్రి యోగనిష్టలో వున్నవాడిలా కళ్ళు మూసుకుని కూచున్నాడు. "నాన్నా!" అని పిలిచింది.

ఒక్కసారి కళ్ళు తెరచి చూచి మళ్ళీ కళ్ళు మూసు కున్నాడాయన. తండ్రి పక్కనే కూచున్న వాసు లేచి దగ్గరకు వచ్చాడు. వాడితో హాల్లోకి వచ్చింది సరోజిని.

"చిన్నన్నయ్యేడమ్మా వాసూ" అన్నది వాణ్ణి గుండె కదుముకుని.

వాడు వెఱ్ఱిగా చూశాడు.

ఆమె గుండె కోసుకుపోయింది.

"నన్ను మీరంతా మర్చిపోయారా" అని యేడ్చింది సరోజిని.

వాడికీ యేడుపొచ్చింది.

"చిన్నన్నయ్య ఇంటికే రాడక్కయ్యా! ఎప్పుడో పది నిమిషాలు వుండిపోతాడు" అని చెప్పాడు.

సరోజినికి దిగులైంది.

ఇక వీళ్ళ భవిష్యత్తు యేమిటి?

వీళ్ళు మళ్ళీ యెప్పటికి బాగుపడగలరు?

భవిష్యత్తంతా కారుచీకట్లతో కమ్ముకుని వున్నదిగా కన్పించిందామెకు. దిక్కూ, దరీ తోచలేదు.

ఇంట్లో దూరపు బంధువు ఒక ముసలమ్మ వుంది.

ఆమెమైనా సరోజినిని వోదార్చలేదు.

అంత దుఃఖాన్ని దిగమింగుకొని పెద్దతమ్ముడికోసం ఆమె కాసేపు నిరీక్షించింది. మధ్యాహ్నం పన్నెండు గంట లైనా ఆతడు రాలేదు.

రామేశం మళ్ళీ వొకసారి వచ్చి చూసిపోయాడు.

అన్నయ్యా అని దీనంగా పలకరించబోయింది సరోజిని. అతడు వినిపించుకోకుండా కర్కశంగా వెళ్ళిపోయాడు. ఒంటి గంటైంది. సత్యనారాయణమూర్తి ఇంటికి రాలేదు. ఈ లోపున వాసు రెండుసార్లు చిన్నన్నయ్య స్నేహితుల ఇంటికి వెళ్ళి వచ్చాడు.

సరోజినిఅంతటి అవమానాన్ని వూహించలేక పోయింది. అన్నయ్య నాలుగు మెతుకులు కొరికి వీధిలోకి వెళ్ళిపోయాడు. ముసలామె విస్తట్లో యింత వడ్డించి హాలులోకి తెచ్చిపెట్టి వెళ్ళిపోయింది. అది యెవరికై వుద్దేశించబడిందో సరోజిని తెలుసుకునేసరికి ఆమె నరాలన్నీ వొక్కసారిగా స్ట్టుతెంపి నట్లైంది.

ఇలా యెందుకు జరగవలసివచ్చింది భగవంతుడా అని ఆమె నుదురు కొట్టుకుంది. నిజంగా తన నిలా వెలివేయ టానికి ముసలమ్మ కేమి అధికారముంది. తన తల్లివుంటే? అనుకోగానే సరోజినికి పొర్లిపొర్లి దుఃఖం వచ్చింది.

తనంటే తల్లి కెంత ప్రాణమో గుర్తు వచ్చేసరికి ఆమె నిలవలేకపోంది. నిజంగా గతజన్మ, పునర్జన్మ, కర్మ, అదృష్టం ఇలాంటి వేమైనావుంటే, తాను గతజన్మలో చాలా పాపం చేసుకునే వుంటుంది. అందుకు సందేహంలేదు. ఈ సమ యంలో తాను నోరునొక్కుకుని పడివుండటమే మంచిది అని పించిన దామెకు. వాసూ! నీకు తినిపిస్తాను పద నాయనా, అని వాణ్ణి రెక్కపట్టుకుని తీసికెళ్ళి కూచోబెట్టుకుంది.

ముసలమ్మ గొణుక్కున్నా వాసు లెక్కపెట్టలేదు.

రెండు గంటలైనా సత్యనారాయణమూర్తి ఇంటికి రాలేదు.

ఆమె మనసంతా ఎంతో ఆందోళనపడసాగింది.

ముసలమ్మ తండ్రిని యెంతో బ్రతిమాలగా ఆయన కాస్త యెంగిలిపడి లేచాడు

తాను చేసిన ఘోరమైన నేరమేమిటి? తనను పిల్లంతా యెందుకింత హింసిస్తున్నారు? తెలుసుకోవాలని సరోజినికి కోర్కె కలిగింది.

ఆమె తండ్రివద్దకుపోయి కూచుంది.

"అమ్మ యేమైనా చెప్పిపోయిందా నాన్నా"

ముసలాయన పలుకలేదు.

కన్నెత్తి చూశాడు. ఆయన కళ్ళల్లో నీళ్ళు నిల్చాయి.

"ఇంకా యేం శత్రుత్వం నాన్నా. మన బాటలు చీలి పోయాయి. మళ్ళీ మనం కలుసుకోముగదా. ఇవాళ నాతో మాట్లాడునాన్నా."

ఆయన చలించాడు.

"నిన్ను క్షమించానని చెప్పమన్నదమ్మా మీ అమ్మ. నిన్ను దీవిస్తున్నానని చెప్పిపోయింది."

సరోజిని కొంగు కప్పుకుని యేడ్చింది.

"ఇంకా యేమీ చెప్పలేదా నాన్నా?"

"నీకు సంబధించిన దదేనమ్మా."

"ఎలా చనిపోయింది నాన్నా..."

"భగవంతుడు."

"బాధపడిందా."

తండ్రి మాట్లాడలేదు.

"నేను నిన్నడిగి ఒక విషయం తెలుసుకోవాలనుకుంటున్నాను నాన్నా."

"ఆ విషయాలన్నీ మళ్ళీతీసుక రావద్దు. నువ్వు సుఖంగా వుంటున్నావా అమ్మా".

"కాదు నాన్నా మీరు దీనికి సమాధానం చెప్పక తప్పదు."

"తెలిసికొని యేంచేస్తావు"

"తృప్తిగానయినా వుంటుంది."

"ఏమిటా ప్రశ్న ?"

"నే నేం తప్పుచేశాను? నన్ను మీరంతా దూరం చేయడానికి ?"

"దీనికి నేను సమాధానం చెప్పను."

"చెప్పవలసిందే నాన్నా".

"ఒక్కటే చెపుతానమ్మా, నువ్వు వ్యక్తిగతమైన సుఖానికే యెక్కువ ప్రాధాన్యత నిచ్చావు. కుటుంబ క్షేమాన్ని తృణీకరించావు. అందుకే యీ చిక్కులు."

"అది నేనొప్పను నాన్నా. కుటుంబ క్షేమంకోరే నేనలాంటి సాహసం చేశాను..."

"అయితే ఇక నీకు నేనేం చెపుతాను".

"మీరలా యెందుకనుకోవలసి వచ్చిందో చెపుతారా. కాస్త వింటాను".

"నీ కిప్పట్లో అర్థం కాకపోవచ్చు..."

"ప్రయత్నిస్తాను."

"నువ్వు చేసినపని సంస్కరణ అనిగానీ, సాహసమనిగానీ నువ్వూ, నేనే సంతోషించాలి. అథవా ముఖస్తుతి కివడైనా అన్నా, రేపు నానాయాగీ చెయ్యటానికి వాళ్ళే వెనుదియ్యరు. రేపు నీ అన్నయ్యకు పెళ్లి విషయమై కొన్ని చిక్కులు ఎదురవు తాయి. నీ విషయం ప్రతివాళ్ళూ చర్చిస్తారు."

సరోజిని కళ్ళుతుడుచుకుంది.

"నేను కుటుంబపు బాగును గురించి యోచించాను నాన్నా. నా వివాహ విషయం ఎంత గడ్డు సమస్యగా తయారయిందో నేను గ్రహించగలిగాను. ఆ సమస్యను మీరు పరిష్కరించలేకపోయేవారే. అందుకని ఇది వొక పరిష్కార మార్గంగా తోచింది."

"కాని దీన్ని లోకులు లేచిపోవటమనే అంటారు..."

"లోకులతో నీకేంపని నాన్నా. నాకు పెళ్ళి కాకపోతే లోకులు బాధించింది నిన్నేకదా. మళ్ళీ ఆ లోకులనే నువ్వు వెనకేసుకొస్తావెందుకు. పెట్టగలిగినవాళ్ళు, కాదు పెట్టేసవాళ్ళు మొట్టినా వూరుకోవలసిందే. కాని బాధలను దమ్మిడీ ఎత్తు సానుభూతితోనైనా అర్థం చేసుకోలేని వాళ్ళగురించి నీ కెందుకీ బాధ."

"నీకు తెలీదు తల్లీ. మనకు డబ్బైనా లేదు."

"అలా అని మన నెవరు బతికిస్తున్నారు నాన్నా."

"బతికించాల్సిన పనిలేదు. డబ్బు లేకపోతే అలుసు."

"చూడు నాన్నా. నువు చెపుదువుగాని. నాగురించి ఇరుగు పొరుగు చెప్పుకోవటం విన్నాను. అమ్మ పడే బాధ చూశాను. నీ అశక్తత తెలుసుకున్నాను. చేతకాక నేకదా

అన్నయ్య చదువు మాన్పించాం. సత్యానికి ఆస్కాలరుషిప్పు రాకపోతే వాడూ చదువుకోలేక పోయేవాడే కదా—నేనేం చెయ్యాలి నాన్నా. అమ్మ నా గురించి నా వయస్సును గురించి ఎవరైనా అడిగితే యేం చెప్పేదో తెలుసా, ఎప్పుడైనా నువ్వు వినివుండవు. అటువంటి సమయాల్లో నూతిలో దూకుదామనో, కిరసనాయిలు పోసి నిప్పంటించుకుందామనో, అంత కసి కలిగేది. రసాతలానికి కృంగిపోయేదాన్ని.

"నాకు పదిహేడేళ్ళా నాన్నా? అమ్మ చెప్పేది. పదహారు మొన్ననే వెళ్ళి పదిహేడు వచ్చింది అని.

"నాకు యెన్నేళ్ళు నాన్నా. ఇరవై మూడు. అన్నయ్య కంటే రెండేళ్ళేకదా నాన్నా నేను చిన్న.

"అటువంటప్పుడు నాకెలా అనిపిస్తుందో నువ్వు వూహించ గలవా. నేను చచ్చిపోతే యేం అనిపించేది. నా గురించి వీళ్ళ కెందుకు ఇంత బాధ.

అయినా యీ లోకులకు నా వయసుగురించి ఎందుకు నచ్చు. ఇవేకాదు. నేను నా గురించి యెన్నో అసహ్యమైన మాటలు విన్నాను. నీకు గుర్తులేదూ? పక్కింటి ప్లీడరుగారి కొడుకు శేషూ, అన్నయ్యా యెందుకు కొట్టుకున్నారో —

అన్నిటికంటే ముఖ్యమైంది నాన్నా. ఇప్పుడు నేను సిగ్గుపడాల్సిన అవసరంలేదు. నేను సిగ్గుపడను. ఇప్పటికే నన్ను హీనంగా యెంచుతున్నారు. నాకేం నాన్నా, యెవరి పాపం వారినే దహించివేస్తుంది. మీ మనుషులూ, మీ బుద్ధులూ కంటే కుళ్ళుకాలవ చాలా నయం. ఆ ముఖ్యమైన దేమిటో చెప్పమంటారా. నేను మానవమాత్రురాల్ని కూడా.

నాకు ఇరవై మూడు యేళ్లు కాదూ—నాకు హృదయం లేదూ—నేను పెరగలేదూ - ఇంకా నీకు అర్థం కాలేదా - అమ్మకు పదకొండో యేట పెళ్లైందట నాన్నా. పద్నాలుగో యేట అన్నయ్య పుట్టాడు. అర్థమవుతున్నదా. నాకు మాత్రం అలాటి కోరిక లుండకూడదా - తప్పా నాన్నా. నిజంగా నీకు నువ్వే ఆలో చించుకో. నేను చదువుకున్నదాన్ని. నీతీ అవినీతీ...అన్ని విషయాలూ నాకు తెలుసు. నా బాధ మీకు తెలీదు ఏమైనా అనుకోండి...ఏం మాట్లాడవేం నాన్నా..."

ఆయ నేం మాట్లాడలేదు పెగల్చుకుని.

"స్వార్థత్యాగంఅనే మాటకు నీ కర్థం తెలుసునా..."

"అంతకంటే దంభమైన విషయం ఇంకొకటి లేదు నాన్నా. ఈ ప్రపంచంలో స్వార్థత్యాగమూ, మంచిగా వుండటమూ, ఇంకా కొన్ని యిటువంటివే వున్నవి. నన్నడిగితే అర్థంలేనివి." నేనేం చెప్పను. పోనీ నీ సుఖాన్ని నువ్వు చూచుకున్నావు. చాలు."

"మళ్ళీ అలా మాట్లాడితే నేనేం చెప్పాలి నాన్నా. నే నంతకంటే యేం చెప్పాలి. ఏం చెయ్యాలి. నేను చేసిన దాంట్లో తప్పేమీ లేదు. ఇప్పుడాయనా వచ్చారు. రమా వాళ్ళింటికెళ్ళారు. ముఖ్యంగా నా చర్మాన్ని చెప్పులు కుట్టి యిచ్చినా రమకు చూపించాల్సిన కృతజ్ఞత చాలదు. నేను రమవాళ్ళింటికి రోజు యెందుకు వెళ్ళేదాన్ని? ఇంతకు నా అదృష్టం బాగుంది. ఒకటే చెప్పుతున్నాను. ఆయన నా కోసమే పుట్టాగనిపిస్తుంది. పోనీలే నాన్నా ఇంకా యేం చెప్పను."

"అలాంటప్పుడు పెద్దవాళ్ళం లేమా అమ్మా. అప్పుడిగి తెచ్చుకోవటం, దొంగతనం చేసి తెచ్చుకోవడం వొకటే నంటావా తల్లీ."

"ఆ సామ్యం ఇక్కడ పనికిరాదు. సమయాసమయాలను బట్టి నీతులూ, విలువలూ కూడా మారుతుంటాయి. యింతకూ నే నెందుకు ముందు తెలియచెయ్యలేదనా? తరువాత మీారు తెలుసుకున్నారుగా, ఆయనగారి శాఖా, మన శాఖా వొకటికాదని. అయినా ఆడంబరాలూ, ఆర్భాటాలూ నాకు నచ్చవు. నా మనసుకి మంచిదని తోచిందాన్ని నేను ఆచరించాను."

ఇలా కుండ పగలగొట్టినట్లు చెప్పటంతో ఆ ముసలాయన మనస్సుకి బాధనిపించింది.

"అందుకే నీ సుఖాన్ని నువ్వు చూసుకున్నావని నే ననటం."

"అలా అనవద్దు నాన్నా!"

ముసలాయనను కోపమూ, చిరాకూ, బాధా సమ్మిశ్రితంగా చుట్టుముట్టాయి.

"పదిసార్లు నాన్నా, నాన్నా, అని పిలిచినంత మాత్రాన, నేను నీకు తండ్రినీ కానూ, నువ్వు కూతురువీ కావూ...నా సుఖంమీాదా, పరువుమీాదా ధ్యాస లేని నువ్వు కూతురువేనా?" సరోజిని దిమ్మరపోయింది. ఆమె నవనాడులూ కృంగి పోయినయి. పొరలి పొరలి దుఃఖం వచ్చింది. ఇంతమటుకూ తాను చెప్పిన విషయాలను ఆయన అర్థం చేసుకుంటున్నాడని, లేక అర్థంచేసుకుంటానికి ప్రయత్నిస్తున్నాడని ఆశిస్తున్నదామె. కాని

ఆమెకు యీ మాటలు వినటంతో ఓ దుఃఖం వచ్చింది. ఈ సమయంలో వాసు వచ్చాడు.

"అక్కయ్యా చిన్నన్నయ్య వచ్చాడు" అంటూ—

సరోజని వాకిట్లోకి చూసింది. ఒక్కసారిగా కొయ్యబారిపోయింది. సగానికీసగమై, శవంలా పిచ్చి అవతారంతో, దైన్యం అంతా వొక్కచోట గూడుకట్టుకున్న దేమోనన్నట్లుగా, తమ్ముడు వాకిట్లోంచి ఇంట్లోకి వస్తున్నాడు. ఆమెకు మూర్ఛ వచ్చినంత పనైంది. కర్మవిధు లాచరించటంవలన ఖండిత శిరస్కుడై, శవాకారంగా తేలివస్తున్న తమ్ముణ్ణి చూడగానే ఆమె లోపలి వాత్సల్యం పొంగిపోయింది. కాని ఆమె ముఖాన కొరడాపెట్టి కొట్టినట్లుగా, పెన్నున బాకుతో గుచ్చినట్లుగా వచించలేని అవమానానికి గురిచేసినట్లుగా సత్యన్నారాయణ మూర్తి (తమ్ముడు) ఆమెను చూసీ చూడగానే గిరుక్కున వెనక్కు తిరిగి వీధిలోకి వెళ్ళిపోయాడు. వాళ్ళ నాలుగు కండ్లూ క్షణంసేపే చూసుకున్నాయి. ఇంతలో ఇటువంటి దురదృష్టం సంభవించింది. ఆమె పూర్తిగా కృంగిపోయింది.

తండ్రి ఇప్పుడే అన్నమాటలు గుర్తువచ్చాయి; కోపం దహించివేసింది.

"అవునండీ నరసింహయ్యగారూ. మీకు కూతురు లేదు. ఏ కూతురు కొరకైతే మీరు చిన్నప్పుడు ఎన్ని కష్టాలనుభవించారో, ఏ కూతురు మీ కళ్ళవెలుగుగా పెరిగిందో, ఏ అమ్మాయి చిన్నతనంలో సైకిలు చైనులో చేతివేళ్ళు నలగగొట్టుకుని రక్తంవచ్చేట్లు చేసుకుంటే, అప్పుడు మరే అమ్మాయి కోసం మూడు పగళ్ళూ, రాత్రుళ్ళూ అన్నం, నిద్రా మాని

ఆస్పత్రి చుట్టూ తిరిగారో, అమ్మా, తల్లీ అని యెవరినైతే పిలుచుకున్నారో, ఆ అమ్మాయి, మీ సరోజిని హటాత్తుగా చనిపోయింది. పాపం మీరా అమ్మాయిని గురించి ఇక ఆలోచించవద్దు. ఆలోచించినా ఇక గాదు. మర్చిపోండి. చనిపోయింది. లేదు. చనిపోయింది. లేదు" అని అక్కసుతో బావురు మని యేడ్చింది.

తండ్రి కొయ్యబారిపోయాడు.

తుండు గుడ్డ ముఖాన కప్పుకొని పైకి వినరాకుండా నిశ్శబ్దంగా యేడ్చాడు. మళ్లీ కూతురి ముఖంచూడలేదు. వాళ్లిద్దరి మధ్య నిశ్శబ్దంవచ్చి కూచుంది. అరగంట తర్వాత బైట వాకిట్లో బండి ఆగటమూ, అందులోంచి శ్రీనివాస మూర్తి దిగటమూ, చూసింది సరోజిని.

హితాహితా జ్ఞానం నశించినదానిలా, తూలుతూ సోలుతూ ఆఖరుకి వాస్సునైనా దగ్గరకు తీసుకోకుండా బండి వద్దకు నడిచింది. అయితే కాసేపు తల్లీ మంచంవున్నచోట నిల్చున్నది.

అయితే ఆమెకు సుపరిచితమైన కంఠం వేదనగా, వేసటగా యిలా విన్పించింది.

'అంతామిథ్య తలంచి చూచిన నరుండట్లౌ టెఱింగినన్ సదా
కాంతల్పుత్త్రులు నర్థమున్ తనువు నిక్కంబంచు మోహార్ణవ
భ్రాంతిం జెంది చరించుగాని పరమార్థంబైన నీ యందుఁదా
జింతా కంతయు జింతనిల్పడు గదా ! శ్రీకాళహస్తీశ్వరా !'

శ్రీనివాసమూర్తి దిగులు కళ్ళతో సరోజిని వైపుచూసి చేతితో పిలిచాడు.

వాసు నిశ్శబ్దంగా యేడుస్తున్నాడు.

ఆమెపోయి బండియెక్కి కూచోగానే నిమిషంలోనే బండి కదిలింది. బండిలో ఆమెకు వాసుగుర్తొచ్చాడు. బండి వాడు కూడా ఆశ్చర్యపడేటట్లుగా ఆమెఏడ్పును ఆపుకోలేక పోయింది. స్టేషనుకిపోయి ఫస్టుక్లాసు వెయిటింగు రూములో కూచున్న తర్వాత కూడా ఆమె యేడుపు తగ్గలేదు.

శ్రీనివాస మూర్తి కేమీ తోచలేదు.

వాళ్ళు చాలా అవమానం చేసివుంటారని అనిపించిందతనికి. వాళ్ళింట్లో అందరూ తెలియదు శ్రీనివాసమూర్తికి. రామేశం వొక్కడూ మాస్టరుగా తెలుసు. తక్కిన వాళ్ళను చూసి కూడా వుండలేదు అతడు.

అవాళే వాళ్ళు హైద్రాబాదు వెళ్ళిపోయారు.

వాసు కనిపించింది. అక్కయ్య రానూవచ్చింది. వెళ్ళిపోయింది.

ఇంకయెలా ? వాడు మళ్ళీ యెంతో దిగులుపడ్డాడు. ఇంత త్వరలోనే అక్కయ్య యెందుకు వెళ్ళిపోయిందో వాడి లేత హృదయానికి అర్థంకాలేదు. కాని జరగకూడని దేదో జరిగినట్లుగా వాడికికూడా తెలిసిపోయింది. అంతచిన్న హృదయంకూడా దిగులువలన నిర్లిప్తతతో కృంగిపోయింది. సత్యనారాయణమూర్తి మర్రోజు ప్రొద్దున్న ఇంటికి వచ్చినప్పుడు అక్కయ్య వెళ్ళిపోయిందన్న సంగతి తెలుసుకుని తెలీకుండానే నిట్టూర్చాడు.

# 4

సత్యన్నారాయణమూర్తి ప్రొద్దున శికింద్రాబాదు వెళ్ళాలని బయలుదేరాడు. అతడికి రాత్రి అంతా సరీగా నిద్ర పట్టకపోవటంవల్లనూ, క్రితం రోజు జరిగిన సంఘటనయొక్క ప్రభావం ఇంకా మనస్సుపైన పనిచేస్తున్నందువల్లనూ చాలా దిగులుగా వున్నాడు. ఇంటి వద్దనుంచి నడిచివచ్చాడు. ఆ అడ్రసు కాగితాన్ని జాగ్రత్తగా జేబులో వుంచుకుని బస్ స్టాండు చేరుకున్నాడు. అప్పటికే తొమ్మిది గంటలైంది. ప్రొద్దున కాస్త ఆలస్యంగా నిద్ర లేచాడు. ఇంకా ఊరంతా సరిగా అతడికి తెలీను కూడా తెలీదు. ఉస్మాన్‌పురాలో పురాతనత్వం తాలూకూ శుభలక్షణాలతో పరంధామయ్య గారిల్లు వెలిగిపోతోంది. హైద్రాబాదు నగరంలోని వివిధ జాతి ప్రజలకు ఆ నవాబులకాలం నాటి మహా భవనం అద్దె తీసుకుని ఆశ్రయం యిస్తోంది. అక్కడినుంచి చాదర్‌ఘాట్ బ్రిడ్జి దాటి ఇస్లామియా బజార్ గుండా సుల్తాన్ బజార్ చౌరస్తాకి చేరుకో వచ్చును. మూర్తికి బడేచౌడి దగ్గర కాపు యెక్కడం మనస్కరించ లేదు. అక్కడికి వచ్చినందు వల్లనే నిన్న అతడి మనస్సుకు యెనలేని వ్యథ కలిగింది. అందుకని కోటీదగ్గరకు వచ్చాడు. రెండు బస్సులు వచ్చిపోయినై. బస్‌స్టాండు వద్ద

బలాబలాలు ప్రదర్శించుకునే విద్య ఇంకా పట్టుబడనందువల్ల అంతా యెక్కిన తర్వాతనే యెక్కవచ్చును అనే వుద్దేశ్యంతో నిలబడిపోయేడు. అందుచేత రెండుబస్సులు పోయాయి. అతడలానేనిలబడవలసి వచ్చింది. అతడికి యీ జీవితంతో పరిచయం లేదు. అందుకనే తెలీదు. ఈమధ్య ఒక మహాకవి ఆలాపించినట్లు "త్రోసివ్వేరివ్వారోయి — తోసుకుని పోవాలి" అనే సత్యాన్ని మూర్తి అర్థం చేసుకున్నట్లు తోచదు. ఈనాటి సాంఘిక వ్యవస్థని అర్థం చేసుకునేందుకు పుస్తకాలు చదువనక్కర్లేదు. ఆలోచనలతో మగ్గిపోవనవసరం లేదు. కాసేపు బస్ స్టాండ్‌లో నిల్చుంటేనే సరిపోతుంది. అహమహమికతో ముందుకు నెట్టుకు పోగలిగిన వాడికే సీట్ లభిస్తున్నది. ముఖ్యంగా మధ్యతరగతి జీవనవిధానం బస్ స్టాండ్‌లో నిలబడిన ఆచిన్ని గుంపుని శాంపిల్‌గా తీసుకుని చూస్తే తెలుస్తుంది. అప్పుడే వచ్చినవాడు బస్సు యెక్కుతాడు. పదినిమిషాలనుంచీ కాచుకున్న వాడికి వొకొక్కసారి సీట్ దొరకదు. "దయచేసి క్యూమార్గంలో వరసగా నిలబడ ప్రార్థన" అని నవాబుల తెలుగు హైదరాబాదు నగరంలో అలంకార ప్రాయంగా అక్కడక్కడ కనబడుతుంటుంది. కాని వాళ్ళు వ్రాసిన క్యూ మార్గంలో వరుసగా యెవరూ నిలుచోరు. అంచేత సత్యనారాయణమూర్తి రెండు బస్సులు వెళ్ళిపోయినదాకా అలానే నిలుచున్నాడు. మూడో బస్సు చాలా ఖాళీగావుంది.

సత్యనారాయణమూర్తి యెక్కి కూచున్నాడు. బడే చౌడీదాటి బస్సుపోతూంటే అతడి మనోనేత్రంముందు నిన్నటి సంఘటన మళ్ళీ ఒక్కసారి మెరుపు మెరసినట్లయింది.

రాణీ గంజ్‌కి టికెట్ తీసుకున్నాడు. అప్పుడు తొమ్మిది గంటల నలభై అయిదు నిమిషాలు కావస్తోంది. నగరం అతడికి చిత్రంగావుంది. విశాలమైన శుభ్రమైన వీధులు, రకరకాల కట్లూ—బొట్లూ కారులో కూర్చుని ఉత్సాహకరంగా చూస్తున్నాడు.

కారు రాణీ గంజ్ చేరేసరికి పదిగంటల పైనేఅయింది. బస్ దిగిన తర్వాత జేబులోని అడ్రసు కాయితాన్ని వోసారి తీసిచూచుకున్నాడు. పదడుగులు ముందుకు నడచిన తర్వాత ఒక పెద్దమనిషిని నిలిపి ఆ బజారుకి పోయేమార్గం చెప్పవలసిందిగా అడిగాడు. అతగాడు హావభావ విలాసాలతో వుర్దూలో చెప్పేసరికి అర్థమయీ అర్థంకానట్లుగా అతడు చేతితో చూపించిన మార్గం కేసి కొంతదూరం నడిచిపోయాడు.

అప్పటికే యెండ తీవ్రంగా వుంది. కాలికివున్న రబ్బరు చెప్పులు అప్పుడప్పుడే వేడెక్కుతున్నాయి.

సత్యనారాయణమూర్తి అతడి చేతిలోని విలాసాన్ని కనుక్కునే సరికి పదీ ముప్పావు అయింది. మూర్తి చాలా ఆశ్చర్యపోయాడు. నాన్నగారికి యీ పెద్దమనిషి స్నేహితుడు. చిన్నతనాన కొన్నిక్లాసులు కలిసి చదువుకున్నారట. మరి పరంధామయ్యగారున్నూ స్నేహితుడే. మూర్తి రెండుసార్లు ఆ యింటికేసి తన చేతిలోని కాగితంకేసి పరిశీలనగా చూసుకున్నాడు. ఆ ఇల్లేనని రూఢి పరచుకున్న తర్వాత గేటు వెనక్కునెట్టి ఇంట్లో ప్రవేశించాడు. అతడి వొళ్ళు వొక్కసారి ఝల్లుమంది. బాగా బలిసి, పొగరుతోవున్న పెద్దకుక్క వొకటి చీల్చుతాననే హెచ్చరికను ధ్వనింప చేస్తూ గొలుసు తెంచు

కుని అతనిమీాది కురకటానికి ప్రయత్నించింది. అతడు చాలా భయపడిపోయినాడు. అంతగా భయపడి పోయినందుకు తేను. కున్న నిమిషానికి నవ్వొకున్నాడు.

ఐదు నిమిషాలదాకా అతడి కేంచెయ్యాలో తోచ లేదు. విచిత్రంగా గోడల కేసీ, కిటికీలకు కట్టివున్న వట్టివేళ్ళ తడికెల కేసీ చూస్తూ నిలుచున్నాడు. బయట సిమెంట్ చప్టాకి రెండు వైపులా రకరకాల అందమైన బంగళాబంతి పూలు, మెట్ట తామరపూలు వున్నాయి. రకరకాల గులాబీపూలున్నాయి. మూర్తికి వొకక్షణం ఆశ్చర్యమైంది.

నాన్నా, పరంధామయ్యా, యీ వెంకటరాజుగారూ ముగ్గురూ స్నేహితులు. అయితే వొకరిజీవితానికి మరొకరి జీవితానికీ యెంతమార్పో! వాళ్లు చదువుకునేప్పుడు చిన్న తనంలో యెలావుండే వాళ్ళో. భవిష్యత్తును గురించి యేమని ఆలోచించేవాళ్ళో, కాని జీవితాలు ఇలా మారిపోయాయి. వెంకటరాజుగారి జీవితం ఇంతభోగ విలాసాలతో వెలిగి పోతోంది. పరంధామయ్యగారు పాపం బాధలతోనే వున్నాడు. సరే ఇకతన తండ్రికూడా అంతే. జీవితంలో ఎక్కడ వున్నది మరి బాగుపడే కీలకం. వెంకట్రాజుగారు నాన్నకంటె ఎక్కువ చదువుకున్నవాడా? లేక ఎక్కువ తెలివిగలవాడా? కాదు నాన్న చెప్పిన ఎన్నో చిన్నతనపు విషయాలనుబట్టి చిన్న తనంలో వెంకట్రాజుగారు వట్టి మొద్దుగా వుండే వాడనికూడా తెలుస్తున్నది.

మధ్య హాలులో సోఫాసెట్లు కనపడుతున్నాయి. గోడ గడియారం పదకొండు గంటలు కొట్టింది. మూర్తికి లోపలకు

ఎలా పోవాలో తెలీలేదు. దయ్యంలా కుక్క తన వేపే చూస్తున్నది. ఎవరో లోపలనుంచి వస్తున్నట్లు వుంది. మూర్తికి ఆశ కలిగింది. ఎవరో లోపలనుంచి వచ్చారు ఆడమనిషి.

'ఎవరబ్బాయ్? ఎవరికోసం వచ్చావు? ఎందుకొచ్చావు?" అన్నది. మూర్తికి చిరాకు కలిగింది. తాను అబ్బాయా? ఏమిటలా మాటాడుతుంది ?

మూర్తి చెప్పాడు.

"ఆరు లేరు"

మూర్తికి చెప్పలేని నిరాశ కలిగింది. తాను కొద్దిగా కూడా జ్ఞానం లేనివాడు. ఇంటివద్ద బయలుదేరేటప్పుడు తనకా ఊహ కలగనైనా కలగలేదు. కొంతమంది మనుషులు తనలాంటి వాళ్ళు వుంటారు కాబోలు పనికిరానివాళ్ళు. తనని తాను కాసేపు నిందించుకున్నాడు.

ఆమె లోపలకు వెళ్ళబోతూ "ఇంకేం ఇకపో నాలుగు రోజులుదాకా రారు" అన్నది.

మూర్తికి గుండె పగిలింది నిరాశతో. ఎంత సిగ్గునీ, అభిమానాన్నీ వర్జించి బ్రతుకుదామన్నా పరిస్థితులు యీ మాత్రంకూడా వీలు కలిగించటం లేదు. మూర్తికి యేమి చేయాలో కూడా తోచలేదు. అతడు వెనక్కి తిరిగి రెండడుగులు వేసేసరికి వెనక తనని గురించి యెవరో మాట్లాడుకుంటున్నట్లు భ్రాంతి చెంది వెనక్కి తిరిగి చూశాడు.

ఎవరో అందమైన అమ్మాయి తనని మొదలు పలకరించిన ఆడమనిషితో మాటాడుతున్నది.

మూర్తి మళ్ళీ ముందుకు నడిచాడు.

ఆ అమ్మాయి ప్రసన్నంగా అడిగింది.

మూర్తి చెప్పాడు. వెంకటరాజుగారి కొరకు వచ్చాననీ తమది తెనాలి అనీ.

ఆ అమ్మాయి వినయంగా చెప్పింది. "నాన్నగారు ఊళ్ళో లేరు. నాలుగు రోజులదాకా రారు. ఫలాని ఊళ్లో రాజకీయ మహాసభకి అధ్యక్షత వహించేందుకు వెళ్ళారు. మీరు నాలుగు రోజులు పోయినతర్వాత రండి."

మూర్తికి ఆ అమ్మాయి మాటాడుతుంటే దిగులు పోయింది.

ఆమెను యెక్కడో చూచినట్లు స్ఫూర్తి కలిగింది.

కాని గేటుదాటి బజార్లోకి వచ్చినతర్వాత మూర్తికి మళ్ళీ యెక్కడ లేని దిగులూ పట్టుకుంది. యెండతీవ్రంగా వుంది. క్షణక్షణానికీ వ్యర్థజీవితాన్ని గురించి మనసు తనని న్యూనత పరచుకుంటూ నిరాశపడుతున్నది. మూర్తి తననితాను తిట్టుకున్నాడు. కొద్ది రోజులనుంచీ నిరాశ కలిగినప్పుడు ఇది దురభ్యాసంగా పరిణమించింది అతడికి.

కొద్ది దూరం నడచినతర్వాత జేబులోంచి చిల్లర తీసి చూచుకున్నాడు. రెండణాలన్నర మాత్రమే వుంది. తను వొట్టి బుద్ధిహీనుడు. బీదతనం మనిషిని గాడిదనుగా మారుస్తుంది. గాడిదకన్నా ఇంకా బుద్ధిహీనతను ప్రసాదిస్తుంది. ఒక రూపాయి జేబులో వేసుకుని రావలసింది. తాననుకున్నాడా యేం. ఇలా జరుగుతుందని. వెంకట్రాజుగారు ఊళ్ళోనే ఉంటారని, ఆ పూటకి తనని అక్కడే వుండిపొమ్మంటారని అతను వచ్చేప్పుడు వూహించుకున్నాడు. కాని ఇప్పుడు ఇలా జరిగింది. కాసిని

కాఫీ తాగితే ప్రాణానికి ఎంతైనా ఉత్సాహకరంగా వుంటుంది. మూర్తికి తనమీద తనకే కసి కలిగింది. ఎదురుగా డబుల్ డెక్కర్ పెద్ద మోతతో వస్తుంది. దానికింద పడిపోతే బావుం టుంది అని కసిగా అనుకున్నాడు. ఆ కసి యెందుకో, యెవరి మీదో తెలియదు. చనిపోతే లోకమంతా అయ్యో పాపం అనుకుంటుందనీ, అలా అనుకుంటే లోకాన్ని శిక్షించినట్లవు తుందనీ అప్పుడప్పుడు పిచ్చిగా ఆలోచిస్తుంటాడతను. అవి కసి క్రొద్దీ చేసేఆలోచనలేగానినిజానికిమూర్తికి చావంటేచెడ్డభయం. లేకపోతే కుక్క ఇందాక అరచినందుకు యెందుకంత హడలి పోవాలి ? ఇలానే ఏవేవో ఆలోచించుకుంటూ నడుస్తున్నాడు. ప్రతిరోజూ, ప్రతిపూటా పరంధామయ్యగారింట్లో వాళ్ళని బాధ పెట్టినట్లవుతున్నది పాపం. పదకొండు దాటిపోయింది. ఆ అమ్మాయి వసుధ స్కూలుకిపోయి వుంటుంది. ఇంట్లో పాపం ఆ యిల్లాలు రోగగ్రస్తురాలు. మూర్తికి వాళ్ళమీద యెంతో జాలికలిగింది. బజార్లో నడుస్తుంటే పాన్‌షాపుల ల్లోనూ, హోటళ్ళలోనూ, ఇంకా యితరములైన అంగళ్ళ లోనూ వున్న అద్దాలలో తన ముఖం తనకు కనపడితే తనని తానే విపరీతంగా అసహ్యించుకుంటూ, అశక్తతతో, ఆకలితో మూర్తి ముందుకు నడుస్తున్నాడు. వీధిలో రకరకాల మను ష్యులు అవుపించారు. ఒక్కొక్కరు ఎంతో సంతోషంతో వున్నారు.

దుఃఖిస్తున్న మానవుడికి ప్రపంచమంతా యెంతో సుఖపడిపోతున్నట్లుగా అనిపించటం సహజమైన విషయం. సంతోషం లేనివాడికి తనుతప్ప అంతా హాయిగావున్నారు

అనిపించటంలో విచిత్రమేమీ లేదు. ఒక రకమైన మానవ దౌర్బల్యం ఇది. ఎంత ధనంవున్నా, గౌరవంవున్నా, యెన్నో వున్నా బాధ,పడుతున్న మనిషికి రోడ్డుమీద రిక్షా లాక్కుంటూ పోయేవాడు ఎంతో అదృష్టవంతుడుగా కన్పిస్తాడు. 'షా' కాబోలును అన్నాడు. 'పంటినొప్పి వున్న మనిషి, ఇతరులని చూసి ఎంత అదృష్టవంతులో వాళ్లు తనకంటే అని అనుకుంటాడు' అని, నిజం లేకపోలేదు.

మహంకాళీ వీధిగుండా నడిచి నడిచి, స్టేషన్ చేసుకున్నాడు మూర్తి. బట్టల దుకాణాలు, మిఠాయి దుకాణాలు, పాన్ షాపులు, పూలు అమ్ముకునేవాళ్లూ, పుస్తకాలు అమ్ముకునేవాళ్లు, అక్కడక్కడ ఆంగ్లో ఇండియన్ (వేషాలు వేసుకున్న) అమ్మాయిలూ-మూర్తి చిత్రంగా పరిశీలిస్తూ ఎన్నెన్నో ఆలోచించుకుంటూ వచ్చాడు. స్టేషన్ అంతా ఎంతో సందడిగా వుంది. ఉసూరుమంటూ వొక బెంచీమీద కూలబడిపోయాడతను. కాస్తంత సేదతీర్చుకున్న తరువాత కాసిని మంచినీళ్ళు త్రాగుదా మనిపించిం దతనికి. కాచీగూడాకు టికెట్టు కొనుక్కొని ప్లాటుఫారంమీదకు వెళ్ళాడు. రైలు యింకా అరగంటదాకా లేదు. చల్లటి మంచినీళ్ళు కడుపు నిండా తాగి 'ముఖం కడుక్కొనటానికి కాదు' అని వ్రాసినప్పటికీ ఆ నీటితో ముఖం కడుక్కుంటే అతడిప్రాణం లేచివచ్చినట్లయింది. చల్లటి మంచినీళ్ళు ఎంత బావుంటాయి అనిపించింది అతడికి. చల్లటి నీటి విలువ జీవితంలో మొదటిసారి తెలిసినట్లుగా అనుభూతి చెందాడతను. ఎంతో సంతోషమైంది. అవసరం లేకపోయినా మళ్ళీ ఇన్ని నోట్లో పోసుకున్నాడు.

ఒక్కసారిగా రైల్వే డిపార్టుమెంటు వాళ్ళమీదనే అతడికి గౌరవం కలిగింది. ఒక బెంచిమీద కూర్చుని దిగులుని కాసేపు మరచిపోయి, చిన్నపిల్లవాడిలా హాయిగా, అమాయకంగా, సంతోషంగా యెన్నడో చూచిన సినిమా పాట ఆలాపించు కున్నాడు కాసేపు.

పెద్ద గడియారం పన్నెండు చూపింది. రైలు వచ్చి ప్లాటు ఫారంమీద ఆగింది. మూర్తి ఒకరిని అడిగి అది తాను పోవలసిన రైలేనని తెలుసుకుని అందులో యెక్కి కూచు న్నాడు. ఆ చల్లటి మంచినీళ్ళ పంపు కేసి యెంతో కృతజ్ఞతతో, ప్రేమతో చూచాడు. అతడికి యెంతో బలమొచ్చింది. ఆ పూటకి భోజనం లేకపోయినా ఫరవాలేదనిపించింది. కాస్సేపటికి రైలు బయలుదేరింది. మూర్తికి ఇందాకటి దిగులు పోయింది, నీరసమూ పోయింది.

యూనివర్సిటీ హాల్ట్‌లో బండి ఆగినప్పుడు యూని వర్సిటీకే వెళ్ళివద్దామా అనిపించింది. కాని, మూర్తి దిగలేదు. కాచిగూడా వచ్చింది. కాని దిగుదామనిపించలేదు. ఆ పక్క స్టేషన్‌లో దిగితే పరంధామయ్యగారింటికి సుళువుగా నడచి పోవచ్చును. ఒక రకమైన భయం మనసు నావహించినప్పటికిన్నీ మొండికేసి అతడలానే కూచున్నాడు. ఐదు నిమిషాల్లోనే రైలు పక్కస్టేషన్ చేరుకుంది. మూర్తి ఇల్లు చేరుకునేసరికి వొంటిగంట పైగానే అయింది.

ఇల్లాలు నడిమి హాల్లో పడుకుని వున్నదల్లా మూర్తిని చూడగానే లేచి కూచుంది. "ఎక్కడకు వెళ్ళావు నాయనా! ఇంత ఎండ పడ్డదాకా. టైము ఎంత అయిందో తెలుసునా ?"

ఛీ ! ఛీ ! పట్నంలో యిలా తిరిగితే చేతి కొస్తారా ? వేళపట్టున భోజనము చేయకపోతే ఆరోగ్యం సరిగా వుంటుందా. లే, కాళ్ళు కడుక్కో" అన్నది.

మూర్తి సిగ్గుపడ్డాడు. అతడికి అమ్మ కళ్ళలో మెదిలింది. అమ్మ యిలా మాటాడేదిగాదు. ఎంతో కోపం చేసేది. మళ్ళీ తాను అంత పొద్దుపోయి రాకుండా వుండేందుకు గాను; అన్నంకూడా తినకుండా వుండేది.

మూర్తి తల వంచుకొని "నేను భోంచేశాను" అని చెప్పాడు. ఆమె అతడివేపు పరిశీలనగా చూసింది.

"ఇలాటి మాటలు నాతో చెప్పకు. ఆమాత్రం నేను కనుక్కోలేకపోను. ఎక్కడా ఇట్లా చెప్పకూడదు నాయనా! నాకు తెలీదనీ, కనుక్కోలేననీ వుద్దేశ్యమా? లే, లే. నాకు తెలుసు. నువ్వు భోజనం చేసిందీ లేనిదీ ముఖం చూస్తేనే కనబడుతుంది". ఆమె స్వరంలో యెంత కోపం వుందో అంత చనువుకూడా వుంది. మూర్తికి సిగ్గుతో చచ్చిపోయినంత పనైంది.

తాను జ్ఞానం వున్నవాడేనా? అని ప్రశ్నించుకున్నాడు.

ఆమెకు ఏం సమాధానం చెప్పాలో కూడ అతడికి తోచలేదు. ఆమె ఇంట్లోకి వెళ్ళి పోయింది. మళ్ళీ వచ్చేలోపున కసితీరా తనని తాను పదిసార్లు తిట్టుకున్నాడు. ఆమె రాగానే బింకంగా "నే నెందు కబద్ధ మాడతానూ, ఏం అవసరం భోంచేసే వచ్చాను" అన్నాడు.

ఆమె ఆశ్చర్యపోయింది.

దగ్గరగా వచ్చి అతి సహజంగా అతడి ముఖాన్ని పైకెత్తి చూసి రెక్కపట్టుకొని ఇంట్లోకి తీసుకుని వెళ్ళింది. మూర్తికి కళ్ళు చెమ్మగిల్లినయి. ఆర్ద్రితవలనకాదు. ఇలాటి లజ్జాకరమైన పరిస్థితులమధ్య చిక్కుకున్నందుకు అసహ్యంతో. ఇల్లాలు ఇలాంటిదని యీ వారం పదిరోజులనుంచీ మూర్తి గ్రహించలేదు. ఇలాటి మనుష్యులని చాలా కొద్ది మందినే చూశాడతను. అతడు వొక్కొక్క ముద్ద ఎంతో బలవంతాన నోట్లో కుక్కుకుంటుంటే అతడిమనస్సు ఇక్కడినుంచి యెంత త్వరగా వెళ్ళిపోతే అంత మంచిదని పదేపదే చెప్పసాగింది. అతడు సిగ్గుతోనూ, అవమానంతోనూ యెంతగానో క్రుంగి పోయాడు. ఇల్లాలు యెదురుగా కూచోవటం అతడికి మరీ బాధాకరంగా పరిణమించింది. ఎలానో అతడు భోంచేశాడు. బయట వరండాలోకి వచ్చేసరికి పోస్టుమాన్ బజారులోవస్తూ కనిపించాడు.

అతడి మనస్సుకి ఆశ కలిగింది.

పోస్టుమాన్ వచ్చి మూడుత్తరాలు ఇచ్చాడు.

రెండు పరంధామయ్యగారికి వచ్చినవి. మూడోది తనకు ప్రాణమిత్రుడు వ్రాశాడు. మూర్తి ఎంతో సంతోషంతో విప్పి చదువుకున్నాడు. "ధైర్యంగా వుండవలసిందనీ, మంచిరోజులు వస్తాయనీ, అంతా శుభంగానూ, సుఖంగానూ, ముందుముందు కాలం పరిణమిస్తుందనీ ప్రతి ఉత్తరంలో లాగానే వ్రాశాడతడు. ఇంకా ఇతర స్నేహితులగురించికూడా వ్రాశాడు. నాలుగైదు రోజుల్లో వొక నలభైరూపాయల దాకా పంపిస్తాననీ వెంటనే ఉత్తరం వ్రాయవలసిందనీ

వ్రాశాడు. మూర్తికి వో రకమైన బలం వచ్చినట్లయింది. ఆ ఉత్తరం చూసినతర్వాత కొంత సంతృప్తి కూడా కలిగింది. రామారావు రూముకి ఓసారి పోయివస్తే బావుంటుం దనిపించింది మూర్తికి. వెంకటేశ్వర్లు నుంచి వుత్తరంవచ్చిందని రామారావుకి చెప్పాలనిపించింది మూర్తికి. రామారావుకి వెంకటేశ్వర్లు స్నేహితుడేకాదు. బంధువుకూడా. పైన, ఆ ఉత్తరంలోకూడా రామారావుని గురించి వివరాలు అడుగుతూ అతడి అడ్రసుకూడా తెలియచేయవలసిందిగా వెంకటేశ్వర్లు వ్రాశాడు.

మూర్తి వో రూపాయి తీసుకుని జేబులోవేసుకుని డబ్బు వొక్కసారి లెక్కపెట్టుకున్నాడు. సరిగ్గా పంథొమ్మిది రూపాయలు వున్నాయి. సంచిలోనే పెట్టేసి తాళం నొక్కి మూర్తి, యింటి ఇల్లాలుని గురించి ఆలోచించుకొంటూ వీధిలోకి నడిచాడు. నడిచి పోదామనే నిశ్చయించుకున్నాడు మూర్తి.

అతడికి పరంధామయ్యగారి భార్య తనతో అలా మాటాడినందుకూ, అంత చనువుగా చూసినందుకూ ఆశ్చర్యంగా వుంది.

అలాగే ఆలోచిస్తూ నడిచాడు.

రామారావుకు ఇవాళ ఆఫీసు వుండవచ్చును. మరి తాను ఇప్పుడే వెళితే అతడు కనిపిస్తాడో కనిపించడో అని అనుమానం వచ్చింది మూర్తికి. చేసేదేమీలేదు. రెసిడెన్సీ పోస్టాఫీసుకి వెడదామనుకున్నాడు. నడిచాడు.

పోస్టాఫీసుకి వెళ్లి రెండు ఇన్‌లాండ్ కవర్లు తీసుకొని వొకటి నాన్నకీ, మరొకటి వెంకటేశ్వర్లుకీ వ్రాశాడు. మూడు దాటింది అప్పటికి. మూర్తి కోఠీ బస్‌స్టాండుదగ్గరకు వచ్చేసరికి బస్ యెక్కుదామనిపించిందతనికి. నెంబరు ఎనిమిది, డబుల్ డెక్కర్ యెక్కి పబ్లిక్ గార్డెన్స్‌వద్ద దిగాడు. రామారావు రూముకి పోవాలంటే లఖడీకా పూల్ దాటి పోవాలి. అయితే ఏడు గంటలు కానిదే రామారావు రూముకి రాడు కాబట్టి కాసేపు పబ్లిక్ గార్డెన్స్‌లోనే గడుపుదామనిపించింది మూర్తికి. అలానే లోపలికిపోయి పార్కంతా కలయతిరిగి చూశాడు. నాలుగున్నర కాగానే రామారావు రూముకేసి బయలు దేరి పోయినాడు. మూర్తి పోయేసరికి రామారావు అప్పుడే ఆఫీసునుంచి వచ్చాడు. మూర్తిని చూడగానే రామారావుకు యెంతో సంతోషమయింది. "ఈపూట భోజనంచేసి ఇక్కడే పడుకోవచ్చును. మనం ఏదేనా మంచి పిక్చరుకి పోదాం" అన్నాడు రామారావు,

కాని మూర్తి అందుకు వొప్పుకోలేకపోయినాడు.

"మళ్ళీవస్తాను. యీసారెప్పుడొస్తే, అప్పుడు వెళ్దాం" అన్నాడు.

నువ్వు నా రూములోకే వచ్చి వుండకూడదూ! మా రూమ్‌మేటుకూడా రెండు నెలలు సెలవుపెట్టి వెళ్ళిపోయాడు" అన్నాడు రామారావు.

ఇద్దరూ కలసి బజారువేపు వచ్చారు.

వెంకటేశ్వర్లువద్దనుంచి ఉత్తరం వచ్చినసంగతి చెప్పాడు మూర్తి. కాఫీతాగి ఆబిడ్స్‌కు వచ్చేసరికి ఏడు కావస్తోంది.

మూర్తి పొద్దుపోకముందే యిల్లు చేరుకున్నాడు. అతడు యెంత ఉత్సాహంగా ఇల్లు చేరుకున్నాడో, ఇల్లు చేరుకున్న తరువాత అంత నీరసపడిపోయాడు.

పదేళ్ళ కుర్రవాడొకడు సావడిలో కూచుని యేడుస్తున్నాడు. వసుధ వాడిని ఎంతెంత పెద్దతిట్లో తిడుతూంది, "చావలేకపోయావు పీడా వదల్తుంది" అంటున్నది.

వాడు యేమాత్రం యేడుపు ఆపకుండానే "రేపు కారుకింద పడతానులే"అంటున్నాడు. సత్యన్నారాయణమూర్తి యీ మాటలు వినలేకపోయినాడు. చిన్నతనంనుంచి తమ ఇంటిలో యెన్నెన్ని బాధలు పడవలసివచ్చినా తల్లిగాని, తండ్రిగాని వొక్క చెడ్డతిట్టు తిట్టి ఉండలేదు. అసలు పిల్లల్ని తిట్టటమంటేనే యేమిటో తెలీకుండా బ్రతికారు వాళ్ళు. సత్యన్నారాయణమూర్తిని చూడటంతోటే వసుధ ముఖం కందగడ్డలా చేసుకుని యింటిలోకి వెళ్ళిపోయింది. మూర్తి దిగాలు పడిపోయాడు.

ఇంటిలోకి పోవటానికికూడా అతడికి మనస్కరించలేదు. ఏమిటో సంకోచమూ, సిగ్గూ, భయమూ అతడిని పెనవైచుకున్నాయి. అతడి హృదయంలో యేమిటో చెప్పరాని దిగులు క్రమ్ముకుంది. మూర్తిని చూసి ఆ పిల్లవాడు యేడుపు మానుకున్నాడు. ఇంతలో యిల్లాలు యింటికి వచ్చి ఆ పిల్లవాడిని రెక్క పట్టుకుని తీసుకెళుతుంటే వాడు బలమంతా ఉపయోగించి వెనక్కు వెనక్కు గుంజుకున్నాడు. ఇల్లాలు బ్రతిమాలింది. "రేపు నాన్నగారు వచ్చింతర్వాత పంపుతాను కదమ్మా" అన్నది. వాడు వినలేదు. గుంజుకున్నాడు. వసుధ లోపల

నుంచే కసిగా అంది; "ఉండనీవమ్మా! ఇవాళ రాత్రంతా అలాగే ఉండనీ. ఇంటిలోకి తీసుకురావద్దు. తీసుకవచ్చినా నేను అన్నం పెట్టేదిలేదు." వాడు కోపంగా జవాబిచ్చాడు; "నిన్నెవరు మాట్లాడమన్నారు. నువ్వే మమ్మల్ని పెట్టి పోషిస్తున్నావు కనకనా!" తల్లి వీపుమీద రెండు చరచి లోపలికి తీసుకపోయింది. మూర్తి రసాతలానికి క్రుంగిపోయినాడు. అతడిని సిగ్గు నరనరానా దహించివేస్తున్నది. రెండు నిముషాలు గడచిన తర్వాత "రా నాయనా! అలా నిలబడపోయావేం?" అని యిల్లాలు మూర్తి నుద్దేశించి చల్లగా పలికింది. మూర్తి లోపలకు వెళ్ళాడు. ఏం చెయ్యటానికి తోచక వసుధ కనపడితే అతడికి సిగ్గూ, కోపమూ, అసహ్యమూ కలుగుతున్నాయి. వసుధ మాత్రం అక్కడ లేదు. వంటింట్లో వుంది.

తాటాకుల చాపమీద వో మూలగా కూచున్నాడు మూర్తి. అతడు ఆలోచిస్తున్నాడు. ఎంత కోపంవస్తే మటుకు, ఎంత నీరసపడివుంటే మటుకు, ఎంత విసుగ్గా వున్నప్పటికీ పిల్లల్ని ఇలా యెలా తిడతారా అనిపించిందతడికి. ఇంకొక దృశ్యం అతణ్ణి విచలితుణ్ణి చేసింది. అతడు వచ్చి ఇన్నిరోజులైనా పరిశీలనగా చూడలేదు. ఇల్లాలు అక్కడే వొకచోట కూచునుంది. ఆమె పక్కనే రెండు మూడేళ్ళ పిల్లవాడొకడు కూచునివున్నాడు. ఆ పిల్లవాణ్ణి చూశాడు మూర్తి. కాళ్ళు కందికట్టె పుల్లల్లా వున్నాయి. చేతులూ అలానే వున్నాయి. పొట్ట కుండబోర్లించినట్లుగావుంది. మూర్తి ఆ పిల్లవాడివేపు చూడలేకపోయినాడు. కళ్ళు విశాలంగా వున్నా, కాంతి లేక

పోవడంవల్ల ముఖమంతా పీక్కుపోయివుంది. ఎవరైనా హఠాత్తుగా ఆ పిల్లవాడివేపు చూస్తే ప్రాణం గిజ గిజలాడిపోతుంది. హృదయంలో ఎంతైనా బాధ కలుగుతుంది. కళ్ళు చెమరుస్తాయి. మూర్తి వాడివేపు పరిశీలనగా చూశాడు. ఇంత బాధాకరమైన జీవితాన్ని అనుభవిస్తూ పరంధామయ్యగారు ఇలా యెలా వుండగలుగుతున్నారా అనుకున్నాడు. ఆ ఇంట్లో వున్న ప్రతి వ్యక్తిపైనీ యెనలేని జాలికలిగింది. ఆ చిన్న పిల్లవాడు యెంతో ప్రయత్నంతో వాళ్ళమ్మవేపు జరిగి ఆవిడ ముఖంలోకి చూస్తూ నవ్వుతున్న దృశ్యం మూర్తిని కదిలించి వేసింది. అతడి కళ్ళవెనుక నీళ్లునిలిచాయి. ఇల్లాలు చిన్నవాణ్ణి దగ్గరకు తీసుకుని ముద్దుపెట్టుకుంటుంటే అతడి కళ్ళలోని నీళ్ళు ఇంకెవరూ చూడకుండా మూర్తి పక్కకు తిరిగి తుడుచుకున్నాడు.

ఈ ప్రపంచం చిత్రమైంది. అందరికీ కష్టాలు వుంటాయి. అవి అంతరాన్నిబట్టి వస్తూంటాయి. ఒక్కడూకూడా శాంతితో తృప్తితో జీవించలేడు. ఎవడికితగ్గ కష్టాలు వాడివి. ఊహ తెలిసినప్పటినుంచీ తెలిసి తెలిసి యే వ్యక్తీ పతనమై పోదామని కాని, కష్టాలు కోరి తెచ్చుకుందామని కాని అనుకోడు. కాని జీవితంలో యెదిగిన తర్వాత వొక్కొక్కవ్యక్తి ఇన్నిన్ని బాధలతో యెందుకు సతమతమైపోవాలి. ఇలాంటి వ్యక్తులను చూస్తూనే కదా కర్మసిద్ధాంతం బలంచేకూర్చుకుంటున్నది. మనిషి బాధపడుతున్నాడు. ఈ బాధలు యెందుకు కలుగుతున్నాయి? అని ప్రశ్నించుకున్నప్పుడు సమాధానం అంటే సరిపోదు. తృప్తికరమైన సమాధానం వచ్చేందుకు కర్మ

సిద్ధాంతంలో ఇంకో సుళువు వుంది. అన్ని వర్గాల ప్రజలను, అంటే మేధావి వర్గాలనుండి యేమీ తెలియని, అసలు ఆలోచించలేని వాళ్ళవరకు దీన్ని వర్తింపచేయవచ్చు. అంతా సంతృప్తిపడతారు. చేసుకున్న కర్మ, చేసుకున్న పాపం అని సరిపెట్టుకో వచ్చును. హేతువాదం కర్మసిద్ధాంతం ముందు మనలేదు. కారణం బహుళ ప్రజానీకపు రక్తంలో జీర్ణించి పోయినది కర్మ సిద్ధాంతం.

మూర్తి యేమిటేమిటో ఆలోచిస్తూ కూచున్నాడు. పదేళ్ళ కుర్రాడు యేడుపు మానేశాడు. వాడి పేరు శివరావు. తల్లి వాడికి బుద్ధులు చెప్పింది. "చూడమ్మా శివా, ఆ బాబును చూడు, యెంత బుద్ధిమంతుడో. ఎక్కడో తెనాలినుండి ఇంతదూరం చదువుకునేందుకు వచ్చాడు. అమ్మను ఇలా యేడిపిస్తే చదువురాదు. నాన్నగారు వచ్చిన తర్వాత నీక్కావలసినవన్నీ అడిగి కొనిపెట్టించుకోవాలి. పాపం అక్కయ్య పొద్దుననగా స్కూలుకు వెళ్ళి విసుగుతో ఇంటికివస్తే రాగానే తిరణాలచేస్తే దానికి యెలావుంటుంది చెప్పు. ఇంకెప్పుడు ఇలా గోలచేయకూడదు. అమ్మను యేడిపించకూడదు. అమ్మను యేడిపించిన వాళ్ళను నరకంలో పడేస్తారు. ఎఱ్ఱటి కొరువులను పెట్టి కాలుస్తారు. తెలుసా! అందుకని చచ్చిపోకూడదు. చావంటే యేమిటనుకున్నావో మరి."

"మరి అక్కయ్యే నన్ను చావమని యెందుకు తిట్టాలి..." అన్నాడు వాడు ఎక్కుతూ.

"ఛా, అలా యెందుకు తిడుతుంది నాన్నా, దాని నోరు మంచిదికాదు. పొద్దుటినుంచి అలసి అలసి ఇంటికివస్తే అది రాగానే నువు యేడుపు సాగిస్తివి. ఆ కోపంలో అన్నది."

వాడేమీ మాట్లాడలేదు కాసేపటిదాకా. తేరుకుని "నాన్నగారు వచ్చిన తర్వాత మీరన్నమాటలన్నీ చెప్పనా యేం" అన్నాడు.

వసుధ వంటింట్లోంచి వస్తూ "నువు చేసిన గోలమాత్రం చెప్పనా యేమిటి" అన్నది.

"ఇదే వద్దన్నది. నీతో యెవరు మాట్లాడారు ఇప్పుడు" అన్నాడు వాడు.

"నీతో యెవరు మాట్లాడుతున్నారు పోవోయ్! మా ఇంటిలో వో వెధవున్నాడు. వాడితో మాటలాడు తున్నాను" అన్నది వసుధ చిన్న తమ్ముడిని యెత్తుకుని ఇంటిలోకి తీసుక వెడుతూ. శివరావుకి కోపము వచ్చింది. కోపం వచ్చినప్పుడు వాడు ఏం చేస్తాడో ఇంటిలో వాళ్ళందరికీ తెలుసు. వాడి గొంగళీ, దిండూ తీసుకొని గోడవారగా పక్క పరచుకునే సన్నాహం చేస్తున్నాడు. సత్యాగ్రహం అన్న మాట. అంటే నిరసన వ్రతం. వాడికీ తెలుసు. అంతా భోజనాలుచేసి పడుకున్న తర్వాత యెంత పొద్దుపోయినా అమ్మ కలిపి నోట్లో పెడుతుందని. మూర్తికి చిత్రంగా వుంది శివరావును చూస్తుంటే. కొద్దిగా నవ్వుకూడా వస్తున్నది.

పదిహేను, ఇరవై నిమిషాలు గడిచిన తర్వాత చిన్న తమ్ముడిని తీసుకవచ్చి తల్లి చేతికిస్తూ, "వీడీపూట యేమీ తిన లేదమ్మా" అని చెప్పింది తల్లికి వసుధ.

తరువాత ఇల్లాలు మాట్లాడింది— "నాయనా! వారి పూటకూడా రానట్లేవుంది. నువ్వు లేచి భోజనం చెయ్యి. శివా, కాసిని నీళ్ళు తీసుకొచ్చి ఇవ్వమ్మా!"

శివరావు అంత కోపంలో వున్నవాడుకూడా వెంటనే లేచాడు. అయితే కోపంగానే లేచాడు. కోపంగానే నీళ్ళు తెచ్చాడు. కోపంగానే మూర్తిదగ్గర చెంబు పెట్టాడు. కోపంగానే మళ్ళీ పోయి పండుకున్నాడు.

మూర్తి లేచి కాళ్ళు కడుక్కొని విస్తరిముందు కూచున్నాడు. వసుధ అక్కడ అతడికి అన్నీ వడ్డించింది. ఇంటి ఇల్లాలు వచ్చి గడపలో కూలబడింది.

వసుధ "శివాయనుకూడా పిలవరాదుటే అమ్మా, మళ్ళీ ఆ వెధవకోసం పొద్దుపోయినదాకా సాగదీస్తూ కూచోవాలి కాబోలు" అన్నది.

తల్లి శివుణ్ణి పిలిచింది.

వాడినుంచి యేమీ సమాధానం లేదు.

చిన్నపిల్లవాడు మధ్య హాలులో గుక్కపట్టి యేడుపు లంకించుకున్నాడు. తల్లి లేచి పోయింది.

వసుధ శివుణ్ణి రెండుసార్లు పిలిచి, విసుక్కుంది.

మూర్తి తల దించుకొని భోజనంచేసి బయటపడ్డాడు.

ఆ రాత్రి పరంధామయ్యగారు వూరినుంచి రాలేదు.

ప్రొద్దున్నే మూర్తి ఇంటి ఇల్లాలుతో తాను స్నేహితుడి రూముకు వెళ్ళిపోతున్నానని విశదంగా చెప్పినప్పుడు ఆమె, అంగీకారం సూచించే స్వరంతో "ఆయన ఇవాళో, రేపో

యెలానూ తప్పకుండా వస్తారుకదా - అప్పుడే వెళ్ళిపోవచ్చుగా" అన్నది.

మూర్తి ఆమెకు వివరంగా చెప్పాడు.

వసుధవేపు చూశాడు. అతడి కెందుకో అక్కడ వుండేందుకు యే మాత్రమూ ఇష్టం లేకపోయింది.

వసుధ కళ్ళలో వో రకమైన నిరీహమైన నిర్లిప్తతతో కూడిన భావాన్ని "మీరు వెళ్ళవచ్చునా" అన్నట్లుగా అతడు చదువుకున్నాడు.

అప్పుడే శివరావు లేచి ముఖం ముటముట లాడించుకుంటూ యింటిలో అటూ యిటూ తిరుగుతున్నాడు. చిన్నపిల్లవాడు గుక్కపట్టి ఏడవటం సాగించాడు.

వాడివేపు చూసినతర్వాత మూర్తికి ఇక అక్కడ వుండటం దుర్భర మనిపించసాగింది.

ఇల్లాలు చివరకు "సరే నాయనా! భోజనం మాత్రం ఇక్కడే చేసిపోతూండు యీ నాలుగురోజులూ" అన్నది.

"చాలా దూరం. రావటానికి కుదరదు" అన్నాడు మూర్తి తలవంచుకొని.

ఆమె బాధపడింది.

"సరేను మరి. ఆయన యింటిలో వున్నట్లయితే నీకు నేను చెప్పవలసిన అవసరమే వుండేదికాదు. నీ యిష్టం. అంతా నీకు యెలా బావుంటుందని తోస్తే అలాగే చెయ్యి" అన్నది.

మూర్తి ఒక్కసారిగా చలించిపోయాడు. ఆమె అలా మాట్లాడుతుందని అతడు ఊహించి వుండలేదు.

కొన్ని క్షణాలు మౌనంగా ఆలోచించుకొని తన పెట్టె దగ్గరకు పోయి ఏమీ తోచనందువల్ల పెట్టె తెరచి ఏమిటో చూసి మళ్ళీ మూసి తాళం నొక్కి కాసేపలానే కూచున్నాడు.

పది గంటలదాకా అతడలానే గడిపాడు.

తరువాత లేచి పెట్టె తీసుకొని యిల్లాలుతో 'వెళ్ళి వస్తాను' అని చెప్పాడు. ఇంటిలో వాళ్ళందరివేపూ ఓసారి కలయ చూశాడు. కాని ముందుకు నడుస్తూ మనస్సులో అనిపించినా వెనక్కు తిరిగి వొక్కసారైనా వసుధవేపు చూచేందుకు సాహసించలేకపోయాడు.

వసుధ అతడి వెనకాలనే స్కూలుకు పోయేందుకు వాకిలి దాటింది.

# 5

రామారావు రూములో చేరినతర్వాత సత్యన్నారాయణమూర్తికి హాయిగానే వుంది. గది అద్దె ఇరవై రూపాయలు కావటం వలన వొకమోస్తరు వసతిగానే వుంది. ఈమధ్య రాజధానీ నగరమైన తర్వాత హైదరాబాదులో చెప్పుకోదగిన విశేషం యేమిటంటే యెక్కడబడితే అక్కడే తెలుగు వినరావటం, తెలుగు హోటళ్ళు కనరావటం. ఖైరతాబాదులో యెవరో గుంటూరు జిల్లానుంచి వచ్చి వో డబ్బుగలాయన గోంగూరపచ్చడీ, ఆవకాయ హోటలు పెట్టాడుట. రామారావు అక్కడే భోజనం చేస్తున్నాడు. నెలకు ముప్ఫైఆరు రూపాయలు. మూర్తికి కష్టంగానే వుంది. అయినా గత్యంతరం లేకపోయింది. రెండు రోజులదాకా పరంధామయ్యగారింటికి పోలేదు. ఒక సాయంకాలం వెళ్ళినప్పుడు పరంధామయ్యగారు యింట్లోనే వున్నారు. ఆయన మందలించే ధోరణిలో చూసీ చూడటంతోటే "నువ్వెందుకు వెళ్ళిపోయినావు. నేను నీకు పరాయివాణ్ణి కాదు. మీనాన్న నీకు నా సంగతి సందర్భం సరిగా చెప్పివుండడు" అన్నాడు.

మూర్తి ఆయన మాటలు విన్నతర్వాత మరీ సిగ్గుపడ్డాడు.

"అదేమీ కాదు. చిన్నప్పటినుంచీ చాలా దగ్గర స్నేహితుడవటంవలన అతడి రూముకు వెళ్ళాను. నాన్న మీ గురించి చాలా చెప్పారు. అందుకేగదా యీ మహానగరంలో వెతుక్కుంటూ మీ యింటికి వచ్చాను" అన్నాడు.

ఈ సమాధానానికి ఆయన సంతృప్తిపడినట్లు కనిపించినా అసంతృప్తి కనపరచే స్వరంతో "యీ నాలుగు రోజుల్లోనే నువ్వు చాలా చిక్కిపోయినట్లు కన్పిస్తున్నావు. కాఫీలు యెక్కువమార్లు త్రాగకు. ఇంతదూరం వచ్చిన తర్వాత ముఖ్యంగా ఆరోగ్యం కాపాడుకోవాలి గదా" అన్నాడు.

మూర్తి అవునని తల వూపాడు.

"నీ విషయం నేను కనుక్కున్నాను. నాకు తెలిసిన ప్రొఫెసరుగారు వొకాయన వున్నారు. నిన్న సాయంకాలం వాళ్ళింటికి వెళ్ళి నీ విషయం ఆయనతో హెచ్చరించాను. ఆయన శాయశక్తులా ప్రయత్నించి నీకు సీటు వచ్చేట్లు చేస్తానని చెప్పారు" అన్నాడు పరంధామయ్యగారు.

మూర్తి హృదయం కృతజ్ఞతతో బరువెక్కి ఆయనకు లోపలనే నమస్కరించాడు.

"మీ యూనివర్శిటీ వాళ్ళకు ఒకటో రెండో సీట్లు మాత్రమే రిజర్వు చేశారట. అయినా నీకు తప్పక వస్తుంది. రేపెప్పుడైనా ఆదివారం ఆయన యింటికి నిన్ను తీసుకుని వెళతాను. రెండు మూడు రోజుల్లో లిస్టు వేస్తారుట. మొదటి టరమ్ ఫీజు యనభై అయిదు రూపాయలదాకా వుంటుందట. నీకు రెండు మూడు ట్యూషన్లున్నా దొరికితే బావుండును.

నేను ప్రయత్నం చేస్తానులే. నువ్వు కూడా కనుక్కుంటూ వుండు" అన్నా రాయన.

మూర్తికి నోటమాట రాలేదు. సంతోషంయెక్కువై కళ్ళు చెమ్మగిలినయ్.

వసుధ కాస్త దూరంలో చాపమీద కూచుని ఎఱ్ఱటి పెన్సిలుతో యేవో పుస్తకాలు దిద్దుకుంటున్నది. మధ్య మధ్య మూర్తి వసుధవేపు చూస్తున్నాడు. ఆ అమ్మాయి కూడా ఒకటి రెండుసార్లు తలయెత్తి వీళ్ళు మాట్లాడుకునే విషయాన్ని ఆసక్తితో విందామని ప్రయత్నం చేసినట్లుగా చూసి యింతలోనే మళ్ళీ తన పనిలో తాను నిమగ్నురాలవుతున్నది. ఒకటి రెండుసార్లు వసుధ తల యెత్తినప్పుడు మూర్తి ఆమె కళ్ళలోకి చూశాడు. కాని ఆమె కళ్లలో ఏమాత్రమూ ప్రసన్నభావం అతడు చూడలేకపోయాడు. ఆ కళ్లు విసుక్కుంటున్నాయి.

పరంధామయ్యగారు "డబ్బు విషయం ఏదో చూద్దాంలే, నువ్వు బెంగపెట్టుకోని నాన్నకు ఉత్తరాలు వ్రాయకు" అన్నప్పుడు వసుధ సవాటుగా మూర్తి వేపు చూసింది.

మూర్తి సిగ్గుపడి కృంగిపోయాడు.

అతడికి సిగ్గయింది.

ఆమె తననిగూర్చి యేమనుకుంటున్నదో ?

"సీటు వస్తే టరమ్ ఫీజు కట్టుకునేందుకు నా దగ్గర డబ్బు వున్నది" అన్నాడు తను.

"భేష్" అన్నారు పరంధామయ్యగారు.

చిన్నపిల్లవాడు ఇంట్లోంచి యేడుపు లంకించుకున్నాడు. విసుక్కుంటూ వసుధ పోయి వాణ్ణి యెత్తుకుని తీసుకుని వచ్చి

తన పక్కనే కూర్చొనపెట్టుకుని మళ్ళీ తనపని తాను చూసుకో సాగింది.

మూర్తికి తండ్రి వద్దనుంచి ఒక ఉత్తరం వచ్చింది. పరంధామయ్యగారు ఆ కార్డు తెచ్చియిచ్చారు. మూర్తి చదువు కున్నాడు. క్షేమ సమాచారాలతో పాటు సీటు రాకపోయేట్లయితే వెంటనే తిరిగి రమ్మని కోరారాయన ఆ ఉత్తరంలో. ఆపైన యేదేనా ఉద్యోగ ప్రయత్నం చేదామని కూడా వ్రాసారాయన.

పరంధామయ్యగారన్నారు "నువ్వు వెళ్ళిపోవద్దు. అదృష్టం యెలావుందో, పెద్ద చదువు చదివినందువలన ఎందుకైనా ఉపయోగమేను."

సత్యన్నారాయణమూర్తికి యెక్కడలేని ఉత్సాహమూ వచ్చేసింది. ఈ నగరం వచ్చినతర్వాత యెప్పుడూ అతడంత ఉత్సాహపడి యెరుగడు. ఆ చల్లని సాయంకాలం భవిష్యత్తులోకి కళ్లు తెరచి చూచి అక్కడంతా సుఖమూ సంతోషమూ, శాంతీ తప్ప యేదీ వుండదని పదే పదే అనుకోసాగాడు. వీధుల్లో నడుస్తున్నా అతడికి మధురమైన వూహాలే పరవశత్వం కలుగచేస్తున్నాయి. నాలుగురోజుల క్రితమే వెంకటేశ్వర్లుకు అతడు వీలైనంతత్వరలో డబ్బు పంపించమని ఉత్తరము వ్రాశాడు. వెంకటేశ్వర్లు వో నలభై యాభై పంపించినప్పటికీ తన దగ్గర దగ్గర దగ్గర ఇరవైదాకా వున్నాయి. ఇంకా ఇలానే అత్యవసర పరిస్థితులలో రామారావు వద్దనుంచి కొంత తీసుకోవచ్చును. తన కెలాగైనా సీటు రావాలే కాని ఎంత కష్టపడైనా చదువు కొనసాగించేందుకే మనసులో దృఢ

నిశ్చయం చేసుకున్నాడు. ఎలానో యీ రెండు సంవత్సరాలు తినో, తినకనో కళ్లు మూసుకుంటే తరవాత ఎక్కడైనా రెండువందల రూపాయల ఉద్యోగం దొరక్కపోదు. పాపం కష్టపడుతున్న అన్నయ్యకు నెల నెలా వొక వంద రూపాయలు పంపించవచ్చును. ముసలితనంలోనైనా నాన్నను సుఖపెట్ట వచ్చును. జీవితంలో యెన్నోరకాల కష్టాలతో, కన్నీళ్ళతో పాపం ఆయన మోడువారిపోయాడు. అందువలన ఈ చరమ జీవితమైనా సుఖశాంతులతో గడిపేలా తాను తప్పక చూడాలి. ఇక వాసు వున్నాడు. మనసులో వాసు మెదిలే సరికి మూర్తికి వొకేసారి సంతోషమూ, దుఃఖమూ కూడా కలిగినై. వాసు ఎంతో తెలివైనవాడు. అన్నయ్యకంటే కూడా తెలివైనవాడు. పాపం వాడికి ఆరోగ్యం సరిగా వుండటం లేదు. ఆలనా పాలనా లేదు. అందువలన వాడి చదువు సంగతి యెవరూ పట్టించుకునేందుకు వీలులేకుండా వుంది. తనకు మంచి ఉద్యోగం వచ్చినప్పుడు వెంటనే వాసుని తన దగ్గరకు తెచ్చుకుంటాడు. వాడికి మంచి మందులు, వొంటికి బలంవచ్చే మందులు యిప్పిస్తాడు. తరు వాత ట్యూషన్ చెప్పించియైనాసరే వాడికి బాగా చదువు వచ్చేలా చూస్తాడు. వాసు చదువుకునేందుకు తానలా కష్టపడ వలసిన పనివుండదు. వాడికి అన్నిరకాలైన సౌకర్యాలు తను చేస్తాడు. తనలాగ మంచిబట్టలు లేకుండా, పుస్తకాలు లేకుండా, టరమ్ ఫీజులు కట్టుకునేందుకు తల బద్దలు కొట్టు కుంటూ కాలం గడపవలసిన అవసరం వాడి కెప్పుడూ కలుగ కూడదు. వాడు చాలా పెద్ద చదువులు చదువుతాడు.

ఏ ఇంజనీరో, డాక్టరో అయితే తమ వంశానికి ప్రతిష్ఠవస్తుంది. ఫలాని వారబ్బాయి, ఫలానివారి తమ్ముడు అని చెప్పు కుంటారు. పాపం, వాళ్ళ రెండో అన్నయ్య సత్యన్నారాయణ మూర్తి కష్టపడి చదువు చెప్పించాడండీ - అని అంతా అను కుంటారు. సత్యన్నారాయణమూర్తి చిత్రవిచిత్రాలైన వూహా లతో బజార్లో హుషారుగా నడుస్తున్నాడు. ఉన్నట్లుండి అత డికి అక్కయ్య గుర్తువచ్చింది. అతడి మనసులో జ్వాల నాలు కలు సాచి రేగింది. ఎంత అప్రతిష్ఠ తెచ్చింది అక్కయ్య తమ వంశానికి. తమ వంశగౌరవం మంటకలిపింది. అందువల్లనే అమ్మ దిగులుతో చచ్చిపోయింది. నాన్న తలయెత్తుకో లేకుండా వున్నాడు. అన్నయ్యకు పెళ్ళి సంబంధాలు రావటం లేదు. తను యింతగా మానసికమైన వ్యధలతో రోజు రోజుకు క్రుంగిపోతున్నాడు. ఆమె తనకు అక్కయ్య కాదు. ఆమె తనకు అక్కయ్యగా పుట్టకపోయినా బావుండేది. ఆమె వలననే వొక సంసారం చితికిపోయింది. ఒక సమష్టి కుటుంబం యొక్క స్థితిగతులను తృణీకరించి, తన వొక్కదాని సుఖాన్ని ప్రధానంగా యెంచుకుని నలుగురిలో నగుబాట్లు తెచ్చేందుకు గాను వెళ్ళిపోయింది. ఊళ్లోవాళ్లు లేచిపోయింది అంటున్నారు. తాను వాళ్ళ కేమని సమాధానం చెప్పాలి.

సత్యన్నారాయణమూర్తి మనస్సు అక్కనుగూర్చిన ఆలో చనలతో, అశాంతితో నిండిపోయింది. ఆబిడ్ సెంటర్ దాకా నడిచే వచ్చాడు. అక్కడ డబుల్ డెక్కర్ ఎనిమిది నెంబరు బస్ యెక్కి లకడీకా పూల్ దాకా వెళ్ళాడు. రూముచేరుకునే

సరికి ఏడున్నర దాకా అయింది. రామారావు యెదురు చూస్తున్నాడు.

రామారావు అన్నాడు. "మూర్తీ నీకూడా పదిహేను రోజులకు మీల్స్ టికెట్లు తీసుకుంటాను."

మూర్తికి చిన్నతనమైంది. "నావద్ద డబ్బు వున్నది" అని మాత్రమే అనగలిగాడు.

"ఫరవాలేదు. తరువాత యెప్పుడేనా ఇద్దువుగానిలే. నువ్వు లెక్చరర్ అయిన తరువాత" రామారావు నవ్వాడు. మూర్తికూడా నవ్వాడు. రామారావు మాటాడేతీరు మూర్తి మనసులోని మాలిన్యాన్ని కడిగివేసింది. అతడి మనసంతా తేలికపడింది. గంటక్రితం చేసిన వూహాలన్నీ మళ్ళీ మనసులో తిరిగినై. భవిష్యత్తు సుఖం తెస్తుంది అని తీయనైన వూహాలు చేశాడు. మనసు చెప్పింది. రామారావును అప్పుడు మరచి పోయేవుసుమీ, మరచిపోకూడదు. ఏదేనా పనిబడి రామా రావు నువు ఉద్యోగం చేస్తున్న వూరికి వస్తాడు. అప్పుడు నువ్వు అతడిని యెంతో గౌరవంతో, ఆదరంతో ఇంటికి తీసుకుని వస్తావు. అతడిని ఆనందంతో ముంచి తేలుస్తావు. ఇంటికంటున్నావే. రూముకి అనరాదూ! అతడి మనసులోని వూహతో తీయదనం తీగలు సాగింది. కళ్ళు వాక విలాసాన్ని ప్రదర్శించుకున్నాయి. చిరునవ్వు ఒక సొగసుదనం తెచ్చు కున్నది. సిగ్గుపడ్డాడు. అప్పటికి తనకు పెండ్లవుతుంది. కావచ్చు. ఆవిడతో రామారావుకీ తనకూ వున్న ప్రాణ మిత్రత్వాన్ని గురించి ముచ్చటిస్తాడు గామోసు! ఆవిడ యేమంటుంది. రామారావుని ఆమే గౌరవిస్తుంది. సత్యన్నారాయణమూర్తి

యీా మధురమైన వూహాలలో, తలపులలో అక్కయ్య గుర్తుకు రాలేదు. అక్కయ్య చేసిన తప్పు ఏమిటో అతడికి ఈ వూహా లలో అక్కయ్య గుర్తుకి వస్తే తోచి వుండేది. కాని ఈ మధులో పూలకే పాదుచేసి, తీగ పెంచి సాగి పూలు పూచేట్లు చేసి ఆనందించాడు మూర్తి. రామారావు పక్కనే కూచుని భోజనం చేస్తుంటే అతని హృదయంలో రామారావే నిండి నట్లు తోచింది మూర్తికి. రామారావు చాలా మంచివాడు అన్న విషయమే అతడికి ముఖ్యంగా తోచసాగింది. మానవుని సహజమైన బలహీనత ఇది. స్వార్థంయొక్క ప్రాథమిక రూపం. అవతలివ్యక్తి మనకు ఆర్థికంగా తోడ్పడుతున్నాడు అనే ప్రాథమిక విషయం గుర్తు వుండక అవతలివ్యక్తి గుణగణాలు, ఔన్నత్యం, మంచితనం మాటిమాటికీ మదిలో మెదులుతూ వుంటాయి. ఇటువంటి సమయాలలో. అవసరానికి అప్పు యిచ్చిన వాడుకూడా యెంతో మహానుభావుడుగా మనస్సు చెపుతుంది. జీవితంలో అడుగడుక్కీ డబ్బు మోసం చేస్తున్నది. డబ్బుకూ స్నేహానికీ సంబంధం. డబ్బుకీ ప్రేమకీసంబంధం. డబ్బుకీ వాత్సల్యానికీ సంబంధం. ఇది అందరికీ అన్ని కాలా లకూ వర్తించే సిద్ధాంతం కాకపోవచ్చును. ఎక్కడైనా, ఎప్పుడైనా, ఎందుకైనా అపవాదులు వుండవచ్చును. అయినా స్థూలదృష్టికి మామూలు మనుషులందరికీ యీా సిద్ధాంతం వర్తిస్తుంది.

ఆవాళ రాత్రి రామారావు, సత్యన్నారాయణమూర్తీ నిద్రపోయేసరికి వొంటిగంటపైన అయింది. సత్యన్నారాయణ మూర్తి యేమాత్రం సిగ్గుపడకుండా తన కథ యావత్తూ

రామారావుకు చెప్పుకున్నాడు. చుక్కలు విరిసిన ఆ రాత్రి. యేమాత్రమూ అవమానం మనస్సున పొందకుండా తమ కుటుంబ చరిత్ర యావత్తూ తు. చ. తప్పకుండా పొల్లు పోకుండా రామారావుకి విన్పించాడు. అవమానకరమైన చరిత్రను, అతి ఉత్సాహంతో రామారావు విన్నాడు. తాను మద్రాసులో బి. యస్ సి. చదువుకోవటమూ, అక్కడ తనకు స్కాలర్‌షిప్ రావటమూ, ఆ మహానగరంలో తనని అభిమానించిన మిత్రుల చరిత్ర, కాలేజీలో అమ్మాయిల విషయాలు, ఒక్కొక్క రోజున తాను యెంత వ్యధ చెందినదీ, అక్కయ్య యెవరితోనో ఇంటినుంచి వెళ్ళిపోవటం, అమ్మ చనిపోవటం ఇత్యాదిగా అన్ని విషయాలూ చెప్పాడు. తనకు తానై ఆలోచించుకొంటానికే జరిగిన దుఃఖ గాధను మననం చేసుకొనటానికే బాధపడేమూర్తి, చిత్రంగా ఆ చల్లటి రాత్రి వేళ రామారావుకు చెప్పుకున్నాడు. పోనీ చెప్పుకున్న తర్వాతనైన సిగ్గుపడలేదు. మనసు నెలితి పడలేదు.

ఇలా యెందుకు తన కష్టగాధను విన్నవించుకున్నాడు ?

అని ప్రశ్నించుకుంటే, అతడి బలహీనమైన హృదయాన్ని రామారావు పూర్తిగా జయించాడు కనుక - అని సమాధానం చెప్పవలసి వుంటుంది. ప్రస్తుతం నిష్కల్మషమైన అంతఃకరణ గలవాళ్ళు, ఇటువంటి పరిస్థితులలో రహస్యాలనుకున్నవాటిని గాని, తాము అవమానకరమైనవిగా యెంచుకునే విషయాలను గాని దాచరు.

సత్యనారాయణమూర్తికి గతంలోని మంచిరోజులన్నీ గుర్తుకు వచ్చినై. చిన్నతనంలో తమ కుటుంబం యెంత ఆనం

దంగా కాలక్షేపం చేసింది, అప్పుడు రామారావుతో తనకు గల స్నేహసంబంధమూ అంతా గుర్తుకు వచ్చి, అప్పటినుంచి అతడు విడిపోయిన నాటినుంచి యీ నాటివరకూ రూపొందిన కష్టగాథల నన్నిటినీ యేకరువు పెట్టాడు. తేలికపడుతున్న హృదయంతో విన్నవించుకున్నాడు.

రామారావుకి ఉత్సాహంగా వుండటానికి కారణ మేమిటి? అని ప్రశ్నించుకున్నప్పుడు మామూలు మనిషి చిత్త ప్రవృత్తి అది అని సమాధానం చెప్పుకోవచ్చు. మామూలు మనిషి యెదుటివాడి కష్టగాథ వినటానికి ఇష్టపడతాడు. మామూలు మనిషి అంతఃకరణ ప్రవృత్తి అది. ఎదుటి వ్యక్తి కష్టగాథ అతన్ని బాధ పెట్టవచ్చునుగాక వింటానికి ఇష్టపడటంలో వి(ప్రవృత్తి యేమీ లేదు. అప్పుడే యెదుటి వ్యక్తి హృదయంలో సానుభూతికి, అర్ద్రితకు చోటు యేర్పడుతుంది.

సత్యన్నారాయణమూర్తి హాయిగా నిద్రపోయినాడు.

రామారావుకుమాత్రం వెంటనే నిద్రపట్టలేదు.

చాలాసేపటివరకూ సత్యన్నారాయణమూర్తిని తలచుకొని అతడు జాలిపడుతూనే వున్నాడు. అతడికి తాను యీ మాత్రం సాయం చేసినందుకు అభినందించుకుంటూనే వున్నాడు. కాని సత్యన్నారాయమూర్తి తను చేసిన యీ సహాయం మరచిపోకూడదు. అతడు రెండేళ్లూ యం. యస్ సి. చదువుకుంటాడు. తరువాత పెద్ద ఉద్యోగం వస్తుంది. ఇంత విశాలమైన దేశంలో యే మహానగరంలోనో పెద్ద ఉద్యోగం రావచ్చు. అందమైన పెళ్ళాం రావచ్చు. సుఖపడవచ్చు

అప్పుడు తనని మరచిపోతాడేమో? ఈ రోజులతని గుర్తుకి రావేమో. రామారావుకి అసంతృప్తి కలిగింది. అయినా తాను మంచిపని చేశాడు. అతడు మరచిపోవటమే తటస్థిస్తే అతడికంటే తాను ఉత్తముడన్నమాట. సత్యన్నారాయణ మూర్తితో తనస్నేహం విడిపోయికూడా చాలా రోజులయింది. తలవని తలంపుగా తాము ఒకచోట కలుసుకున్నారు.

రామారావు ఇలాటి ఆలోచనలతో నిద్రపోయినాడు.

ప్రొద్దున యిద్దరూ చాలా పొద్దుపోయి నిద్ర లేచారు.

సత్యన్నారాయణమూర్తి పగలుకూడా నిద్రపోవచ్చు. కాని రామారావుకి ఆఫీసువుంది. పొద్దున్న నిద్రలేచినతర్వాత తమ ఇద్దరిమధ్యా రాత్రి జరిగిన సంభాషణని తలుచుకొని రామారావు బాధపడ్డాడు. సత్యన్నారాయణమూర్తి బాధపడ్డాడు. సిగ్గుపడ్డాడు.

ఇద్దరూ పదిగంటల లోపునే భోజనంచేసి వచ్చారు. రామారావు ఆఫీసుకు వెళ్ళిపోయాడు. మూర్తి పక్క కరచుకొని విశ్రాంతిగా పడుకున్నాడు. అయినా అతడికి నిద్రరావడం లేదు. పోస్టుమేన్ యెప్పుడు వస్తాడా అని అతడి హృదయం ఆరాటపడసాగింది. ఏమిచేయటానికి తోచలేదు. నిన్న సాయంకాలం పరంధామయ్యగారింటిలో జరిగిన సంభాషణా, ఆయన మంచితనం, వసుధ, వసుధ చిన్నతమ్ముడు, రామారావు సహృదయత, క్షణక్షణానికీ అతడికిగుర్తొస్తున్నాయి. వసుధ గుర్తొచ్చినప్పుడు అతడి హృదయంలో చిత్రమైన ఊహాలు కలుగుతున్నాయి. ఆ అమ్మాయి యెప్పుడూ విసుక్కుంటుందియేమిటో అనుకున్నాడతను. వసుధ చిన్న తమ్ముణ్ణిగురించి

తలపు వచ్చినపుడు అతడికెంతో జాలి కలుగుతున్నది. పరంధామయ్యగారిని గురించి బాధకలుగుతున్నది. వాళ్ళ భవిష్యత్తుని గురించి తలచుకున్నప్పుడు కన్నుల్లో చెమ్మ వూరుతోంది. పాపం ఆ కుర్రాడు-అనిపిస్తుంది.

అతడికేమీ తోచకపోతుంటే ఒక పుస్తకం తీసుకున్నాడు.

నాలుగైదు రోజులక్రితం రామారావు బుక్ షాప్‌లో కొనుక్కొని వచ్చాడు. రామారావు యెప్పుడూ తీరిక సమయాలలో అటువంటి పుస్తకాలు చదువుతూంటాడు. కాని సత్యనారాయణ మూర్తికి నవలలుకాని, కథలు కాని చదివే అలవాటు బొత్తిగా లేదు. అవంటే అతడికి ఓ రకమైన అసహ్యంకూడాను. ఎందుకో అతడికే తెలీదు. అక్కయ్య యెప్పుడూ చదువుతుండేది. ఏదైనా పనిచేస్తున్నా సగం తెరచి వేలు మధ్యనుంచి మూసిపెట్టబడిన పుస్తకం చేతిలో వుంచుకునేది. పొద్దస్తమానం ఏవో నవలలు, కథల పుస్తకాలు చదువుతుండేది. బహుశా అక్కయ్య వాటిని అంతగా చదువుతుండేది కాబట్టే నేడు అవంటే అతడి కసహ్యం. వాటిలో ఏముంటాయో అతడికి తెలీదు. అవన్నీ నిజం కావని అబద్ధాలని సృష్టించి అలా ఎవరో వ్రాకను వ్రాస్తూవుంటారని అతడి విశ్వాసం. చిన్నతనంలోనైతే చందమామలాటి పత్రికలు చదివేవాడు. మొన్న మొన్న బి. ఎస్ సి. అయినదాకాకూడా వీలుపడితే తప్పకుండా 'చందమామ', వారపత్రికలూ చదివేవాడు. అవే బావుండేవతడికి. ఒకసారి ప్రమాద వశాత్తూ ఎవరింటికో వెళ్ళి టేబిలుమీద పడివుంటే

చలంగారి 'స్త్రీ' చూసి పది పేజీలు చదివాడు. అప్పటినుంచి చలం పుస్తకాలంటే అతడికి కసహ్యం. 'చలం' పుస్తకాల తరువాత అతడేమీ చదవలేదు. ఈమధ్య రెండు మూడు డిటెక్టివ్ పుస్తకాలైతే చదివాడుకాని వాటిలోనూ అతడి కేమీ అభిరుచి కన్పించలేదు.

జీవితానికీ, సాహిత్యానికి వుండే సన్నిహితమైన సంబంధం అతడెరుగడు. జీవితం పైన పుస్తకాల ప్రభావం ఎంత గొప్పగా పనిచేస్తుందో అతడెరుగడు. గోర్కీ అమ్మకాని, మై యూనివర్సిటీకాని, రోమారోలా జీన్ క్రిస్టేఫ్ కాని, శరత్ చరిత్రహీనులు, శేష ప్రశ్న కాని అతడు చదివివుంటే జీవితంలో పుస్తకాల విశేషం తెలిసివుండేది.

ఏమీ పొద్దుపోక, యేమీ తోచక రామారావు బుక్‌హౌస్‌లో కొనుక్కునివచ్చిన పుస్తకం చేతికి తీసుకున్నాడు. అది వొక నవల. దానిపేరు 'నిజమైన మానవుడు'. పేరు చూసి మూర్తి నవ్వుకున్నాడు. ఇక గత్యంతరం లేక చదవటం మొదలెట్టాడు. పుస్తకంలోని సగం పేజీలు చదివేసరికి అతని కళ్ళవెంట నీళ్లు కారుతున్నాయన్న సంగతి అతడు తెలుసుకోలేకపోయాడు. అందులో కథానాయకుడు ఇరవైరెండేళ్ళ చిన్నవాడు. తల్లి చనిపోయింది. సవతితల్లి దగ్గర బ్రతుకుతాడు. చిన్నతనంనుంచీ తండ్రి పట్టించుకోడు. విశాలమైన దేశంలోకి జీవితాన్ని వెతుక్కుంటూ వెళతాడు. కొన్ని విచిత్రకరమైన పరిస్థితుల్లో అందమైన దేహమూ, హృదయమూ రెండూ కల అమ్మాయి పరిచయం యేర్పడుతుంది. ఆ అమ్మాయి అతణ్ణి ఎంతో లోకువదృష్టితో పనికి

రానివాడికింద జమ కడుతుంది. రోజులు గడుస్తాయి. ఇతడి బలహీనతలతో పాటుగా హృదయ సున్నితత్వాన్ని, ఔన్నత్యాన్నీ కూడా ఆమె తెలుసుకుంటుంది. ఆమె అతణ్ని ప్రేమించటం నేర్చుకుంటున్న సమయానికి, ఆమె నాన్నగారు యింకోచోట పెళ్ళి చేయటానికి ఆలోచన చేస్తాడు.

ఇలా సాగుతుంది కథ. చివరకు సుఖాంత మవుతుంది. కథలో పెద్ద విశేషమేమీ లేదు. నిజమైన మానవుడి చిత్రణలో వుంది. మన కళ్ళవెంట నీళ్ళు కారతాయి. హృదయం ఆర్ద్రితతో బరువెక్కుతుంది. అతడి లోపాలు, అతడి ఔన్నత్యం కళ్ళకు కట్టినట్లు చిత్రించాడు రచయిత. సత్యన్నారాయణమూర్తి మనసుకి నిర్వచింపరాని ఆనందం కలిగింది. కడుపునిండా భోజనం చేసినట్లా ? కాదు. కమ్మని సంగీతం విన్నట్లా ? కాదు. అందమైన దృశ్యం చూసినట్లా ? కాదు. తన నెవరైనా మెచ్చుకునేప్పుడు కలిగే ఆనందమా ! కాదు.

మరి యేమిటి ? మరి యేమిటి ?

మంచి పుస్తకము చదివినప్పుడు కలిగే ఆనందం, నిర్వచింపరానిది.

అతడు నిజమైన మానవుడు, అందమైన అమ్మాయిని పెళ్ళిచేసుకుని సంసారం చేస్తున్న దృశ్యాలను మనసులో వూహించుకుంటూ, కళ్ళు మూసుకున్నాడు. ఎంత హాయిగా వుందిమనసుకి.

సరిగ్గా రెండున్నర గంటలప్పుడు పోస్టుమేన్ వచ్చాడు. మీరేనా సత్యన్నారాయణమూర్తి అడిగాడు.

సత్యన్నారాయణమూర్తికి యాభై రూపాయల మని ఆర్డరు వచ్చింది. సత్యన్నారాయణమూర్తికి మనసులో ఎంతో సంతోషమైంది. వెంకటేశ్వర్లుగా భావించి పోస్టుమాన్‌ని కౌగిలించుకో బుద్దేశింది. పోస్టుమేన్ డబ్బులిచ్చి వెళ్ళిపోయాడు. మనిఆర్డరు కూపన్‌లో వెంకటేశ్వర్లు వ్రాసిన నాలుగు వాక్యాలను పదేపదే చదువుకున్నాడు మూర్తి. అతడి కనిపించింది వెంకటేశ్వర్లు నిజమైన మానవుడు. మామూలు మనిషి బలహీనం, మామూలు మంచి మనిషి అంతఃకరణ ప్రవృత్తి అది. అతడి కనిపించింది.

వెంకటేశ్వర్లు కథా నాయకుడుగా తను మంచి కథ వ్రాస్తే?

రామారావు కథా నాయకుడుగా మంచి కథవ్రాస్తే?

తాను వ్రాయలేడు. తాను వ్రాయలేడు.

నిజమైన మానవుడు మదిలో మెదిలాడు.

అతడు నవ్వుకున్నాడు.

మళ్ళీ ఆదివారం వచ్చింది. ప్రొద్దున్నే కాఫీత్రాగి మూర్తి బయలుదేరాడు. కోటీ వరకు బస్‌లో వచ్చాడు. అక్కడనుంచి ఉస్మానుపురా నడిచాడు. ఎనిమిది గంటలదాకా అయివుంటుంది.

పరంధామయ్యగారు అప్పుడే యెదురుచూస్తున్నారు.

వసుధ ముందుగా కన్పించింది.

చిరునవ్వుతో "నాన్న మీకోసం కలవరిస్తున్నారు ఇవాళ లేచినప్పటినుంచీ" అన్నది. పరంధామయ్యగారు హడా

వుడిగా లోపలనుంచివచ్చి "వచ్చావుటోయ్, వచ్చావు టోయ్" అన్నారు.

వసుధ చిన్నగా నవ్వింది.

వసుధ యెప్పుడైనా నవ్వుతుందని కాని, నవ్వినప్పుడు ఇంత అందంగా వుంటుందని కాని ఇదివరలో యెరుగడు మూర్తి.

శిరసున చల్లని వెన్నెల కురిసినట్లయింది.

"అమ్మాయ్ కాసిని కాఫీ తీసుకునిరా మన మూర్తికి" అని తండ్రి అన్నప్పుడు వసుధ మళ్ళీ కళ్ళలోకి దిగులు తెచ్చుకుంది. వసుధకి కోపంకూడా వచ్చింది.

"అక్కర్లే వద్దు. ఇప్పుడేఅయింది" అన్నాడు మూర్తి.

కాని వసుధ లోపలకు వెళ్ళి కాఫీ తెచ్చియిచ్చింది.

మూర్తికి బలవంతాన తీసుకోవలసి వచ్చింది.

వసుధ మనస్సులో యేమనుకున్నదో యేమో ముభావంగా వుండిపోయింది. ముడుచుకపోయిన ఆమె ముఖంచూసి మూర్తికి మనసులో కష్టంవేసింది.

మామూలుగా యెప్పటివలెనే వసుధ చిన్న తమ్ముడు అప్పుడే వచ్చిన యెండపొడలో కూచుని కళ్ళుమూసుకుని యేదో ఆలోచిస్తున్న దృశ్యాన్ని చూసినప్పుడు మూర్తి మనసు వేదనతో నిండిపోయింది.

పరంధామయ్యగారు కోటు తొడుక్కోగా మూర్తి ఇదివరలో చూడలేదు. ఆయన లోపలకు వెళ్ళి కోటు తొడుక్కొని వచ్చినప్పుడు మూర్తికి నవ్వువచ్చినా ఆపుకోవలసి వచ్చింది. తరువాత జాలికలిగింది. పురాతనత్వం తాలూకు

సద్గుణం దాన్ని అంటుపెట్టుకుని వుండటంవల్ల గౌరవనీయుల గృహాలను పావనం చేయవలసినప్పుడూ, కొన్ని కొన్ని గొప్ప విషయాలు సాధించవలసివచ్చినప్పుడూ, పరంధామయ్యగారు విధిగా ఆ కోటు వాడతారు. వసుధ నవ్వుతో ముఖం పక్కకి తిప్పుకుంది. ఆ దృశ్యం చూసినతర్వాత మూర్తి మనసులో వెయ్యి యేనుగుల బలం వచ్చినట్లయింది. భవిష్యత్తు సుఖమయమైనదిగా ఆలోచన వచ్చింది.

"కాస్త తొందరగా రా నాన్నా, ఇవాళ ఆదివారం. ఇవాళ వొక్క రోజన్నా కాస్త శాంతిగా గడుపుతాను. ఒక స్నేహితురాలుకూడా వస్తుంది. మనం పెందరాళే భోంచేద్దాం" అని చెప్పింది వసుధ. "అబ్బే! ఇప్పుడే వచ్చేయనటమ్మా" అన్నాడు పరంధామయ్యగారు. బయటకు వచ్చిన తర్వాత పరంధామయ్యగారు రిక్షా మాట్లాడారు హిమాయత్ నగరుకు. ఇరవై నిమిషాల్లోనే వాళ్ళు రిక్షా యెక్కి చేరుకున్నారు. ప్రొఫెసరుగారు ఇంట్లోనేవున్నారు. ఆయన అతి సంతోషంతో పరంధామయ్యగారిని యెదుర్కొనే దృశ్యాన్ని చూసి మూర్తి ముగ్ధుడైపోయినాడు. అతడి అంతరాత్మకి యెంతో బలం వచ్చినట్లనిపించింది. వాళ్ళు అతి చనువుగా మాట్లాడుకుంటుంటే మూర్తి విస్తుపోయాడు.

పరంధామయ్యగారు మూర్తిని ప్రొఫెసరు గారికి పరిచయంచేస్తూ "మా కుర్రాడు" అన్నారు. అన్న తర్వాత వచ్చిన పనంతా విశదీకరించారు. ప్రొఫెసరుగారు కాసేపు ఆలోచనలో మూర్తి నడిగి వివరాలన్నీ కనుక్కున్నారు.

"మనం తప్పక ప్రయత్నం చేద్దాం" అన్నారు ప్రొఫెసరుగారు, "తప్పక ... అంటే లాభం లేదు. ఇక సీటు వచ్చినట్లే యెంచుకుంటాను" అన్నారు పరంధామయ్యగారు.

తరువాత కాఫీ వచ్చింది.

ఈ ఇరవై యొవ్వో శతాబ్దపు నాగరికత దుష్టస్వరూపం ఇది. తొమ్మిది గంటల్లోపల మూర్తి మూడోసారి కాఫీ త్రాగుతున్నాడు. నిన్నా, నేడూ మధ్య తరగతి మానవృద్ధి నుంచి, ఇటు పెద్ద తరగతి వాళ్ళు, ఇటు చిన్న తరగతి వాళ్లు కూడా ఇంటికి వచ్చిన పెద్ద మనిషిని కాఫీతో సత్కరించక పోతే వొక లోపంగా భావిస్తూ వచ్చారు. ఇది నాగరికతా? ఏ నాగరికత నేర్పుతున్నది! అందుకనే ఇది యీనాటి నాగరికతయొక్క దుష్టస్వరూపం అనటం. కాఫీ తీసుకుంటుంటే మూర్తికి తలనొప్పి వచ్చింది.

ప్రొఫెసరు గారికి వంగి నమస్కారం చేసి మూర్తి పరంధామయ్య గారితో బాటుగా బయటకు వచ్చాడు.

అక్కడినించి పరంధామయ్యగారు ప్రొఫెసరుగారితో తన దీర్ఘ కాలిక పరిచయం వివరిస్తుండగా వై. యమ్. సి. ఏ. హాలుదాకా నడిచి వచ్చారు. బస్ కోసం ఐదునిముషాలు అక్కడ నిలుచున్నారు. బస్ వచ్చే సూచనలు కనపడక పోవటం వలన ఇంకా ముందుకు నడిచారు. కాచిగూడా చౌరాస్తాదగ్గరకు చేరేసరికి యెవరో పెద్ద మనిషి పరంధామయ్య గారిని నిలవేసి, స్థానిక వార్తలపైన ఘాటైన విమర్శ మొదలు పెట్టాడు. మూర్తి "ఇక నేను వెళ్ళనా?" అన్నట్లుగా పరంధామయ్యగారి వేపు చూశాడు. మూర్తి అలా చూడటం

ఆ పెద్ద మనిషీ చూశాడు. అయినా ఆ పెద్ద మనిషి లక్ష్యపెట్ట లేదు. "అమ్మాయి స్కూలు యీ వేపునే" అని మూర్తికి చూపించారు పరంధామయ్యగారు. మూర్తి అక్కడ నుంచి తిన్నగా కదలి ఇంకా ముందుకి నడిచాడు.

అతడి కెంతో ఉత్సాహంగావుంది.

తాను ఇక్కడకు వచ్చినప్పటి నుంచీ, యీనాటి వరకూ జరిగిన అనుభవాలన్నిటినీ తలచుకుంటూ సుల్తాన్ బజార్ చౌరస్తాదాకా వచ్చాడు. పదిగంటలు కావస్తోంది అప్పుడు.

కోఠీవద్ద బస్ యెక్కి పదిన్నరకల్లా రూమ్ చేరు కున్నాడు.

రామారావు ఇతడికోసం కే యెదురుచూస్తున్నాడు.

ఇద్దరూకలసి భోజనంచేసి ఇంగ్లీషు మ్యాట్నీ సినిమాకు వెళ్ళారు. ఆవాళ మూర్తికి చాలా సంతోషంగావుంది. సాయం కాలం పబ్లిక్ గార్డెన్సులో గడిపారు.

విశేషమేమిటంటే ఆరాత్రి మూర్తి "నిజమైన మానవుడు"లోంచి కొన్ని భాగాలు అక్కడక్కడ చదివి నిద్రపోయి నాడు.

పదిరోజుల తర్వాత యూనివర్సిటీకి వెళ్ళి మొదటి టరమ్ ఫీజు కట్టివచ్చాడు మూర్తి. ఇప్పుడుకూడా సుప్పయి రూపాయలదాకా రామారావు సాయం చేయాల్సివచ్చింది. రామారావు చాలా సంతోషంతో సాయం చేశాడు.

మొదటిక్లాసులో సత్యన్నారాయమూర్తికి యెన్నెన్నో విచిత్రమైన అనుభూతులు కలిగినయ్. చిన్నతనం నుంచి

గడచిన తన జీవితాన్ని వొక్కసారి మనసులో మననం చేసుకున్నాడు. వెంకట్రాజు గారింట్లో చూసిన అమ్మాయి యూనివర్శిటీలో కన్పించినప్పుడు అతడు ఆశ్చర్యపోయినాడు! ఇతణ్ణి చూచినప్పుడు ఆ అమ్మాయీ ఆశ్చర్యపోయింది. "నాన్నగారికోసం తరువాత రాలేదేం! మళ్ళీ యెప్పుడొస్తారు? నాన్నగారు మర్రోజే వచ్చేసారు గదా" అనుకున్న దా అమ్మాయి మనసులో.

"ఆవాళంతా యెక్కడో చూశాను అనుకున్నాను కదా బహుశా ఇక్కడే ఇదివరలో చూసివుంటాను" అనుకున్నాడు మూర్తి మనసులో.

అతడికి జీవితంలో చాలా మార్పు వచ్చింది.



# 6

పరంధామయ్యగారి జీవితం చిత్రమైనది. ఆయన ఇవాళను గురించి పట్టించుకోడు. రేపు గురించి ఆలోచించడు. నిన్నను గురించి మర్చిపోతాడు. చిన్నతనాన యీ జీవితం బాగానే గడచిపోయింది. కానీ రోజులు గడిచినకొద్దీ జీవిత సత్యాలు వొకొక్కటే వ్యక్తమవసాగాయి. అయినా ఆయన మారలేదు. ఈ ప్రపంచంలో గల బహు చిత్రమైన కొద్ది మంది మనుష్యులలో ఆయన వొకడు.

ఆయన స్కూల్ ఫైనలు చదువుకునే రోజుల్లో నాన్ కోపరేషన్ మూమెంటు పెల్లువలా వచ్చి దేశాన్ని ముంచి వేసింది. దాని తాకిడికి యీయనకూడా కదలిపోయినాడు. ఈ ఘాటైన ఉపన్యాసాలు, ఎత్తున ఎగిరే జెండాలు, పత్రికలు, పోలీసులు పరంధామయ్యగారి వ్యక్తిత్వాన్ని గాలిలో యెగిరే ధూళి రేణువులా మార్చి వేశాయి.

ఎటో కొట్టుకుని పోయినాడు. చిన్నతనాన ఇంటివద్ద ఆర్థికమైన ఇబ్బందులు యెరుగడు. తండ్రి ఇంగ్లీషువాళ్ళు స్థాపించినకోర్టులవలనబంగారాన్ని కూడబెట్టాడు. పరంధామయ్య గారు పిచ్చిపిచ్చి వేషాలతో జీవితాన్ని పాడుచేసుకున్నాడు గాని, నిజంగా ఆ రోజుల్లో తండ్రి బోధించిన విధంగా నడచు

కుని ఉంటే యివాళ యింకోవిధంగా బ్రతుకుతుండేవాడు. దేశభక్తి - స్వార్థత్యాగం, మొదలైన మాటల నిజమైన అర్థం తెలియకపోయినా, యౌవ్వనం అతడిచేత యెన్నెన్నో పిచ్చి పనులు చేయించింది.

స్కూల్ ఫైనలు కాలేదు.

అంతకుముందే పెండ్లి అయింది.

ఎప్పుడో వోసారి జైలుకు పోయాడుట. ఆ రోజుల్లో తండ్రి కాస్తా చనిపోయాడు. పరంధామయ్యగారికి నిలద్రొక్కుకుని ముందువెనకలు చూచుకునే తెలివితేటలు లేకపోయినై.

ఎప్పుడైనా యేదైనా సభ జరిగితే అధ్యక్ష స్థానమో, ఒక పూలమాలో దొరుకుతుండేది. అందువలన ఆ రోజుల్లో చదువు సాగించవలసిన ఆవశ్యకతగాని, ఉద్యోగం చేతుకోవలసిన అవసరంగాని కలగకపోయింది.

కొన్నాళ్ళపాటు ఖద్దరు నేయించి అమ్మే వ్యాపారం సాగించారు.

అందువలన తనవెనక యెంత మోసం జరుగుతున్నదో ఆయన గ్రహించలేదు.

మనవాళ్ళలో వొక పలుకుబడి వుంది. ఎలా సంపాదించింది అలానే పోతుందిలే — అని. దాని నిజానిజాలు యీయనపట్ల సరిగా వర్తించినై.

సృష్టి యెప్పటికీ స్తంభించిపోదు. కాబట్టి యీయనకు పిల్లలు పుట్టారు. ఒక కుర్రాడు పదేళ్ళు పెరిగిపోయాడు. అప్పుడీయన ఏదో మహాసభకు అధ్యక్షత వహించటానికి గ్రామాంతరం వెళ్ళారుట. అది వొక గొప్ప.

కాలవాతూలంలా సాగిపోయింది.

ఈయన అభిమాను లనుకున్నవాళ్ళూ, ఈయన యెలా బ్రతుకుతాడా అని బాధపడినవాళ్ళూ, కలిసి యీయనను పది పదిహేనేళ్ళ క్రిందట కృష్ణ దాటించి నవాబుల రాజ్యం చేర్పించారు.

కొన్నాళ్ళక్కడ ఆయన యేదో కరణీకం చేశారు.

కరణీకం అంటే బ్రతకటం అని వొక అర్థం యీమధ్య ప్రచారంలోకి వచ్చింది. కొన్నాళ్ళపాటు పిల్లలను నలుగురినీ చేర్చి చదువు చెప్పాడు. ఈ పని నగరంలో బాగా వుంటుందని యెవరో చెపితే నగరం చేరుకున్నాడు.

అప్పటికి వసుధకు ఐదేళ్ళు వుంటాయి.

ఈ పన్నెండు పదమూడేళ్ళనుంచీ వసుధ ఈ కృత్రిమపు నాగరికత నడిమధ్యనే తన బ్రతుకును వికసింపచేసుకొన్నది. దరిద్రం బ్రతుకును శిశిరంలో ఆకురాలిన చెట్లులా చేసినా, గ్రీష్మంలో వడగాల్పులు విసరినా, హేమంతంలో మంచుకు బిగిరిసికున్నట్లు చేసినా వాళ్ళు చలించలేదు.

దరిద్రం జీవితానికి సమకూర్చగల చిత్ర చిత్రమైన అనుభూతులు వాళ్ళ బ్రతుకులలో కోకొల్లలు. భయంతో, బాధతో చీకటి రాత్రులలో నీడలవలె గోడలను అతుక్కుపోయి గడిపిన రోజులున్నాయి. ఆకలితో, అలసటతో పగళ్లు దిగుళ్ళమయం కాగా గడిపిన రోజులున్నాయి.

పరంధామయ్యగారికి గత్యంతరం లేకపోయింది.

పన్నెండేళ్ళప్పుడే వసుధకు పెండ్లిచేయాలని ఆయన యెంతో ప్రయత్నం చేశాడు. రక్తంలో జీర్ణించుకుపోయిన

కుసంస్కారం ఆయన్ను అలా ఆలోచింపచేసింది. గొప్ప కోసం, అమాయకంగా ఆయన ఆస్తిఅంతా పోగొట్టుకున్నాడు. ఆవాళ ఆయన కొన్ని సిద్ధాంతాలను నమ్మి ఆచరణలో పెట్టి వుండవచ్చునుగాక.

అయినా అవి ఆయన స్వంతంగా ఆలోచించినవి కావు.

కాని ఆయన వసుధకు యెంత ప్రయత్నం చేసినా పెళ్లి చేయలేకపోయాడు. ఆయనకు జీవితంలో చుట్టుకున్న గొప్ప అదృష్టమల్లా అప్పట్లో వసుధకు పెళ్ళి చేయలేకపోవటమే!

వసుధ రోజురోజున పెరిగింది.

కష్టపడి చదువుకుంది. ఆమె మనస్సు పూర్ణంగా వికసించకముందే యీ కూలిపోతున్న మట్టియింటికి తానొక స్తంభమై నిలుపుకోవాలని తెలుసుకుంది.

బ్రతుకు వికసించినకొద్దీ వయసు విరిసినకొద్దీ అంతః శక్తులని నిద్రపుచ్చింది. అందుకే ఆమెకు దిగులు, ఆమే దిగులు.

తండ్రిలా కాకుండా ఆమె స్కూలుఫైనలు కాగలిగింది. రెండు సంవత్సరాలు కష్టపడి ట్రైనింగుకూడా ప్యాసైంది. ఆమెకు సులభంగానే ఉద్యోగం దొరికింది. అయితే ఆమె నిర్లిప్తతతో యోగినిలా బ్రతుకుతున్నది. ఎందుకంటే ఆమె తెలుసుకున్నట్లు ఆమె కోరుకున్నట్లు యీ కూలిపోతున్న మట్టి యింటికి ఆమె వొక్క స్తంభమై నిలబడింది అచలంగా. ఆమె కదిలితే, అంటే చలిస్తే యీ ఇల్లు కూలిపోతుంది అని కూడా ఆమె తెలుసు కుంది. పెద్దతమ్ముడు పన్నెండేళ్ళవాడు. చిన్నతమ్ముడు మూడేళ్ళవాడు. వీళ్ళిద్దరిమధ్యా ఇద్దరో ముగ్గురో పుట్టి పోయినారు.

ఎప్పుడైనా ఏ రాజకీయ సభలలో, ఎన్నికలముందు ఉపన్యాసా లివ్వటానికో పరంధామయ్యగారు విధిగా హాజ రవుతూవుంటారు. దినపత్రికను అమూలాగ్రం పఠించడం, ఎవరినో నలుగురిని చుట్టూ చేర్చుకొని రోజురోజుకీ పెరిగి పోతున్న అసంతృప్తిని గురించి వ్యాఖ్యానించడం ఆయన దిన చర్యలో ముఖ్యభాగంగా రూపొందింది.

మూర్తి మొదటిరోజున వాళ్ళయింటికి వచ్చినప్పుడు వసుధ వింటున్నదన్న ఉద్దేశంతో కాకుండా యథాలాపంగా భార్యతో ఇట్లా అన్నారు పరంధామయ్యగారు.

కుర్రాడు యెంత బుద్ధిమంతుడో, ఎంత తెలివికలవాడో చెప్పలేను. మన వసుధను అతడు చేసుకుంటే బాగానే వుంటుంది. అయితే మన శాఖా, వాళ్ల శాఖా ఒకటై యేడవ లేదు.

ఆమె ఆశ కాస్త హరించుకుని పోయింది.

ఆమె పరంధామయ్యగారు మొదలుపెట్టి నప్పటినుంచి ఆశక్తితో వింటున్నది. ఈ మాటకాస్తా ఆయన నోరు జార గానే ఆమె మామూలు మనిషయింది. వసుధ నవ్వుకుంది. మరుక్షణంలోనే మర్చిపోయింది.

మూర్తి ఒక సాయంకాలం వుస్మాన్‌పురా వచ్చాడు. పరంధామయ్యగారు ఇంట్లోనే వున్నారు.

"ఏమేవ్! చూడు కుర్రాడెలా అయిపోయినాడో! ఇంత ఉప్పుపట్టుకొచ్చి దిష్టితియ్యి" అన్నారు అతణ్ణి చూడ గానే.

దాన్ని పరిహాసంగానే భావిస్తూ మూర్తి అక్కడే కూర్చున్నాడు. కాని ఇంతలోనే ఆమె నిజంగానే ఆ యూ పరికరాలతో తయారయేసరికి వాళ్ళ అజ్ఞానానికి అతడి మనసు నొచ్చుకుంది. అయినా ఎంతో దూరాన చుక్కలాగ మెరుస్తూ తల్లి కంటికి స్పష్టంగా కనిపించసాగింది.

పరంధామయ్యగారు చెప్పారు.

"చిన్నప్పటినుంచీ మేం ముగ్గురమూ వొక జట్టనుకో నాయనా, మాలోమాకు ఏకోశానా కపటాలూ, కార్పణ్యాలూ వుండేవికావు. అయినా చిన్నతనమే అటువంటిదనుకో. ఏ ఈర్ష్యా ద్వేషమూ ఉండేదికాదు. మీ నాయనా, వెంకట్రాజూ థర్డుఫారం చదువుతుండగా నేను బాపట్లనుంచి వచ్చాను. మీ నాన్న మొదటినుంచీ శాస్త్ర ముభావంగా వుండేవాడు. వెంకటరాజుకి చదు వంటకపోయినా యెవరితోనైనా కలివిడిగా వుండటంలో ఫస్టు అనుకో. మీ నాయనకు ఫస్టుమార్కు వస్తూండేది యెప్పుడూ. వెంకట్రాజుది లాస్టు మార్కు. సామాన్యంగా అలా ఉండేవాళ్ళకు స్నేహం కలవదు. అలా కాకుండా వాళ్ళు అమిత స్నేహంగా వుండేవాళ్ళు. మొట్టమొదటిరోజున మీ నాన్న నన్ను పలకరించలేదు. రెండవరోజూ అంతే! క్లాసులోకల్లా తెలివికలవాడు కావటం మూలాన నేను నోట్సు లియ్యమని అడిగాను మీ నాన్నని. కాని వాడు యివ్వలేదు. వెంకట్రాజు అప్పుడే నాతో స్నేహం కట్టేశాడు. నాకు అవాళ క్లాసులో యేం చెప్తారో తెలియక నోట్సులు తెచ్చుకోలేదు. వెంకట్రాజు ఫర్ మని నోట్సు చించి, నాలుగు తెల్లకాగితాలు యిచ్చాడు.

ఇంటర్వెల్‌లో వేరుశనగవుండలు కొనుక్కొచ్చి పెట్టాడు. సాయంకాలం చెడుగుడు గ్రౌండులో నన్ను తన జట్టులో చేర్చుకున్నాడు. వెంకట్రాజుకీ, నాకూ బాగా స్నేహం కలిసి పోయింది. సాయంకాలం పూట వెంకట్రాజుతో పాటుగా నేను కూడా నెత్తినిండా ఇసుక పోసుకునిగాని యింటికి పోయే వాణ్ణికాదు.

"క్లాసులోమాత్రం మీ నాయన బెంచీలోనే కూచునే వాణ్ణి.

"క్లాసులో వున్నంతసేపు మీ నాన్న సావాసం. క్లాసు బయటంతా వెంకట్రాజు సావాసం.

"వెంకట్రాజు మీ నాన్నతో రాత్రుళ్ళు కలిసి చదువు కునేవాడు.

"మా ఇల్లు దూరమవటంచేత మేము కలిసి వుండటం పగటిమట్టుకే పరిమితంగా వుండేది. చాలా రోజులదాకా. చాలా రోజులు తాలూకాఫీసు ఎదురుగా గుఱ్ఱంమీద జార్జి రాజు ఫోటో పెట్టి ఊరేగిస్తుంటే మేమూ వెంటపడేవాళ్ళము. 'జర్మనీ వోడాలిరన్న...' అన్న పాటను యెలిమెంటరీ స్కూల్లోనే నేర్పారు మాకు; ఇంకా రాజుగారి పుట్టినరోజు పండగనాడు నిమ్మబిళ్ళలు పంచిపెట్టేవాళ్ళు మాకు."

గెలిచేది మనరాజు.

ఓడేది పగవాడు.

'మష్ట జర్మనీ గెలిచేది సున్నా' అని అరుచుకుంటూ తిరిగేవాళ్ళము. తర్వాత తర్వాత బుఱ్ఱకథలకీ, హరికథలకీ, సభలకీ, సమావేశాలకీ విధిగా హాజరవుతుండేవాళ్ళము.

ఒకరోజు సుబాస్ చంద్రబోసు సెక్రెటరీ యీ వూరొచ్చాడనే వాళ్ళు. ఇంకోరోజున ఆ ఊళ్ళో పోలీసుల్ని వలంటీర్లు చితక తన్నారనేవాళ్ళు. రోజురోజుకీ గొప్ప ఉత్సాహంగా వుండేది. భయంకూడా. ఏ పేపర్‌లో చూచినా హిట్లర్ బొమ్మలే. ఆ తర్వాత తర్వాత మేము దేశభక్తి గీతాలు పాడేవాళ్ళము లోపల లోపలే. స్కూలుఫైనల్ వొక సంవత్సరం తప్పాను. తరువాత ఉత్తపుణ్యానికి అరెస్టు చేశారు. జైలునించి రాగా నే సన్మానం చేశారు.

"ఎవరిదారి వాళ్ళదైంది. నేను ఇప్పుడనుకుంటున్నాను. ఏదో ఆవేశం. అంతకు తప్ప యేమీలేదు. నేను పూర్తిగా చెడిపోయినాను. ఏడెనిమిదేళ్ళ క్రితం అనుకుంటాను గుంటూరు జిల్లా రాజకీయ బాధితుల మహాసభకు నేను వచ్చాను. అప్పుడు తెనాలికూడా వచ్చాను. అప్పుడనుకున్నాం మేము. ఏదో మన జీవితాలు ఇలా వెళ్ళిపోయినయ్. బ్రతికినంతకాలం బ్రతకబోముగదా ? మన పిల్లలైనా సుఖపడతారో, లేదో – అని. మా ముగ్గురిలో వెంకట్రాజు పనికాస్త బావుంది ఇప్పుడు. మానవుని దుర్లక్షణాలలో వొకటైన గతాన్ని మరచిపోవట మనే దుర్గుణం వెంకట్రాజుకీ సంక్రమించింది. చాలామట్టుకు మమ్మల్నిద్దరినీ వాడు మరచిపోయినాడు.

"మేము ఇద్దరమూ వొకరికంటె వొకరం యేమాత్రం ఆధిక్యతలు లేకుండా బ్రతుకుతున్నాంకాబట్టి వొకరికొకరం ఇంకా గుర్తున్నా మనిపిస్తున్నది.

"మేము అనుకునే వాళ్ళము మేమంతా పెద్దవాళ్ళ మయ్యేసరికి దేశమూ, సంఘమూ పూర్తిగా మారిపోతుందనీ,

అన్ని భేదాలు క్షాళితమై పోతాయనీ, వర్గాలు, కలహాలు, కులాలూ, వర్ణాలూ, వుండవనీ వర్గరహిత సమాజంలో సుఖం, శాంతి వెల్లివిరియగా బ్రతుకుతామనీ అనుకున్నాము. కాని ఇంకా యెక్కువైనాయి. అవలక్షణాలు, ఎందుకు చెపుతున్నానంటే అనుకుంటే నాకు నవ్వొస్తుంది. అటువంటి సమాజం యెలాగూ యేర్పడుతుంది. కాబట్టి మనపిల్లలకు మనం వివాహాలుచేసి మనం మనమే వియ్యమందుదాము అనుకునే వాళ్ళము.

పరంధామయ్యగారు నవ్వారు.

"వెంకట్రాజు పెద్దకూతురికి పాతిక వేలు కట్నమిచ్చి పెళ్ళిచేశాడు. కొడుకొకడెక్కడో ఫారిన్‌లో చదువుకుంటున్నాడు."

సత్యనారాయణమూర్తి వాళ్ళంతా చెవులు చేసుకుని నిశ్శబ్దంగా విన్నాడు.

వసుధ యెక్కడవుందో వొక్కసారి చూడామని అతడి మనసు యేమిటో, యెందుకో చిత్రంగా కోరుకుంది. ఈ పరంధామయ్యగారు చెప్పినదంతా వసుధ కూడా వినివుంటే బావుండేదని మనసు అనుకుంది.

సత్యనారాయణమూర్తి వెళ్ళిపోవటానికి బయలుదేరుతుండగా వసుధ వచ్చింది. అలసిపోయి విసుగ్గా వచ్చింది. మూర్తికి జాలైంది. ఆమె వీళ్ళందరికోసం యెందుకు కష్టపడాలి. దీనికి ఫలితమేమిటి ? అనుకున్నాడు.

సత్యనారాయణమూర్తి రూముకు చేరే దారిలో అంతా ఆలోచించాడు. పరంధామయ్యగారి సంసారం గురించి

అతడికి వసుధ చిన్న తమ్ముడు ఆ రెండేళ్ళ చిన్నవాడు గుర్తుకు వచ్చినప్పుడు హృదయం అప్పుకుని పోయింది. పరంధామయ్య గారి భవిష్యత్తు యేమిటి? వసుధ యేమికావాలి. ఆ రెండేళ్ళ చిన్నవాడు పెద్దవాడవుతాడా? శివుడికి చదువు వస్తుందా, వాడికి చదువెవరు చెప్పిస్తారు? ఎన్నాళ్ళకు వాడు పెద్దవాడవుతాడు. వసుధ భారాన్ని వాడెప్పుడు పైన వేసుకుంటాడు? ఈ ఆలోచనల మధ్య యెప్పుడో పరంధామయ్యగారి భార్య తనచుట్టూ ఉప్పుతిప్పటం గుర్తువచ్చింది.

అతడి కళ్ళు చెమ్మగిల్లినయ్. అమ్మ గుర్తుకు వచ్చింది. అక్కయ్య గుర్తుకు వచ్చింది. తానూ, వసుధ, వెంకటరాజు గారి అమ్మాయి, అన్నయ్యా, వెంకటరాజుగారి ఫారిన్‌లో చదువుకుంటున్న కొడుకు, వాసు, శివుడు యేమిటి? యేమి'? ? ఎక్కడకు ప్రయాణం చేస్తున్నారు? పరంధామయ్యగారి చిన్న పిల్లవాడు కాళ్లూ, చేతులూ పుల్లలవలె పుట్టి ఇంత యెత్తున పెరిగి లివర్ వ్యాధితో బాధపడుతున్న ఆ చిన్న కుర్రాడు. వాడి భవిష్యత్తేమిటి? పరంధామయ్యగారు చెప్పిన దంతా లోపల లోపలే మననం చేసుకున్నాడు. అతగాడు రూము చేరుకునే సరికి ఒక విచిత్రం కంట పడింది. అవాళ రామారావుకి మెన్నెన్నో సంగతులు చెప్పి కొన్ని సలహాలను తీసుకోవాలి అని ఆలోచించాడు మూర్తి. కాని రూము చేరుకునేసరికి రామారావు రూమ్ మేటు హాల్దారులు పరచుకుని కూచుని వున్నాడు. రామారావు అతడితోటి యెంతో ఉత్సాహంగా మాట్లాడుతున్నాడు. మూర్తి ముఖం ముడుచుకున్నాడు.

ఆ రాత్రి మూర్తి చెప్పదలచుకున్న విషయాలేవీ రామారావుతో చెప్పలేకపోయాడు. ఆ రాత్రి ఆ చిన్నగదిలో ముగ్గురూ రకరకాల ఆలోచనలతో నిద్రపోయారు. ఆ గదిలో ముగ్గురికీ వసతి లేదు. అదీకాక మూర్తికి యూనివర్శిటీకి వెళ్ళటానికి సుగమంగా లేదు. ఎలాగైనా మార్చాలని ఇదివరలోనే ఆలోచిస్తున్నాడు. కాని ఇంత తొందరలోనే తాను రామారావుని వదలిపెట్టి వెళ్ళిపోవాల్సి వస్తుందని మూర్తి ఇదివరలో వూహించలేకపోయాడు.

రామారావు రూమ్ మేటు పేరు హనుమంతరావు. అతడూ మూర్తితో యెంతో చనువుగా మాట్లాడాడు. నాలుగు రోజులపాటు వాళ్ళు అలాగే సర్దుకున్నారు. రామారావు తనతో ఆ ప్రశంస తీసుకు రాకముందే తాను యెలాగయినా వేరే చోటికి వెళ్ళిపోవాలని మూర్తి వూహించాడు. ఒక రోజున కాలేజీకి సెలవుపెట్టి తిరిగాడు. అదృష్ట వశాత్తూ ప్రభాత్ టాకీస్ పక్క వీధిలో చెప్పల్ బజార్ మసీదు దగ్గరగా అతడికో రూము కనబడింది. అది అప్ స్టెయిర్స్ మీద. చెక్కల మెట్లు యెక్కిపోవాలి. ఒక్క మనిషి ముడుచుకు పడుకుంటే బాగా సరిపోతుంది. ఎలక్ట్రిసిటీ వుంది. తిరిగి తిరిగి విసిగిపోయిన మూర్తి వెంటనే అక్కడ చేరిపోదామనుకున్నాడు. కాచిగూడా రైల్వేస్టేషను కూడా దగ్గరేను. యూనివర్సిటీకి వెళ్ళి రావటానికకూడా వీలుగా వుంటుంది. పక్కన ఇంకా రెండుమూడు రూములున్నాయి. వాటిల్లోకి తొంగి చూడాలనికూడా వుత్సహించలేదు మూర్తి. పదిహేను రూపాయలు చెప్పారు. మూర్తి

ముఖం వెల వెలబోయింది. అతడు మాట్లాడకుండా మౌనంగా దిగాడు. మూర్తి వాళ్ళవేపు ఆశగా చూశాడు. ఎలానో పెగల్చుకొని పదిరూపాయల కిమ్మన్నాడు. కాని, వాళ్ళు కోపంగా చూశారు. మూర్తి పన్నెండు రూపాయలకు ఒప్పుకొని ఆ సాయంకాలమే వచ్చి చేరతానని చెప్పి వెళ్ళి పోయాడు. అతడి కెంతో బాధగా వుంది. మద్రాసులో వుండగా తీరిక సమయాల్లో అతడు వొక ప్రెస్‌లో అవసరానికి కంపోజిటర్‌గా, లేకపోతే ప్రూఫ్‌రీడర్‌గా యెప్పటి కెయ్యది ప్రస్తుతమో అప్పటి కా పని చేసేవాడు. ఓవర్ టైమ్ వర్క్ చేసి నెలకు నలభైయ్యో, యాభైయ్యో సంపాదించుకుని తనను తాను పోషించుకునేవాడు. అలా గడచిపోయింది అతని మద్రాసు జీవితం. అవాళ రూము చేరుకునేసరికి పన్నెండు గంట లయింది. రూము చేరుకునే దారిలో అంతా అతడాలోచించాడు. మళ్ళీ యెక్కడైనా ప్రెస్‌కి వెళ్ళి పని సంపాదించాలి. ఇప్పుడు చేరబోయే రూముకు దగ్గరగా వుంటే బావుంటుంది. చాలాసేపు బాధపడ్డాడు. కాసేపు తనకు తానే ధైర్యం తెచ్చుకున్నాడు. ఎలానో రోజులు గడవకపోవు. ఎప్పుడో మంచిరోజులు రాకపోవు. ఇంత విశాలమైన విశ్వంలో సుఖ సంపాదనకు అవకాశం లేకపోలేదు. ఇంతమంది భవిష్యత్తుపైన ఆశ పెట్టుకుని, నమ్ముకుని బ్రతికివుండగా తాను యెందుకింత నిరాశపడాలి. ఎప్పుడో సుఖపడే రోజులు వచ్చినప్పుడు యీ గడచిపోయిన రోజులన్నీ తీయటి అనుభూతులుగా మాత్రమే మిగిలిపోతాయి. వర్తమానపు చేదుజీవితం భవిష్యత్తులో తీయని అనుభూతులుగా మారుతుంది. తప్పదు. అందు

వలన ఇప్పుడింత మనస్సుని పాడుచేసుకోగూడదు. రూమ్ చేరుకునేసరికి యెవరూ లేరు. ఇద్దరూ ఆఫీసుకు వెళ్ళిపోయారు. భోజనంచేసి వచ్చి కూచున్నాడు.

"నిజమైన మానవుడు" కన్పించింది. రామారావుని అడిగి ఆ పుస్తకం తనతో తీసుకుపోవాలని ఆలోచించుకున్నాడు.

దాన్ని తీసి చదువుకుంటూ కూచున్నాడు.

అందులో నాయకు డనుకుంటాడు. తన హృదయం యెందుకు విశాలం కాకూడదూ ?

సత్యనారాయణమూర్తి కూడా అనుకున్నాడు. తన హృదయంమాత్రం యెందుకు విశాలమైనది కాకూడదు ! రెండున్నరప్పుడు పోస్టుమేన్ వచ్చి వెంకటేశ్వర్లునుంచి వచ్చిన ఉత్తరం ఇచ్చి పోయాడు. మూర్తికి ఆ ఉత్తరంతో యెంతో బలం వచ్చినట్లయింది. ఐదు గంటలకల్లా రామారావూ, హనుమంతరావూ ఇద్దరూ వచ్చారు. మూర్తి తన రూము సంగతి చెప్పాడు. రామారావు బాధపడ్డాడు. హనుమంతరావు అన్నాడు తానుకూడా రెండుమూడు రోజులనుంచి రూము కోసం వెతుకుతున్నానని. అతడు వెళ్ళిపోకముందే తాను సాధించినందుకు సత్యనారాయణమూర్తికి సంతోషంకలిగింది. " ఎలానో కలిసి వుండవచ్చుకదా " అన్నాడు రామారావు.

సత్యనారాయణమూర్తి తాను అక్కడ చేరినందువల్ల కలగబోయే సదుపాయాల గూర్చి చెప్పుకున్నాడు. ఆ సాయంకాలం చిన్న పక్కచుట్టా, వో పదిపుస్తకాలూ పట్టుకుని రిక్షాయెక్కి సత్యనారాయణమూర్తి చెప్పల్ బజారులోని

నూతన రూమ్ ప్రవేశం చేశాడు. "నిజమైన మానవుడు" కూడా వెంట తెచ్చుకున్నాడు.

కాని చెక్కలమెట్లు యెక్కి పైకి వెళుతుంటే సత్యనారాయణమూర్తి ప్రాణం చివుక్కుమంది. మనసు గిజ గిజలాడిపోయింది. సరిగ్గా మెట్లపక్కనే క్రిందిభాగంలో చిన్న మాంసం అమ్ముకునే దుకాణం వుంది. పొద్దున్న మూసే వుంది. ఇప్పుడు తెరచివుంది. సత్యనారాయమూర్తి రిక్షా దిగి ఆ దుకాణం చూసి నిర్ఘాంతపోయాడు. చిన్నగా పైకి వెళ్ళి రిక్షావాణ్ణి డబ్బులిచ్చి పంపివేసి పక్కచుట్టమీద తల ఆన్చి కటిక నేలమీదనే పడుకుని ఆలోచించినా అతడిదడ తగ్గలేదు. ప్రతిరోజూ, ప్రతిపూటా, క్రిందికి దిగినా పైకియెక్కినా తాను చూడవలసి వుంటుంది. అతడి శరీరం అసహ్యంతో గగు ర్పొడిచింది.

అలానే అరగంట గడచింది గుడ్డలు మార్చుకుని పరంధామయ్యగారింటిదాకానైనా పోయివద్దామని మూర్తి క్రిందికి దిగినప్పుడు సరిగ్గాచూసి ఆ మాంసమమ్ముకునే దుకాణదారుడు యెంతో ఆదరభావంతో సత్యనారాయణ మూర్తికి "సలాం" చేశాడు. అతడి మనస్సు కసహ్యమై అలానే ముందుకు నడిచాడు.

కాని పరంధామయ్యగారింటికి వెళ్ళి వరండాలోకి అడుగు పెట్టాడో లేదో అతడికి తలతిరిగి మూర్ఛవచ్చినంత పనైంది.

ఎదురుగ్గా అక్కయ్య హాల్లో కూర్చునివుంది.

# 7

ఐదు నిమిషాలసేపు మాత్రమే కొటపటాయించి అతను గిరుక్కున వెనక్కు తిరిగాడు. కాని వసుధ కంఠం అతన్ని ఆజ్ఞాపించింది. ముగ్ధుణ్ణి చేసింది కట్టివేసింది. ఎక్కడకూ పోకుండా చేసింది. వెనక్కు తిరిగేట్లు చేసింది.

వసుధ యేమీ అనలేదు. "అదేమి అలా వెళ్ళిపోతారు. కూచోండి. నాన్న లోపలవున్నారు" అన్నది.

పరంధామయ్య గారి నవ్వు వినిపించింది ఇంతలో.

సత్యనారాయణమూర్తి అక్కడేవున్న పాతకుర్చీలో కూచున్నాడు.

పరంధామయ్యగారు పైగుడ్డ దులుపుకుంటూ వచ్చారు. "ఏమిటోయ్ బొత్తిగా కనపడటం మానేశావు. నీకు హోటలు తిండి పడదంటే వినలేదుకదా. అయిందేదో అయిపోయింది. ఇకనైనా వచ్చి వుండిపో. మీనాన్న నాకేమీ పరాయివాడు గాడు. నాగురించి మీనాన్న నీకు సరిగా చెప్పివుండడు." సరోజిని తమ్మునివేపు జాలిగా చూసింది. ఆ కళ్ళలో విహ్వలత ప్రస్ఫుటంగా కనపడుతోంది. బేలయైన తమ్ముణ్ణి నఖసిఖ పర్యంతరం పరీక్షించ సాగింది. అక్కయ్య చూపులు తనని గుచ్చుకుంటున్నట్లుగా భావించసాగాడు మూర్తి.

పరంధామయ్య చెప్పుకపోసాగాడు.

"మొన్న పనుండి ఆవేపుకి వెళ్ళినప్పుడు మీ ప్రొఫెసరుగారు కన్పించారు. వాళ్ళింటికికూడా వెళ్లివచ్చాను. నీగురించి అడిగాను. ఆయన సంతృప్తి వెల్లడించారు. అయినా నాకు తెలియకపోతేగదా నీ వెలువంటి వాడివో. నీగురించి ఒకరు చెప్పాలా. అన్నమంతా పట్టిచూడాలా నాయనా, నేనూ, నరసింహమూ తక్కినవిషయాల్లో యెలావున్నా పిల్లల విషయంలో అదృష్టవంతులమే. అయితే మా కడుపునపుట్టటం వాళ్ళ అదృష్టం కాదనుకో. నరసింహం చాలా అదృష్టవంతు డంటాను. ఎందుకోయ్ తలవంచుకుంటావు. అంత సిగ్గెందుకు నీకు. నేనూ అదృష్టవంతుణ్ణే. నా తల్లి వసుధ..." ఆ వాక్యం ఆయన పూర్తి చెయ్యలేదు. వసుధవేపు ఆప్యాయత నింపిన కళ్ళతో చూశాడు.

వసుధ ముఖం ముటముట లాడించుకుంది.

తమ్ముడివేపు చూస్తుంటే సరోజిని కళ్ళు మిలమిలా మెరిసిపోయినయ్. ఆమెకు తెలుసు. ఎప్పటికైనా తమ్ముడు గొప్పవాడవుతాడు. అంటే గొప్ప ఉద్యోగం చేస్తాడు. సుఖపడతాడు.

తండ్రి అలా మాటాడితే వసుధకు కోపంవస్తుంది. ఆమె హృదయాని కెందుకో ఆ తీరు నచ్చదు.

సరోజినికి తండ్రి గుర్తువచ్చాడు. ఆమె హృదయం జాలితో నిండిపోయింది. ఆరోజున తండ్రి తనతో అన్న మాటలూ, తండ్రితో తాను జరిపిన చర్చా యావత్తూ గుర్తుకు వచ్చింది. తన కుటుంబం మొత్తం మళ్ళీ హృదయంలో

మెదిలింది. ఆమె కళ్ళల్లో నీళ్ళు నిండుకొచ్చాయి. పక్కకు తిరిగి కొంగుతో తుడుచుకుంది. వసుధ ఆశ్చర్యపోయింది. ఎప్పుడూ ఆమె అంత ఆశ్చర్యానికి గురి కాలేదు. వసుధ హృదయం కూడా సరోజినిపట్ల జాలితోనూ, అభిమానంతోనూ నిండిపోయింది. ఇంట్లోంచి శివుడు వచ్చాడు "అక్కయ్యా నీళ్ళు మరగిపోతున్నా" యంటూ. వసుధకు అక్కడినుండి లేవబుద్ధి పుట్టలేదు. అయినా యాంత్రికంగా లేచి నిలుచుంది.

ఇంతలో పరంధామయ్యగారు చప్పున లేచి "నేను చూస్తాను లేమ్మా, నువ్వు కూచో"అని ఇంట్లోకి వెళ్ళిపోయారు.

వసుధ మళ్ళీ కూలబడింది. సరోజినికి శివుణ్ణి చూడగానే వాసు గుర్తుకువచ్చాడు. వాసు గుర్తుకిరాగానే ఆమె హృదయంలో యెవరో చేయిపెట్టి కెలికినట్టుంది. మళ్ళీ కళ్ళు చెమ్మగిల్లాయి. "ఆవాళ ఇక్కడికి తాను యెందుకువచ్చానా" అని తననితాను నిందించుకోసాగింది సరోజిని. ఆమెకు ఓదార్పు కావాలి. ఆమెకు ఓదార్పునిచ్చేవాళ్ళు ఇక్కడ యెవరూ లేరు. అందుకే ఆమె తననితాను నిందించుకోసాగింది. చాలా నెలలతర్వాత మళ్ళీ యీ ఇంటివేపు ఆమెకు ఉత్సాహజనకం కాలేకపోయినప్పటికినీ వచ్చింది. పొద్దున పరంధామయ్యగారు కన్పించినప్పుడు ఆమె ముభావంగానే వుండిపోయింది. అయినా ఆయనే ఎన్నో విషయాలు చెప్పారు. తమ్ముడు తమ ఇంట్లో చాలారోజులు వున్నాడనీ, యం. యస్ కే. సీటు దొరికిందనీ, కాలేజీలో చేరాడని, యెన్నో విషయాలు చెప్పినప్పుడు తన మనసు యెంతగానో సంతోషించింది.

పరంధామయ్యగారు "ఒక్కసారి సాయంకాలం మాయింటికి రామన్నా చాలారోజులైంది" అని చెప్పినప్పుడు తాను సంతోషంతో తలవూపింది. ఇక్కడ తనకు తమ్ముడు తటస్థపడతాడని ఆమె వూహించలేదు. పరంధామయ్యగారు చెప్పారు ఎవరో స్నేహితుడి గదిలో వుంటున్నాడని. వీడికి తన జన్మతో జన్మవైరమా? వీడు తనని అక్కయ్యా అని ఆదరంగా ప్రేమగా పలకరించడేం. నేనేం తప్పుచేశాను. వీడికి నామీద ద్వేషమా? అని సరోజిని పరిపరివిధాల ఆలోచించింది.

వసుధకి ఆమె అవస్థచూస్తూంటే ఆమెపట్ల జాలికలుగుతున్నది. ఇందాకట్నుంచి చూస్తున్నది సత్యన్నారాయణమూర్తి వాలకం. అలా తలవంచుకుని కూచోకపోతే ఆమెతో సరదాగా కబుర్లు చెప్పకూడదూ? ఆమె కన్నీళ్ళు పెట్టుకుంటుంటే తానేలా మాట్లాడాలోకూడా తోచలేదు వసుధకు.

సరోజిని తమ్ముడివేపు కాసేపు వెర్రిగా చూసింది. కాని అతణ్ణి ఆమె యేవిధంగానూ పలకరించ దలచలేదు.

శివుణ్ణి దగ్గరగా పిలిచింది.

వాడు దూరంగా నిలుచునే ఆమెవేపు బిక్కబిక్క చూశాడు. వసుధ దగ్గరగారమ్మని సైగచేస్తే వాడు దగ్గరగా వచ్చాడు.

ఇంతలో చిన తమ్ముడు యేడుపు లంకించుకున్నాడు. వసుధ లోపలకు వెళ్ళి వాణ్ణి యెత్తుకునివచ్చి అక్కడే కూచుంది. వసుధతల్లికి నాలుగురోజులనుంచీ వొంట్లో బాగులేదు. ఆమె పక్క దిగటంలేదు. అసలే ఆమె జబ్బుమనిషి. పైన కొద్ది రోజులనుంచీ ఆమె జబ్బు యెక్కువైంది.

సరోజిని శివుడితో మాటలకు దిగింది.

"ఏం బాబూ చదువుకుంటున్నావా?"

వాడు తలవూపాడు.

కూచోమన్నది వాణ్ణి.

"ఏం చదువుకుంటున్నావు?"

"సెకండ్ ఫారం" అని చెప్పాడు వాడు.

వాసుకూడా ఇదే యీడువాడు. వాడి చదువు సంగతి యెవరు పట్టించుకుంటారు? వాడు చదువుకోకుండా పెద్దవాడవుతే, అప్పుడు చదువు వస్తుందా? వాడిగతి యేం కావాలి? వాణ్ణి తనతో వుంచుకుంటే బావుండును. కాని తనతో పంపిస్తారా? తనని అస్పృశ్యురాలిగా వాళ్ళు భావిస్తుంటే తనతో వాసుని పంపించమని యేమని, యెవరిని అడుగుతుంది? వీణ్ణి చూడటంలేదూ? వీడు తనతో మాట్లాడటానికే బాధపడుతున్నాడు. వీణ్ణి తాను యెంతగా అభిమానించింది చిన్నప్పుడు. ఏమాట చెపితే ఆ మాట వినేవాడు. ఎప్పుడూ వెనక వెనకనే తిరిగేవాడు. అటువంటివాడు యెలా మారిపోయాడు! ఆమె నిట్టూర్చింది.

పరంధామయ్యగారు లోపలనుంచి శివుణ్ణి పిలిచాడు.

శివుడు లోపలకు వెళ్ళిపోయాడు.

నాలుగు నిమిషాలలో వాడు యెగురుకుంటూ బయటకు వెళ్ళబోతుంటే వసుధ, యెక్కడికిరా? అని యథాలాపంగా గద్దించింది. వాడు నిర్లక్ష్యంగా చక్కెర తేవటానికి అని వెళ్ళిపోయాడు పరిగెత్తుకుంటూ. వసుధ ముఖాన చన్నీళ్ళు గుమ్మరించినట్లు సిగ్గుపడిపోయింది. సరోజిని వేపూ, సత్య

న్నారాయణమూర్తి వేపూ చూసినప్పుడు వాళ్ళు యే విష యమూ గుర్తించనట్లూ నిర్లిప్తులుగా వుండడం చూసి, ఆమె మనసు కొంత శాంతించింది.

అక్కడ కొంతసేపు నిశ్శబ్దం గడ్డకట్టింది.

శివుడువచ్చి మళ్లీ లోపలకు వెళ్లిపోయాడు.

పదినిమిషాల తర్వాత పరంధామయ్యగారు వసుధను లోపలకు పిలిచారు. శివుడు తమ్ముణ్ణి యెత్తుకున్నాడు.

వసుధ ఇంట్లోకి వెళ్ళింది.

సరోజిని తమ్ముడివేపు చూసింది.

అతడు చూపులను పక్కకు తిప్పుకున్నాడు.

తమ్ముణ్ణి పోనీ వాడు యేమనుకున్నా పలకరించాలను కుంది సరోజిని. కాని యెలా పలకరించాలో ఆమెకు తోచ లేదు.

ఇంతలో వసుధ మూడు కప్పులనిండా 'టీ' తీసుకుని వచ్చింది.

పరంధామయ్యగారు కూడా లోపలనుంచి కప్పు టీ తీసుకుని వచ్చారు. అక్కడే కూచుంటూ "సాయంకాలం పూట టీ తీసుకుంటే ప్రాణానికి హాయిగా వుంటుంది"అన్నారు.

సరోజిని టీ కప్పును నోటి కందించుకుంటూ "చాలా బావుంది" అన్నది. పరంధామయ్యగారు గర్వంగా చూశారు. వసుధకు నవ్వొచ్చింది. ఏమీ పట్టించుకోకుండా సత్యన్నారా యణమూర్తి టీ చప్పరించటంలో నిమగ్నుడైనాడు. వసుధ లేచి లైటువేసింది. సాయంకాలం వెలుతురికి వీడ్కోలు చెపుతోంది.

అందరి మనస్సులలోనూ అలసట పోయింది. సాయం కాలం అందంగా కన్పించసాగింది. అప్పుడు సరోజిని నిశ్శబ్దాన్ని భంగం చేసింది.

"తలుచుకుంటే నాకు అప్పుడప్పుడు నవ్వొస్తుంటుంది. ఈమధ్య హైదరాబాదు రాజధానీ నగరమైనప్పుడు, రాజ ధానీనగర చరిత్ర వ్రాస్తూ యెంతమందో ఒక ప్రేమకధను సువర్ణాక్షరాల్లో లిఖించారు. భాగామతి ప్రేమకధను మీా రెరుగుదురా! అది యెటువంటిదో, ఆమె సంస్కారం యెటు వంటిదో, ఆమె ప్రేమయొక్క స్వరూపం యెలాంటిదో, ఆమె ఆలోచనలు యెలాంటివో, ఆమె జీవితంయొక్క ఆంతర్యము యెలాంటిదో ఎవరూ ఆలోచించలేదు. ఆమెను పొగిడారు. కులీ కుతుబ్‌షా మహోత్తమ ప్రేమికు డన్నారు. సామా న్యమూ మరి, ఆమె పేరున వొక నగరం కట్టించివేస్తే, తక్కిన విషయాలతో వీళ్ళకవసరం లేకపోయింది. నవాబు యెంత విషయ లోలుడో, అతగాడి కెంతమంది ప్రియురాండ్రు వుండే వాళ్లో ఇదేమీా వీళ్లు లెక్కకు తీసుకోలేదు. వాళ్ళ ప్రేమ గాధ, ఆర్ద్రహృదయాలు గొంతెత్తి గానం చేశాయి. అందుకే నవ్వొస్తుంది నాకు మనుష్యులు యెంత అమాయకులో అని. చరిత్ర యెన్ని అసత్యాలతో నిండివుంటుందా అని. తాజ మహల్ గురించిన సంగతులు మన మెరుగుదుము. షాజహాన్ ప్రపంచంలో మహా ప్రేమికుడు. బేగం అతడిని ప్రేమించక పోయినా, కుత్సితంగా ఆమెను చక్రవర్తి చెరబట్టి దరికి తీసు కున్నా, వాళ్ళ ప్రేమగాధ ఖండఖండాంతరాళాల్లో, దేశ దేశాలలో గానం చేయబడుతోంది. అందుకే నాకు నవ్వొ

స్తుంది. మా వూళ్లో పాపం, ఓ అమ్మాయీ, అబ్బాయీ ప్రేమించుకున్నారు. వాళ్ళు చేసిన నేరమల్లా వాళ్లు ఒకకులం వాళ్లు కాకపోవటమే — ఆ అమ్మాయికంటె చాలా తక్కువ కులంవాడతను. చిత్రమేమంటే వాళ్ళ ప్రేమ ఫలించకపోగా వాళ్ళప్రాణాలు తీసింది. ఆ అమ్మాయీ, అబ్బాయీ, తమ ప్రేమ ఫలించనందున కట్టకట్టుకుని బావిలో దూకారని ప్రచారం సాగింది. ఊళ్ళో యెంతమందో, ఆ ప్రేమగాథను విని కన్నీళ్లు కార్చారు. పాపం, వాళ్లు పెళ్ళిచేసుకుని వుంటే. ఇంత ప్రేమ గలవాళ్ళను తలుచుకుని కన్నీళ్లు కార్చారు. అంతా పాపం అనుకున్నారు. నాలుగు రోజుల తర్వాత దిన పత్రికలలోకూడా ఇదేవార్త ప్రచురించబడింది. నాకు తెలుసు. ఎవరో ఒక కావ్యమో, ఒక కథో లేక వొక నవలో వాళ్ళ ప్రేమగాథను ఇతివృత్తంగా తీసుకుని వ్రాస్తూవుంటారు, ఎంత గొప్ప ప్రేమికులో అని —

"అందుకే నాకు నవ్వొస్తుంది, ఈమనుష్యుల కుత్సితాలు చూసి, యీ మనుష్యుల అమాయకత్వం చూసి. ఈమనుషులు నీచమైన భావాలతో యెదగలేక పోతున్నారు. నాకు తెలుసు నేను చెప్పేదా — ఆ అమ్మాయికి యిద్దరన్నలున్నారు. వాళ్ళు తమ చెల్లెలు వొక తక్కువకులంవాణ్ణి ప్రేమించటం ఇష్టంలేక మరేమీ చెయ్యలేక, వంశగౌరవకోసం, వాళ్లిద్దరినీ గొంతు పిసికి భావిలో త్రోశారు. నాకు తెలుసు. నాకు తెలుసు లోకానికి తెలియదు. అందుకే నాకు నవ్వొస్తుంది ఈ మనుష్యుల అమాయకత్వం చూసి..."

సరోజిని యేడుస్తుంది.

కాసేపటికి తనను తాను సంబాళించుకుని "నాకేం నేను చాలా మంచిహృదయం గలదాన్ని. ప్రపంచంలో హృదయమే అన్నిటికన్నా సత్యమైనది. నిత్యమైనది. హృదయాన్నిమించిన సత్యం లేదు.

నా ప్రేమ దైవత్వంతో కూడుకున్నది. అందుకే నాకు బాధ లేదు."

సరోజిని కళ్ళు తుడుచుకుంది.

మళ్ళీ చెప్పసాగింది.

"సత్యాసత్యాలు యెవరికి తెలుస్తాయి? మనుష్యులకి స్వతహాగా ఆలోచించేగుణం తక్కువగా వుంటుంది. మనుష్యులయొక్క యీ నైజాలవల్లనే యీ కట్టుబాట్లు వచ్చాయనుకుంటాను."

సత్యన్నారాయణమూర్తికి అక్కయ్యపైన అణుమాత్రం సానుభూతి కలుగకపోగా, ఆమె చేసిన పాడు పనిని సమర్థించుకొనే విధంచూసి ఆమెపట్ల నీరసభావం ప్రకటించాడు.

"నన్ను గురించికూడా యెవరయినా కథవ్రాస్తే బావుండును. నాకు న్యాయంకూర్చి ఎవరు వ్రాస్తారులే, లోకులూ, నావాళ్ళూకూడా నన్ను అర్థం చేసుకోలేకపోతున్నప్పుడు."

సత్యన్నారాయణమూర్తికి అక్కయ్య ఇలా అందరి ముందరా మాటాడుతున్నందుకు యెంతో కించగా వుంది.

"సరే పోనీండి..." అని పరంధామయ్యగారివేపు తిరిగి "బాబాయిగారూ! మీకు నామీద సానుభూతి వుందా?

పరంధామయ్యగారు ఇందాకటినుంచీ మౌనంగా వుండిపోయారు.

సరోజిని ఇలా మాటాడుతుందనిగాని, మాటాడకలుగుతుందనిగాని పరంధామయ్యగారికి తెలీదు.

"నీవు చాలా మంచిదానివమ్మా!"

సరోజిని నవ్వింది.

"పోనీండి బాబాయిగారూ! అంతమాత్రమయినా అన్నారు."

"అసలు మీపిల్లలంతా మంచివాళ్ళేనమ్మా"

"కొంత కొంత మంది మంచితనంకాని, గొప్పతనం కాని వాళ్ళు బ్రతికుండగా గణనకు రాకపోయినా తరవాత కూడా రావు. బాబాయిగారూ వొకటడుగుతాను, భారతంలో కల్లా మీకు గొప్పతనంగల పాత్ర యెవరు కనపడుతున్నారో చెప్పండి?" అన్నది సరోజిని.

పరంధామయ్యగారికి ఆశ్చర్యం ముంచుకొచ్చింది. ఆయన యేమీ మాట్లాడలేకపోయాడు,

"భారతం మొత్తం నేను చదవలేదమ్మా" అన్నారు.

"నేనూ చదవలేదులెండి బాబాయిగారూ! అయినా చాలామటుకు చదివాను. అయినా మనకు కథంతా తెలుసు కదూ?"

పరంధామయ్యగారు ఆలోచనలో మునిగిపోయారు. ఇందులో ఏదో విశేషం వుండి వుంటుంది. ఆ విశేషమేమిటో యెంత ఆలోచించినా ఆయనకు తోచలేదు. ఆయన మౌనంగానే వుండిపోయాడు.

"నేను చెప్పనా బాబాయిగారూ! ఏకలవ్యుడు! భారతం మొత్తంలో అటువంటి పాత్ర లేదు. మనం కోరికోరి

సంపాదించినదానిని కొద్దిగానైనా బాధ పడకుండా వదులుకోవడం యెంత గొప్పవిషయం? పోనీండి, ఏదో తమాషాగా చెబుతున్నాను. ఏకలవ్యుడిని ఎవరూ గుర్తించుకోరు. అలానే లోకం గొప్ప విషయాన్ని గుర్తించదు; గుర్తుంచుకోదు."

సత్యన్నారాయణమూర్తి విస్మయంతో వింటున్నాడు.

బయట కారు ఆగిన చప్పుడు వినిపించింది.

సరోజిని నొక్కసారి వుద్వేగంతో లేచి వసుధ బుజం భుజంమీద చెయ్యివేసి ఆదరంతో ఆమె తల నిమిరి, "వస్తాను తల్లీ!" అని వేగంగా ముందుకు నడిచింది. పరంధామయ్యగారు స్తబ్ధుగా వుండిపోయారు. వసుధ కన్నుల్లో నీళ్లు నిలిచాయి. సరోజిని కారు యెక్కడం వాళ్ళు చూశారు. కారు కదలిపోయిన చప్పుడు వాళ్ళు స్పష్టంగా విన్నారు. వసుధ అప్పుడు కళ్ళు తుడుచుకుంది.

కొద్దిసేపు గడచిన తర్వాత పరంధామయ్యగారిని భార్య పిలిస్తే ఆయన లోపలికి వెళ్ళిపోయారు. శివుడు కుంపటిముందు కూచుని విసురుకున్నాడు.

వసుధ అడిగింది.

"మీ అక్కయ్యను గుర్తించలేదా?"

ఆమె కంఠంలోని విహ్వలతనుచూచి అతడు చలించాడు.

కాసేపుండి తననుతాను సంబాళించుకొని "ఆమె మా అక్కయ్యకాదు" అన్నాడు.

వసుధ ముఖం వెలవెలబోయింది.

అతడివేపు తీక్షణంగా చూసింది.

గిరుక్కున తిరిగి ఇంట్లోకి వెళ్ళిపోయింది.

సత్యన్నారాయణమూర్తి కర్తవ్య జ్ఞానం నశించిన వాడిలా అలానే కూచుండిపోయాడు. కళ్ళు మూసుకున్నాడు. కళ్ళు మంటలుపుడుతున్నాయి. తల నొప్పిగా వుంది. ఇవాళ లేచిన రోజు మంచిదిగాదు అని అతనిలోని మూఢ సంప్రదాయం చెపుతున్నది. అతడు లేచి వెళ్ళిపోదామని రెండడుగులు ముందుకు వేశాడు.

మళ్ళీ అక్కడే కూలబడిపోయాడు.

మళ్ళీ లేచి నిలుచున్నాడు.

వెళ్ళిపోవటానికి తటపటాయిస్తుండగా పరంధామయ్యగారు లోపలనుంచి వచ్చారు. ఆయనకు యెంతో దిగులుగా వుంది. ఆవిడ వొంట్లో బావుండలేదు. "రెండు మూడురోజుల్లో మళ్లీ నేను పోవాల్సి వుంటుంది ఎలానో ఈ పూట వుండిపో నువు" అన్నారాయన సత్యన్నారాయణమూర్తితో.

"కాదు. కాదు. నాకార్జెంటు పనుంది. వస్తాను." అంటూ త్వరత్వరగా వాకిలి దాటాడు సత్యన్నారాయణ మూర్తి. అతడు పూర్తిగా అలిసిపోయినాడు.

ఇవాళ వ్యవహారమంతా చిత్రంగా ఉంది. ప్రొద్దున కాలేజీకి వెళ్ళలేదు. రామారావుకి దూరంగా వుండాలి!

కొంతదూరం నడచినదాకా అతడికి తన కొత్తరూము గుర్తుకు రాలేదు. ఒక్కసారిగా యేదో కొత్తవిషయం స్ఫురణకి వచ్చినట్లుగా తన రూము విషయం జ్ఞప్తికి వచ్చింది. ఈ కష్టాలు యెప్పుడూ ఉండేవే - బాధపడుతున్నకొద్దీ బాధ పెట్టేవే. కనుక వీటిని యేమాత్రమూ లక్ష్యపెట్టకూడదను.

కోఠీదాకా నడచిపోయినాడు. బజారంతా లైట్లతో దేదీప్య మానంగా వుంది. ఎన్నో రిక్షాలు, బళ్ళు, సిటీబస్సులు, సందడిగా వుంది. లైట్లముందు రంగురంగుల పత్రికలు వేళ్ళాడ బడున్నాయి. పేర్చబడివున్నాయి. ముఖాల్లో సంతృప్తితో పత్రికలు చూస్తున్నారు కొందరు. కొనుక్కుంటున్నారు కొందరు ఆడవాళ్ళూ మొగవాళ్ళూ ఎందుకింత ఆనందం వీళ్ళకి. తేనెటీగల్లాగా యెందుకింత ఆర్భాటం. రంగులరంగుల చీరలు కదలిపోతున్నాయి. రకరకాల మనుష్యులు కదలి పోతున్నారు. సముద్రంలోని అలలమల్లే జనసందోహం సాగు తోంది. తాజమహల్ హోటల్‌కి వెళ్ళాడు. కనులపండువుగా కన్పించింది. కష్టాలూ, కన్నీళ్ళూ యెప్పుడూ వుండేవే— కష్టాలని నెట్టివేయాలి. అసలు వాటిగురించే ఆలోచించ కూడదు. కన్నీళ్ళు తుడిచివేసుకోవాలి. అసలు కన్నీళ్ళు వూరకుండావుంటేనే మంచిది. మూర్తి తాజమహల్ హోటల్‌లో భోజనం చేశాడు.

ఈ ఊరువచ్చిన తర్వాత యిటువంటి గొప్ప పని యెన్నడూ చేయలేదు. చలిగావుంది. వెన్నెల కూడా వచ్చింది. ఫాన్ వేసుకున్నాడు. తనని తాను మరచిపోయినట్లైంది అతనికి పని. ఖరీదైన సిగరెట్ తీసుకుని కాల్చాడు. అతడు సిగరెట్ కాల్చి యేడాదిపైన అయివుంటుంది. మనసుకేమిటో అని పించింది. ఏమిటో కసిగావుంది. అందుకే యిలా ప్రవర్తిస్తున్నా డతడు. సిగరెట్ కాల్చుకుంటుంటే మనసుకు హాయిగా వుంది. తరువాత రిక్షా మాట్లాడుకుని రూముకు చేరుకున్నాడు మూర్తి.

ఒక్కడూ చెక్కమెట్లు యెక్కి వెడుతుంటే కొత్త అనుభూతి పొందసాగా డతడు. మాంసపు దుకాణం మూసివేసి వుంది. పైన తన గదిపక్కను రెండు మూడు గదులలో లైట్లు వెలుగుతున్నాయి. మూర్తి లైటు వెలిగించుకుని జంబుకానా పరచి పక్కపరచుకున్నాడు. ఒకమూల గోడకు చిన్న గూడు లాంటిది వుంటే దాంట్లో పుస్తకాలు సర్ది పెట్టుకున్నాడు. తరువాత యేమి చెయ్యటానికీ తోచలేదతడికి. కాసేపలానే కూచుండిపోయాడు. వీధిలోని సందడంతా స్పష్టంగా వినిపిస్తోంది. రిక్షావాళ్ళ గంటల చప్పుళ్ళూ, "చాయ్" అమ్ముకునేవాళ్ళ కేకలూ, కొద్దిదూరాన దిగువవున్న టీషాపులోని కలకలమూ వినిపించసాగినయ్.

ఒకందుకు అతడికి సంతోషమైంది.

మరొకందుకు దిగులయింది.

ఆ నానాగోలా వినవస్తున్నందుకు అతడికి దిగులైంది.

ఆ నానాగోలా వినవస్తున్నందుకే అతడికి సంతోషమైంది.

సందడిగా వున్నందుకు సంతోషం. చదువు సాగదేమోనన్న దిగులు.

మసీదులో బాబా ప్రార్థన చేశాడు.

సత్యన్నారాయణమూర్తి పక్కమీద పడుకున్నాడు.

అతడి కివాళంతా కొత్తగా వుంది.

కిటికీలోంచి చందమామ కనిపిస్తున్నాడు.

నిద్రపట్టితే బావుండును అనిపించి దతడికి.

కాని నిద్రవచ్చే సూచనలు కనిపించలేదు.

"ఇవాళ కాలేజీకి పోలేదు" అదేదో కొత్త విషయ మన్నట్లుగా మనసు చెప్పింది.

ఎంక శేశ్వర్లు వ్రాసిన ఉత్తరం తీసి మళ్ళీ చదువు కున్నాడు.

తండ్రిగుర్తువచ్చాడు. రామారావు యేంచేస్తుంటాడో! హాయిగా నిద్రపోతుంటాడు అని ఆలోచించుకున్నాడు.

పరంధామయ్యగారింటికి వెళ్ళటం, అక్కడ జరిగిన సంగతులూ అన్నీ గుర్తు వచ్చాయి.

అక్కయ్య - అనుకున్నాడు.

వసుధ - అనుకున్నాడు.

వసుధ రెండవ తమ్ముడు జ్ఞాపకం వచ్చాడు.

అతడి మనసు గిలగిలలాడి పోయింది.

అవాళ తన ఖర్చు యెంతో లెక్క పెట్టుకున్నాడు.

దగ్గర దగ్గిర రెండు రూపాయలైంది.

అతడి మనసుకి కష్టమైంది.

అలానే ఆలోచనలతో యెంతసేపటికిగానీ నిద్రపట్ట లేదు అతడికి. పొద్దున మామూలుగానే నిద్ర లేచాడు. క్రిందికి దిగిరాగానే మొట్టమొదట కన్పించింది మాంసపు దుకాణమే- అతడి మనసు గిజగిజలాడిపోయింది. అలవాటవుతుందిలే — యీ దృశ్యంకూడా అని మనసు సరిపెట్టుకున్నాడు.

# 8

ప్రెస్‌లో చేరినప్పటినుంచీ క్షణంసేపుకూడా తీరిక దొరకటం లేదు సత్యన్నారాయణమూర్తికి. చెప్పల్ బజారులోని తన రూముచుట్టూ వున్న సందడిని అణుమాత్రమూ అతడు తప్పించుకోలేకపోతున్నాడు. ప్రెస్‌కి ఆదివారం సెలవు. ఆదివారం ఇంట్లో వుండాలంటే అతడికి ప్రాణాంతంగా వుంటోంది. అతడి రూముకి కొద్ది దూరంలోనే ఒక హోటల్ వుంది. తెల్లవారింది మొదలు చీకటిపడి పదిగంటలయినదాకా రికార్డు సంగీతం వినిపిస్తూనే వుంటుంది. మసీదులోంచి నిరంతరం ప్రార్థనలు వినిపిస్తుంటాయి. క్రింద మాంసపు దుకాణపు అల్లరి. వచ్చివచ్చి ఇలాటిచోట పడ్డానేమా అని బాధపడక పోలేదు. ఎదురుగా గవర్నమెంటువారి హైస్కూలు కూడా వుంది. స్కూలు ఫస్టుబెల్ కొట్టినపుడు పిల్లలంతా గుంపులు గుంపులుగా చేరి గోలచేస్తారు. రీసెస్‌లోనూ అంతే. ఆదివారం మాత్రం వాళ్ళ గోలవుండదు.

అంత జనసమ్మర్దంగల వీధిలో రూము తీసుకున్నందుకు వొకపక్క బాధపడుతున్నప్పటికినీ, అతడికి వొక రకమైన తృప్తి లేకపోలేదు. మనిషి అతి సందడిని యెలా భరించలేడో, ఆ ప్రశాంతతనుకూడా అలానే భరించలేడు. సత్యన్నారా

యణమూర్తికి ఒక విషయం గుర్తువచ్చింది. అతడు ప్రశాంతత లభిస్తుందనే వుద్దేశ్యంతో ఊరి పొలిమేరలు దాటి యెక్కడో పొలాల్లోకి పోయి కూచునేవాడు. కాని పది నిమిషాలుకూడా కూచోలేకపోయేవాడు. అతని తత్త్వం అలాంటిది. వారం పదిరోజుల్లోనే అతడు యీ వాతావరణానికి అలవాటు పడిపోయాడు.

అసలు రూములోనే యెక్కువకాలం గడపవలసిన అవసరం లేకపోయింది అతడికి. ఎప్పుడూ ఏదో వొక పని వుంటూనే వుంది. సరిగ్గా తొమ్మిదిగంటలకు బయలుదేరి తలుపుకి తాళంవొక్క బయటపడితే తొమ్మిదింబావుకల్లా కాచిగూడా స్టేషను చేరుకుంటాడు. లోకల్ ట్రెయిన్ సిద్ధంగా వుంటుంది. పదిగంటలకల్లా కాలేజీకి చేరుకుంటాడు.

అయితే భోజనం విషయమై అతడు చాలా బాధపడవలసి వస్తున్నది. ఏరోజూ సరైనవేళకు ఆహారం తీసుకోవటం వీలుపడడంలేదు. ప్రతి రోజూ వొంటిగంటా రెండూ అవుతున్నది. ఆ భోజనమైనా కేవలం బ్రతికేందుకున్నూ, మనస్సుని తృప్తిపరచేందుకున్నూ పనికివస్తున్నదే గాని, దేహానికి ఏమాత్రమూ పరిపోషకం కాదు.

మూడుగంటలకల్లా రూముకి వచ్చిపడతాడు. నాలుగు గంటలదాకా కాసేపు విశ్రాంతి తీసుకుని ప్రెస్‌కి బయలుదేరుతాడు. అతడు చేసే పనినిబట్టి, గంటలలో కొలిచి, అతడికి విలువ చెల్లిస్తున్నారు. బాగానే వుంది. కొన్నిరోజులు పని వుంటుంది. రాత్రి పన్నెండుదాకా కూడా పనిచేయవచ్చు.

పదిపేను, ఇరవై రోజుల్లోనే అతడి కళ్ళు లోతుకు పీక్కుని పోయినయ్. అతడు చేసేపనికి తగిన ఆహారంలేదు. బ్రతికేందుకు పనిచేసుకోక తప్పదు. ఈ రకమైన అసంతృప్తిని అధిగమించేందుకు సిగరెట్లు తాగటానికి అలవాటుపడ్డాడు. సిగరెట్లు త్రాగటమనేది ఒకరకంగా చౌకగా రిలీఫ్ పొందటమనే విషయాన్ని అత్యధిక సంఖ్యాకులు అంగీకరించవచ్చును. సత్యన్నారాయణమూర్తికి సిగరెట్లు కాల్చేవిద్యలో ప్రావీణ్యాం గతంలో లేదు. తెనాలి విడిచిపెట్టినదాకా అసలు అలవాటే లేదు.

ఒకసారి యెప్పుడో శెలవులకు వచ్చినప్పుడు తెనాలిలో స్నేహితులతో పార్కులో కూచుని సరదాగా సిగరెట్ కాల్చాడు. ఇంటికి వెళ్ళగానే అమ్మ అరగంటసేపు ఉపన్యాసం చెప్పింది. చెడిపోయేందుకు మొదటమెట్టు సిగరెట్లు త్రాగటం అని ఆమె యెంతసేపో చెప్పింది. 'ఇక ముట్టను' అన్నదాకా ఆమె సంతృప్తి పడలేదు.

కాని ఇప్పుడు ఆమె లేదు. ఆత్మ యెక్కడో వుంటుంది అంటారు కొందరు, కాని సత్యన్నారాయణమూర్తి అంత ఆలోచించదలచలేదు. రోజు గడచి రోజు రావాలి. విసుగు పడకుండా సాయంకాలాలు గడిపేందుకు, విరామ మెరుగక పరిశ్రమించేందుకు, వొకరకమైన యాంత్రిక జీవనాన్ని అనుభవించేందుకు, సిగరెట్లు బాగానే కాలుస్తున్నాడు. రాత్రిపూట పడుకోబోయేముందు, ఆ 'టీ' హోటలుకి వెళ్ళి కాసిని పాలు తీసుకుంటాడు. ఒక్కొక్కరాత్రి అవీ దొరకవు. ఒక్కొక్క రాత్రి నిద్రపట్టదు. ఏమి లేమిటో ఆలోచనలు. రోజంత

నడుస్తూ కాలుజారి నూతిలోపడ్డట్లు, ఫుల్ రోడ్ మీద పరుగెత్తుతున్న లారీచక్రం క్రిందపడినట్లు, బ్రహ్మాండమైన వానకురుస్తుంటే తాను రోడ్డుమీద తడుస్తున్నట్లు, అయ్యో యీ ఒక్క జతగుడ్డలూ నాశనమయినాయే, కాలేజీకి యెలా వెళ్ళటం అని విచారించినట్లు కలలు. మరీ వొకొక్కరోజు స్థానిక దినపత్రికలో తన ఆత్మహత్యనుగురించి తానే చదివి, కాసేపు యేడ్చి, కాసేపునవ్వి యీ తెలివిలేని మనుషులని యీసడించినట్లు, అక్కయ్య తనని బతిమాలుతున్నట్లు, వసుధ తనతో ప్రేమగా మాట్లాడుతున్నట్లు యేమిటేమిటో కలలు. రోజులు గడచిపోతున్నాయి. ఒకరోజు పోయి ఒకరోజు వస్తుంది. ఒక ఉదయం, ఒక సాయంకాలం అనుభవించి మనిషి ఒకరోజు పెద్దవాడవుతున్నాడు. మార్పు. సృష్టి. ఏమీ మార్పులేదు అనిపిస్తుంటుంది. కాని క్షణంలో సగంలోకూడా ప్రపంచం మారుతూవున్నది.

ఒక చిన్న పూలమొక్కను ఉదాహరణకు తీసుకుంటే, క్షణక్షణం సృష్టిలోని మార్పును మనం గమనించగలుగుతాం. నిన్న పూసిన మొగ్గ యివాళ వికసిస్తున్నది. మొన్న మొగ్గ పుట్టడానికి లత తనలోని జీవపదార్థాన్ని వెచ్చించి వుంటుంది. రేపు యీ పువ్వు యెండి విత్తనంగా రూపొందుతుంది. ఎల్లుండి ఆ విత్తనం యెండుతున్నది. ఆ తరువాత క్రింద రాలుతుంది. మళ్ళీ మొలక యెత్తుతుంది. భూమిని బద్దలుకొట్టి ఆకు తొడిగి పులకరించిపోతుంది. ప్రపంచాన్ని చూసి నవ్వుతుంది. కణుపు కణుపుకీ ఎట్లాటి చివుళ్ళు తొడుక్కుంటుంది. ఆ చివుళ్ళు యెంత అందంగా వుంటాయో? పచ్చపచ్చ, చిన్న

చిన్న ఆకులవుతాయి ఆ చిగుళ్ళు. మొద్దుబారిపోతాయి. పండిపోతాయి. రాలిపోతాయి. రాలిపోయిన చోటునుంచే కొత్త చివుళ్ళు పుట్టుకొస్తాయి.

ఆ సూర్యుడే. ఆ చంద్రుడే. ఆ భూమే. ఆ గాలే. ఆ వెలుతురే. ఆ వెన్నెలే. ఆ పువ్వులే. అవే వాత్సల్యాలు. అవే ప్రేమలు. అవే అనురాగాలు. అవే ద్వేషాలు. అవే అసూయలు. అవే కపటాలు. అవే కార్పణ్యాలు. ఒక సాయంకాలం. ఒక ఉదయం. వెరసి ఒకరోజు. ఏడు రోజులు ఒక వారం. నాలుగు వారాలు ఒక నెల. పన్నెండు నెలలు ఒక సంవత్సరం. ప్రభవా, విభవా, శుక్లా, ప్రమోదూతా, ప్రజోత్పత్తి...ఎలిమెంటరీ స్కూలు.

ఒకరోజు. ఒకరోజు.

ప్రతిరోజూ వెలుతురూ, చీకటీ ఒకదాన్ని ఒకటి మింగుతూనే వున్నాయి. ప్రతిరోజూ ఆకాశం పొద్దుటపూట వొక దిక్కునా, సాయంకాలం దానికి యెదురుదిక్కునా రంగు రంగుల మబ్బులు రచించుకుంటూనే వుంది. చీకటి కట్టుకున్న చీరలు ప్రతిరోజూ ఉదయం వొలిచేస్తున్నాడు. ప్రకృతి నగ్నం అవుతూనూ వుంది. చుక్కలు మిలమిలా మెరసిపోతూనూ వున్నాయి. రోడ్లమీద కార్లూ, బళ్లూ.

ప్రతిరోజూ యెక్కడో ప్రియురాలు ప్రియుడి వృక్షం మీద అలసి విశ్రమిస్తూనేవుంది. అతడిశక్తుల నామె ఖర్చు పెట్టేస్తున్నది. దాని ఫలితాన్ని ఆమె అతడికే యిచ్చివేస్తున్నది. ఒకరి నొకరు చీకాకుపరచుకుంటూనే వున్నారు. సంతోషాన్ని రెండుపెట్లి భాగించి యిద్దరూ పంచుకుంటూనూవున్నారు.

ప్రతిరోజూ కాలేజీకి పోతున్నాడు కుఱ్ఱవాడు.

పెళ్లికాని పిల్ల కలలు కంటూనేవుంది. స్వప్నాలు ఎంత అందంగా వుంటాయి !

రాజకీయ నాయకు డొకడు ప్రతిరోజూ ఆత్మవంచన చేసుకుంటున్నాడు.

పదిహేడేళ్ళ అమ్మాయి పేరంటానికి పోతూంది.

ఎక్కడో పాపం యెవరో యేడుస్తున్నారు.

మృత్యువు.

ప్రసవవేదన.

పెదిమలూ పెదిమలూ కలిపి ముద్దుపెట్టుకుంటున్నారు.

కర్మాంతరాలకి జమాఖర్చులు వ్రాసుకుంటున్నాడో పెద్దమనిషి.

పరుగెత్తుతున్న రైలు చీకటిలోంచి ఉదయంలోకి పోతూన్నది.

అందులోనే జబ్బుమనిషి. అందులోనే కొత్తజంట.

గడియారానికి కీ యిస్తున్నారు.

క్యాలెండర్ల పాతకాగితాలు చించేస్తున్నారు.

చర్చి గంటలు మోగుతున్నాయి.

వ్యభిచారం జరుగుతున్నది.

ప్రేమకు మాటలురాక కళ్ళలోనే ఆవేశపడుతున్నది.

ఒక చిట్టినాన్న. ఒక చిట్టితల్లి.

ఒక చిన్న అబ్బాయి. ఒక చిన్న అమ్మాయి.

ఒక యువకుడు. ఒక యువతి.

ఒక భార్యా, ఒక భర్త.

ఒక ముసిలాడు. ఒక ముసిలిది.

ఒక చావు. ఒక పుట్టుక.

ఒకరోజు. ఇంకోరోజు. ఇంకోరోజు. మరోరోజు. రోజులు గడుస్తున్నాయి. జీవితాలు యెదుగుతున్నాయి. ఒక్కసారి స్థాణువుగా అయిపోయి, మళ్ళీ గిరగిరా తిరిగి అర్థంలేని చోటుకు పోతున్నది బతుకు.

సత్యన్నారాయణమూర్తి యేడ్చుకున్నాడు. ఆహా! యెంత దుర్భరావమానంబయ్యెన్. ఇటుపై నా గతేమిటో... సిగ్గులాంటి; అవమానంలాంటి; నీచత్వములాటి అనుభూతి. నాలుగురోడ్ల కూడలిలో, పొట్టిలాగు తొడుక్కుని, అరచేతుల నిండా మసి పూసుకుని, కళ్ళు లోతుకుపోయిన, గడ్డం పెరిగిన, చొక్కా చిరిగిన వొక అబ్బాయిని – ఎదురుగా, వున్నంతలోనే శుభ్రంగావున్న చీర కట్టుకుని, వికసించిన పువ్వులు పెట్టుకుని, చేతిలో పుస్తకాలు పట్టుకుని, చౌకరకం చెప్పులు తొడుక్కుని, కృత్రిమమైన చిరునవ్వు పెదవులపై వెలుగుతుండగా, వొక అమ్మాయి నిలవేసి పలకరించింది.

"ఏం, యీ మధ్య బొత్తిగా అవుపించటమే మానేశారు ?"

ఆ అబ్బాయి పేరు సత్యన్నారాయణమూర్తి.

ఆ అమ్మాయిపేరు వసుధ.

వసుధకి జాలిగావుంది. నవ్వుగావుంది.

సత్యన్నారాయణమూర్తికి అవమానంగా వుంది. సిగ్గుగా వుంది. తన చొక్కా బాగులేదు. తన గడ్డం బాగులేదు. తన చేతులనిండా మసిబాగులేదు. ఆమె బాగుంది.

ఆమెచేతులు బావున్నాయి. ఆమె చిరునవ్వు చక్కగావుంది. ఆమె తనకు యెదురు నిల్చున్న తీరే బావుంది.

సాయంకాలం ఆరుగంటలు.

"మీ అమ్మగారికి వొంట్లో యెలావుంది ? పూర్తిగా కోలుకున్నారా ? ఆరోగ్యం బావుందా?"

"అమ్మకు వొంట్లో బాగానేవుందిట. చిన్న తమ్ముడికి జ్వరం వస్తోంది. ఏమిటో భయంగా వుంది." ఆమె కళ్ళలో దిగులు. పాడు నవ్వు నవ్వింది.

"అలానా, నాకు తెలీదు..." అతడికి భయమైంది.

"మీరానైపుకివచ్చి యెన్నాళ్ళో అయింది. మీ అక్కయ్యగారు మొన్న మళ్ళీ వచ్చి చూసి పోయారు."

అతడు నిర్లిప్తుడై పోయాడు.

"ఆమె చాలామంచిది. మీకంటే చాలా మంచిది. మీరంతా కలసి ఆమెను దుఃఖపెడుతున్నారు."

"మేమేం చేశాము? ఆమే చేసుకుంది."

"సరే యీ వేష మేమిటి ?"

"ఏం చెయ్యనుమరి."

ఆమెకు దిగులైంది. నిట్టూర్చింది.

"మా స్కూలు ఇక్కడే."

"నాకు తెలుసు."

"నిజంగా..."

"మీ మామకూడా యీ ప్రాంతాలలోనే నట ?"

"అవును."

"అయితే నాకు యెప్పుడూ కన్పించారు కాదు."

"పని. యెప్పుడూ పనే."

"మరి నేను వస్తాను."

"ఇకెక్కడికి వెళుతున్నారు?"

"స్కూలుకి. టీచర్స్ కాన్ఫరెన్సు వుంది. డి. ఇ. వో. గారు వస్తున్నారు."

వసుధ వెళ్ళిపోయింది.

సత్యన్నారాయణమూర్తికూడా ఆవేపే వెళ్ళవలసిన వాడైనప్పటికీ యేమీ తెలియనివాడిలా ముందుకి నడిచాడు. ఆగి వెనక్కి చూశాడు. ఆమె అందంగా నడుచుకుంటూ వెళుతున్నది. ఆమెనుచూసి అతడికి దిగులైంది. వగపైంది.

ఐదు నిమిషాలు సినిమా పోస్టర్లు చదువుతూ నిలుచుండి పోయాడు. ఎన్నాళ్ళయిందో సినిమాకు పోయి ?

తర్వాత రూముకేసి నడిచాడు. గుడ్డలు మార్చుకున్నాడు.

నారాయణగూడాలో భోజనం హోటలుకి వెళ్ళాడు.

భోజనంచేసి బయటకు వచ్చేసరికి యేడుగంటలైంది.

ఎక్కడకు పోవాలి. గడ్డం పెరిగివుంది. దిగులుగా వుంది. వసుధ తనని ఆ రూపంలో యెందుకు చూసిందీ ?

ఏమనుకున్నది ?

మనసు అసంతృప్తితో మూలిగింది.

వైకుంఠాచార్లు ఇంటికి వెళితే - చాలా రోజులనుంచీ పోవాలనుకుంటున్నాడు. ఇంతవరకు ఒక్కసారికూడా పోవటానికి వీలుపడలేదు. ఇవాళ యెక్కడకూ వెళ్ళలేదు తాను. వైకుంఠాచార్లు దగ్గరకే పోవాలి. పోతే, వైకుంఠం చిత్రమైన

వాడు. వైకుంఠం దగ్గరకు పోతే మనస్సు చల్లబడుతుంది. వైకుంఠంతో మాట్లాడితేనే హాయిగా వుంటుంది. వైకుంఠాన్ని చూస్తేనే కొండంత బలం వస్తుంది. వైకుంఠం మంచివాడు. చాలా మంచివాడు. జీవితాన్ని కాచి వడబోసినవాడు. జీవితమంటే ఏమాత్రమూ భయం లేనివాడు. ఏమాత్రమూ లక్ష్యం లేనివాడు. చీకటి వెలుగులని జీర్ణించుకున్నవాడు. అసలు ఆ రూపాన్ని చూస్తేనే ఆహ్లాదం కలుగుతుంది. ఒక్కడూ ముగ్గురికి సమాధానం చెప్తాడు. వైకుంఠం దగ్గరికి వెళ్ళాలి. పున్నమి ముందర త్రయోదశి. ఆకాశంపైని వెన్నెల ఆహ్లాదం కలిగిస్తోంది మనసుకి. అప్పుడే చలి ప్రారంభమైంది.

రిక్షాని పిలిచాడు సత్యన్నారాయణమూర్తి.

వాడు ఆరణాలు అడిగాడు నల్లకుంటకి.

మూర్తి విసుక్కున్నాడు. పదడుగులు ముందుకి నడిచాడు.

ఇంకొకడు వచ్చాడు. 'చారనా దేవు బాబా' అన్నాడు వాడు.

మూర్తి యెక్కి కూచున్నాడు. రిక్షా బయలుదేరుతుండగా వంగి హోటల్లో గడియారంకేసి చూశాడు. సరిగ్గా యేడున్నర.

రిక్షాలో పోతుంటే యింకా చలిగావుంది. వెన్నెల యింకా అందంగా వుంది. రిక్షా వెళుతోంది. నల్లకుంటకి చేరుకుంది. రిక్షాని పంపించివేశాడు మూర్తి. చిన్న సందులోంచి వెళుతున్నాడు. పాతకాలపు యిళ్ళు వెన్నెల్లో మెరు

స్తున్నాయి. వైకుంఠంలాంటి వాళ్ళు యెక్కడున్నా అందరికీ తెలిసేవుంటాయి. అదే ధైర్యం మూర్తికి. మురికి నీళ్ళు మసీ కలసి చిన్న చిన్న కాలువలుగా ప్రవహిస్తోంది.

అరటిచెట్లబారు వెన్నెట్లో స్పష్టంగా అవుపడుతున్నాయి.

నీళ్ళమీద గడ్డి స్పష్టంగా కనిపిస్తున్నది. దట్టంగా మొలచివుంది. అక్కడక్కడ భూమిమీద చంద్రుడు కనిపిస్తున్నందువల్ల అక్కడ నీళ్లు వున్నాయని తెలుస్తున్నది. బ్రిడ్జి ప్రక్క బీడీల కొట్టతణ్ణి అడిగాడు వైకుంఠాచార్లు యిల్లు గురించి. అతడు ఆలోచించిన విధం తప్పుకాలేదు. ఆ బీడీల కొట్లతడు చెప్పాడు. మూర్తి వైకుంఠాచార్లు యిల్లు కనుక్కోగలిగాడు. ఎర్రటి యిటుకలు అక్కడక్కడ గోడలోంచి వూడే ప్రయత్నంలో ఉన్నాయి. రెండే రెండు గదులు ముందు ఎత్తుగా ఒక అరుగు ఉంది. సత్యన్నారాయణమూర్తి అరుగు వద్ద నిలిచి కాసేపు తటపటాయించాడు. అతడికీ అనుభవం కొత్తగా వుంది. తరువాత గొంతెత్తి గట్టిగా పిలిచాడు. ఎవరో వచ్చి తలుపు తీస్తోంటే అతడికి సంతోషమైంది. కాని తలుపులు తెరుచుకున్న తర్వాత అతడి ముఖం చిన్నబోయింది. ఎవరో ఆడమనిషి కనిపించింది.

"వైకుంఠాచార్లగారి యిల్లు యిదికాదా?" అని అడిగాడు మూర్తి.

ఆమె సమాధానం చెప్పకుండా లోపలికి వెళ్ళిపోయింది.

సత్యన్నారాయణమూర్తి విస్తుపోయినాడు.

కాని మరుక్షణంలోనే పంచె యెగదోపుకుంటూ వైకుంఠాచార్లు ప్రత్యక్షమైనాడు. సత్యన్నారాయణమూర్తికి చెప్పలేని సంతోషం కలిగింది. "చంపేవు పో, నీవు కనపడ వేమోనని దిగులవుతున్నది" అన్నాడు మూర్తి.

"అచ్చం ఆడపిల్లలా మాట్లాడావేమోయ్" అన్నాడు వైకుంఠాచారి తన సహజ హాస్యధోరణిలో. ఎప్పుడైనా అంతే. ఇప్పుడూ అంతే. 'లోపలికి రా' అన్నాడు. సత్యన్నారాయణమూర్తి పరిచయస్తుడివల్లే మొదటి గదిలోకి దూరాడు. ఇందాకటి ఆడమనిషి పరచివున్న పక్కను చుడుతుంటే మూర్తికి సిగ్గులాటి భావం ఆవహించి వాకిట్లోనే నిల్చుండిపోయాడు.

"ఏమేవ్! ఆ పడుపు నేను పడ్చుకుంటాలే గాని నువ్వు పోయి కుంపటి ముట్టించు."

ఆమె వెనక్కు తిరిగి బెదురు చూపులు చూసి రెండో గదిలోకి వెళ్ళిపోయింది. సత్యన్నారాయణమూర్తి భుజం పట్టుకుని అక్కడే చాపమీద కూలబడేశాడు వైకుంఠం. చౌకరకం సెంటువాసన అతడిని చుట్టుముట్టింది. ఇటువంటి సమయంలో వచ్చినందుకు సత్యన్నారాయణమూర్తి యెంతో నొచ్చుకున్నాడు. అయినా ఎందుకో తెలీకపోయినా అతడికి వొకందుకు సంతోషంగానూ వుంది. చౌకరకం వూదొత్తుల వాసన కూడా వస్తోంది. పువ్వుల వాసనా.

"ఇంకో రెవరయినా వచ్చి వుంటే వెళ్ళిపో యిప్పుడు మాట్లాడనని ముఖంమీదే చెప్పిపంపించే వాడిని. నువ్వు కాబట్టి సరిపోయింది."

"ఏం నేనైతే ఎందుకు చెప్పలేదామాట."

"నువు అమ్మాయిలా వుంటావు కాబట్టి. అంటే అట్లా మాట్లాడుతావు కాబట్టి". సత్యన్నారాయణమూర్తికి కోపమూ వచ్చింది, నవ్వూ వచ్చింది.

"ఏమో, యేమీ తోచక చూసిపోదామని వచ్చాను."

"మంచిపని చేశావు."

ప్రెస్ సంగతి మాట్లాడుకొన్నారు కొద్దిసేపు. తర్వాత అసహ్యమైన మాటలలోకి దిగాడు వైకుంఠం. సత్యన్నారాయణమూర్తికి చెప్పలేని దిగులైంది. సిగ్గుగావుంది. ఆ వెనక గదిలోంచి ఆ అమ్మాయి బలవంతాన నవ్వు ఆపుకుంటున్నదని మూర్తికి తెలిసిపోతూవుంది.

వైకుంఠం అలా మాట్లాడకుండావుంటే బావుండునని పిస్తున్నది మూర్తికి. అయినా వైకుంఠం ఆ ధోరణి మానలేదు. పరాచికాలు, హాస్యాలు, మధ్య మధ్య చౌకరకం హాస్యం. పక్కల్లో పొడుస్తున్నాడు. మూర్తికి బాధగావుంది. అయినా వైకుంఠంమీద కోపం రావటంలేదు.

"పెళ్ళి చేసుకో. లేకపోతే యెవరినైనా వుంచుకో".

మూర్తి మనస్సు చివుక్కుమన్నది. వైకుంఠం దగ్గరకు వచ్చినందుకు తననితాను తిట్టుకున్నాడు. బాధతో, నొప్పితో తల పగిలిపోతున్నది.

"తల నొప్పిగావుంది పోయి పడుకుంటాను" అన్నాడు.

"ఇంకాసేపు కూచో. నేను బాధ పడుతున్నాననుకుంటున్నావేమో. అదేమీ లేదులే. టీ కాగుతోంది. తాగి పోదువుగాని."

మూర్తిమనసుకి వెగటైంది.

వైకుంఠం లేచి రెండో గదిలోకి పోయినాడు.

కాసేపు యుగళంగా అసహ్యాకరమైన నవ్వు విని పించింది.

మూర్తికి ముళ్ళమీద కూచ్చున్నట్లనిపించింది.

వైకుంఠం చొక్కా తొడుక్కుని "సిగరెట్లు తెస్తాను కూచుని వుండు" అని వెళ్ళిపోతుంటే సత్యన్నారాయణ మూర్తికి మూర్ఛవచ్చినంత పనయింది. నోటమాటరాలేదు. వైకుంఠం వెళ్ళిపోయాడు. రెండోగదిలో కుంపటి విసురుతున్న చప్పుడు. తన గుండెలో కుంపటి మండుతున్నట్లనిపించింది. ఆ అమ్మాయి యీ గదిలోకి వస్తుందేమో అనిపించింది అత డికి. ఆ ఊహ మనసులో వచ్చినందుకు తిట్టుకున్నాడు. ఊరి కనే మనసు పరిపరివిధాల పోతున్నది. వైకుంఠం యెంతకూ రాడేం అని పదిమార్లు అనుకున్నాడు. వైకుంఠం వెళ్ళి పది నిమిషాలుకూడా కాలేదు. రెండో గదిలో గిన్నె దించిన చప్పుడు, గాజుల గలగల, గ్లాసుల చప్పుళ్ళు. సత్యన్నారాయణ మూర్తి మనసు పీకుతున్నది. వైకుంఠం వచ్చాడు. లోపలికి వెళ్ళి రెండు గ్లాసులలో టీ తెచ్చాడు. చాపమీద మూర్తి కెదురుగా కూచున్నాడు. టీ త్రాగారు. సిగరెట్ కాల్చమని చంపాడు మూర్తిని. మూర్తి సిగరెట్ కాల్చాడు. అయితే ఆ చౌకరకం సిగరెట్ అతడికి పడలేదు. తలకాయంతా గిర్రున తిరిగింది.

ఇక వెళ్ళివస్తాను అని లేచాడు.

బయటకి వచ్చాడు. త్రాగినవాడికిలా కాళ్ళు తిరుగు తున్నాయి. వెంటనే వెనుకగది తలుపులు మూసుకున్నాయి.

సత్యన్నారాయణమూర్తి ఒక్కసారి వెనక్కు తిరిగి చూశాడు. రక్తం వొక్కసారి శరీరంలో జర్రున ప్రసరించి నట్లయింది. వైకుంఠాన్ని గురించిన ఆలోచన వచ్చింది. ఊరి కనే ఉద్రేకపడిపోయినాడు. అసహ్యమైంది. ఆ అసహ్యం లోనే మానవుడి బలహీనతలు అతణ్ణికూడా అంటిపెట్టుకునే వుండటం వలన, వెయ్యి పాడు ఆలోచనలు చుట్టు ముట్టు కున్నాయి.

చలి బాగావుంది. వెన్నెల కురుస్తున్నది.

రోడ్డుమీద కొచ్చాడు. రిక్షా కనిపించలేదు. ముందు కలానే నడచిపోయాడు. వైకుంఠంతో తన పరిచయం గుర్తుకు వచ్చింది. వైకుంఠం ప్రెస్‌లో పదేళ్ళనుంచీ పనిచేస్తున్నాడు. "కృష్ణా ప్రెస్" నగరంలో చాలా ప్రసిద్ధివహించిన ప్రెస్. అసలు ప్రెస్ పెట్టినప్పటినుంచీ వైకుంఠం అందులో పనిచేస్తు న్నాడు. వైకుంఠం లేకపోతే ప్రెస్ యజమానికి క్షణంకూడా తోచదు. అన్నిపనులూ వైకుంఠం నెత్తిన వదిలేసి యజమాని నిశ్చింతగా వుంటాడు. వైకుంఠానికి అన్నిపనులూ తెలుసు. జీతంకూడా వందరూపాయల పైనేవుంది.

మొదటి రోజున పని చూపించమని పోయినప్పుడే వైకుంఠం తనని అపహాస్యం చేశాడు. ఏవేవో ప్రశ్న లడిగాడు. తాను యేం చదువుతున్నదీ చెప్పినతర్వాత వొక్కసారిగా అభిమానం పుట్టినవాడిలా యెన్నెన్నో అడిగాడు. అప్పటినుంచీ బాగా పరిచయమైంది. వైకుంఠం మంచివాడే. కాని అతడి

సాన్నిహిత్యం యెక్కువసేపు భరించలేం. ఏమాత్రం హృదయ కాలుష్యం లేనివాడు. అతితీపి యెలాగైతే భరించరానిదిగా వుంటుందో, అతడి అతి మంచిదనంకూడా మంచివాళ్ళకు భరించలేనిదిగానే వుంటుంది. యువతీమండలి హాలుదాకా నడచి వచ్చాడు మూర్తి. రిక్షా యిక అవసరంలేదని వొక పక్కన అనుకుంటూనే రిక్షా కనపడితే ఆపి అడిగాడు. వాడు రెండణాలకు రావటానికి వొప్పుకున్నాడు.

మూర్తి రూము చేరుకునేసరికి పదకొండు గంటలు కావస్తున్నది. వెంటనే పక్క పరచుకొని పడుకున్నాడు మూర్తి. అతడికి నిద్ర రావటంలేదు. పొద్దుటినుంచి జరిగిన విషయాలు వొక్కొక్కటే మనసులో తిరుగుతున్నాయి. వసుధ గుర్తుకు వచ్చింది. వసుధ చిన్న తమ్ముడిని గురించి ఆలోచించాడు. వైకుంఠం గురించి ఆలోచించాడు. వెగటయింది. మనసులో ఏమిటో చెప్పలేని అశాంతి రేగింది. గట్టిగా కళ్లు మూసు కున్నాడు.

తండ్రి గుర్తు వచ్చాడు. దేవుణ్ణి అనుకుందా మను కున్నాడు. కాని దేముడిమీద అతడికి నమ్మకం లేదు. వది లేశాడు. లైటు వెలిగించి 'నిజమైన మానవుడు' చదువుదామని తీశాడు. కాని సాగలేదు. మళ్ళీ పడుకున్నాడు. వైకుంఠం, వైకుంఠం పెళ్ళాం గుర్తుకొస్తున్నారు. మనసుకి అశాంతి. వసుధను తలచుకుంటే దుఃఖం. దుఃఖం. అశాంతి – అసంతృప్తి – వేదన.

నిద్రలో కల.

తాను పరంధామయ్యగారింటికి వెళ్ళాడు. వసుధ కొత్త చీర కట్టుకుని తల్లో పువ్వులు పెట్టుకుని, చిరునవ్వు నవ్వుతోంది...ఇంతలోనే తల మాసిపోయి, పాతచీర కట్టుకుని దోసిలిలో ముఖం కప్పుకుని యేడుస్తున్నది. పరంధామయ్యగారు ఉత్తరీయం ముఖాన గప్పుకుని నిశ్శబ్దంగా వొక మూల కూచుని వున్నాడు. పెద్ద పిల్లవాడు వొక మూల కూచుని బిక్కు బిక్కుమంటూ చూస్తున్నాడు.

వసుధ వాళ్ళమ్మ కటిక నేలమీద అచేతనంగా పడి వుంది.

తాను అక్కడ నిలుచోలేక గిరుక్కున తిరిగి వచ్చెసెయ్యబోయాడు.

వసుధ తనని పిలిచింది.

తాను వెనక్కు తిరిగి చూశాడు.

వసుధ తనవేపే చూస్తున్నది.

వసుధ వద్దకు వెళ్ళాడు.

మళ్ళీ దోసిట్లో ముఖం కప్పుకుని యేడుస్తున్నది.

తాను యీ సారి వసుధ పిలుస్తున్నా వినకుండా కోడ్డు మీదకు వచ్చాడు. తనని తాను తిట్టుకున్నాడు. ఇంత కఠుకుతనం తనలో యెలా వచ్చిందా అని ఆశ్చర్యపోయినాడు.

తరువాత ఇంకో కల.

కాలేజీలో ప్రొఫెసరుగారు తన నేదో ప్రశ్న అడిగారు. తను చెప్పలేదు. అందరూ తనని చిన్నచూపు చూశారు. అక్కయ్య కార్లో వెళుతున్నది.

'అక్కయ్యా' అని గట్టిగా పిలిచాడు తాను.

కారు ఆగింది. ఎంతో ఆశతో తాను దగ్గరకు పోయినాడు. తనని చూసి ముఖం ముడుచుకుంది. ఎంతో నిర్లక్ష్యంతో 'కారు పోనీయ్' అని డ్రైవరును హెచ్చరించింది. కారు కదలిపోయింది. తనకు యెవరూ లేరు.

ఇలానే కలలు. ఒకటికాదు; రెండుకాదు.

అర్థంపర్థం లేనివి. భయపెట్టినవి. బాధ పెట్టినవి.

ప్రొద్దున నిద్ర మెళుకువ వచ్చేసరికి జ్వరం వచ్చినట్లనిపించింది. కళ్ళు మండిపోయినాయి. ఒళ్ళంతా నొప్పులు నొప్పులు. అలానే బద్ధకంగా లేచి వొళ్ళు విరుచుకున్నాడు. ముఖం కడుక్కున్నాడు. కాఫీ త్రాగాడు. మామూలు జీవితంలోకి నడిచిపోయినాడు, మామూలు ప్రతిరోజులానే మామూలుగా.

# 9

నాలుగు రోజులు గడచిన తర్వాత వొక సాయం కాలం సత్యన్నారాయణమూర్తి పరంధామయ్యగారింటికి వెళదామని బయలుదేరాడు. ఈ నాలుగు రోజులనుంచీ అతని వొంట్లో బావుండటంలేదు. కాలేజీకి కూడా వెళ్ళలేదు. రోజు మొత్తం మీద నాలుగు గంటలుమటుకు ప్రెస్ పని చూసుకుంటుండేవాడు. వైకుంఠాచార్యులు రోజూ అడుగుతున్నాడు. ఏమిటలా వుంటున్నావు? ఏమిటలా వుంటున్నావు? అని. మూర్తి అతడికేమీ సమాధానం చెప్పటంలేదు. ఒంట్లో బావుండటంలేదు అని మాత్రమే చెప్పాడు.

"నేను చెప్పినట్లు వింటే ఒంట్లోను బావుంటుంది! మనసుకీ బావుంటుంది. వింటావా?" అన్నాడు వైకుంఠాచార్లు నవ్వుతూ.

అతడు చెప్పబోయే దేమిటో మూర్తికి తెలుసు. అవతల వ్యక్తికి ఎప్పుడూ హాస్యమే. ఒక్క క్షణమైనా స్థిరంగా ఆలోచిస్తాడో లేదో, నేను చచ్చిపోతున్నానో అంటే సరే పోయి ఉత్తరం రాయమనో, అక్కడ మంచివాళ్ళుంటే తెలియ చెయ్యమనో ఈరకంగా మాట్లాడుతాడు. మరీ రెండు రోజుల నుంచి వైకుంఠాచార్లు కనపడకుండావుంటే బావుండును అని

పిస్తోంది మూర్తికి. తప్పుకుని తప్పుకుని తిరుగుతున్నాడు. ఈ విషయం కనిపెట్టినవాడిలాగా వైకుంఠాచార్లు పదేపదే మూర్తి దగ్గరకు వస్తున్నాడు. మూర్తి ఎందుకో దిగులుగా వుంటున్నాడు. ఆ దిగులు పోగొడదామని వైకుంఠాచార్లు తాపత్రయం. అందుకే చమత్కారమని తాననుకున్న విధంగా మాట్లాడనూ, అప్పుడప్పుడు కాఫీ తెప్పించనూ లాంటివి చేస్తున్నాడు.

ఒకసారి అతడివెంట రూముకుకూడా వచ్చి చూసిపోయినాడు. అయినా మూర్తి కడుపునిండా నవ్వినయినా నవ్వటంలేదు. ఒకరోజున మాత్రం సీరియస్‌గా పోజుపెట్టి "ఏమిటీ నీ బాధ" అని అడిగాడు. సత్యన్నారాయణమూర్తికి ప్రాణం లేచివచ్చినట్లయింది. ఎలా చెబుదామా అనుకున్నాడు. సరిగ్గా మొదలుపెట్టాడో లేదో "అదుగో అలా యేడుపు మొహం పెట్టవద్దు. ఏడుపు మొహం పెట్టేవాళ్ళను చూస్తే నా కసహ్యం. అమ్మా! ఇలా మొహం పెట్టవద్దు. వెనక ఏడవటం ఒక్క ఆడవాళ్ళ వంతుగానే వుండేది. కాని యిప్పుడు వాళ్ళుకూడా పోగొట్టుకున్నారు, నుక్కెందు కేడవాలి?"

సత్యన్నారాయణమూర్తికి నిజంగా ఏడుపొచ్చింది.

ఇక మాట్లాడటం మానేశాడు.

"సాయంకాలం నాతో రా! నీకు మంచి విశేషాలు చూపిస్తాను. అటునుంచి లిబర్టీకి పోదాం. మంచి పిక్చరు. బ్రహ్మాండమైన లవ్ సస్పెన్సు!" గుప్పిళ్లు బిగించి అభినయం చేశాడు వైకుంఠాచారి. "సరేనులే" అన్నాడు మూర్తి. అతణ్ణి వదుల్చుకునే వుద్దేశ్యంతో.

"అలా దారికిరా. నువు good boy వి. నిన్నింకా మరీ good boy గా తయారు చేస్తాను. నీ జన్మకు మరచిపోవు వైకుంఠాన్ని. నేనూ నీకంటే కష్టాలు పడ్డవాణ్ణేను లేవోయ్, నా కష్టాలు వింటేనే చాలు నువ్వు గుండెపగిలి చస్తావు. కూడులేని రోజునా యేడవలేదు. సత్కారం చేసిన రోజునా యేడవలేదు. సత్కారమంటే యేమిటనుకున్నావు. తిట్లు, చీవాట్లు, చెప్పుదెబ్బలూ. ఎందుకంటావా – లవ్ ఎఫెయిర్ లే. బ్యూటిఫుల్ లవ్ ఎఫెయిర్. సినిమాల్లో కథానాయకుడికిమల్లె గోడదూకాను. బస్, పట్టుకున్నారు. సత్కారం జరిగింది. ఏమిటో పాడు; యీ కోరికలు మనుష్యులని నాశనం చేస్తాయి. పోనీలే తీరికగా వున్న రోజున చెపుతాను ఆ విశేషాలు. సాయంకాలం మాత్రం తప్పక కనబడు. నిన్ను వొకచోటికి తీసుకొనిపోతాను."

సత్యన్నారాయణమూర్తికి భయమైంది. అతణ్ణి యెలా వదుల్చుకోవాలో తోచలేదు. 'సరేలే' అని ఆతణ్ణి పంపించి వేశాడు.

ఆ మధ్యాహ్నం అసలు ప్రెస్‌కే పోలేదు. వైకుంఠాచార్లు రూముకి వస్తాడనీ తెలుసు. అందుకని రామారావు రూముకు వెళ్ళాడు నడుచుకుంటూ. సరిగా ఐదుగంటలకల్లా వెళ్ళాడు. ఐదున్నరయినా రామారావు రాలేదు. అతడి మనసు కంతా ఆందోళనగా వుంది. ఏమీ తోచలేదు. రేపు వైకుంఠాచార్లు కనపడితే యేమంటాడో అనికూడా భయంగా వుంది. అతడి కెలా సమాధానం చెప్పాలా అని చాలాసేపు

ఆలోచించుకున్నాడు. కాసేపు పబ్లిక్ గార్డెన్స్‌లో తిరుగుతూ గడిపాడు.

సరిగా ఆరుగంటల ప్రాంతంలో రిక్షాయెక్కి పరంధామయ్యగారింటికని బయలుదేరాడు.

పరంధామయ్యగారింట్లో అడుగు పెట్టగానే అక్కడి నిశ్శబ్దం అతణ్ణి అమితంగా భయపెట్టింది.

తనకు కలలో కన్పించిన దృశ్యాలు అన్నీ వొక్కటొక్కటే కనులముందు కన్పించసాగినయ్. అతణ్ణి పలకరించిన వాళ్ళు యెవరూ లేకపోయారు. ఈ యింట్లో ఏమి ఆపత్తు వచ్చింది? ఎందుకింత నిశ్శబ్దంగా వున్నారు? అని ఆలోచించుకున్నాడతను.

పరంధామయ్యగారు వొకపక్కన యోగసిద్ధి పొందినవాడిలా మాటా పలుకూ లేకుండా కూర్చుని వున్నారు. ఆయన తలయెత్తటానికి సాహసించటంలేదు. ఇల్లాలు కటిక నేలమీద గోడవారగా తిరిగి పడుకునివుంది మూర్తిగొన్న శోకదేవతలా.

వసుధ కన్పించలేదు.

శివుడు అమ్మ కాళ్ళవద్ద కూచునివున్నాడు.

పది క్షణాలు గడచిన తర్వాత పరంధామయ్యగారు దగ్గరగా వచ్చి, కూచోమని సైగ చేశారు. మూర్తి యెంతో దిగులుతో, భయంతో వెళ్ళి దగ్గర కూచున్నాడు. కూచున్న తరువాతనైనా యేమిటి జరిగిందో ఆయన చెప్పలేదు.

తరువాత మెల్లిగా చిన్నపిల్లవాడు నిన్నప్రొద్దుట పోయాడు అని చెప్పినప్పుడు, సత్యన్నారాయణమూర్తికి తనకు

తెలీకుండానే ఎందుకో భయం కలిగింది. ఏమిటో విపరీత దృశ్యం చూచిన వాడిలా విచలితుడైనాడు. ఏం మాట్లాడాలి? ఏం చేయాలి ? ఏం ఆలోచించాలి ? అతడికి తోచలేదు.

అతడి కళ్ళముందు ఆ చిన్న పిల్లవాడి రూపం స్పష్టాతి స్పష్టంగా కన్పించసాగింది. అదే చిన్నకుండ బోర్లించినట్లుగా వుండే కడుపు, పుల్లలవంటి కాళ్ళూ, చేతులూ, చింపిరిజుట్టూ, చిరిగిపోయిన చొక్కా, ఆకర్షించేకళ్ళూ, నేలమీద జరగటానికి కూడా ఆ కుర్రాడుచేసే ప్రయత్నమూ - అన్నీ కనులముందు కనపడసాగినయ్.

ఎంత చిన్నమాటలో చెప్పారు పరంధామయ్యగారు, ఇవన్నీ ఇకముందు కన్పించవు అనే భావాన్ని !

ఏముంది యీ జీవితం.

దీనికి అర్థమేమిటి ?

ఇన్ని వేల యుగాలుగా మృత్యువు అర్థం గాకుండానూ వుంది.

దరిద్రం, ఆకలి, మృత్యువు, బలహీనతలు, నీచభావనలు మనిషి పుట్టినప్పటినుంచీ పెరుగుతూనే వున్నవి.

ఈ సమయంలో యెలా మాట్లాడాలో మూర్తికి తోచ లేదు.

ఆయన్ను యెలా వోదార్చాలి ?

పరంధామయ్యగారు అన్నారు. "వాడు పోయినందుకు కాదు దిగులు; వాణ్ణి పోగొట్టుకున్నందుకు."

మూర్తికి అర్థం కావటంలేదు.

"నే నూళ్ళో లేను. నేను కానీ సంపాదించ లేను. అయినా, అక్కడా ఇక్కడా తిరుగుతూ వుంటాను. వసుధ ముఖం చూడటానికికూడా నాకు ప్రాణాంతకంగా వుంటున్నది. నేను ఊళ్ళో లేనా? పాపం పసిపిల్ల. దానికేం తెలుసు. డాక్టర్ల దగ్గరకు తిరిగింది. మెడికల్ షాపులదగ్గరకు పోయింది. వాణ్ణి బ్రతికించుకోవాలని నానా అవస్థాపడింది. చివరకు నాకు టెలిగ్రాం యిచ్చిన తర్వాత నేను వచ్చాను. అప్పటి నుంచీ దానిముఖం చూడాలంటే నాకు భయమైపోతున్నది. ఇంతకూ ఇలా యెందుకు జరిగిందీ అన్నదానికి యెవరు సమాధానం చెప్పతారు. ఆ ఇంట్లో వుంది వసుధ. నెళ్ళేముందు వోసారి కనిపించి యేవన్నా వోదార్పుమాటలు నాలుగు చెప్పిపో దానికి"అన్నారు పరంధామయ్యగారు.

సత్యన్నారాయణమూర్తికి మరీ దిగులు పట్టుకుంది.

వసుధకు యెలా వోదార్పు మాటలు చెప్పాలో అతడికి తోచలేదు. నాలుగు నిమిషాలు అలాగే మౌనంగా కూచుండి పోయాడు. తరువాత తిన్నగా హాల్లో అడుగు పెట్టేస తర్వాత, అతడికి వోక మూల కూచుని దోసిట ముఖం కప్పుకున్న వసుధ కన్పించింది. తాను వచ్చానన్న సంగతి యెలా తెలియ చెయ్యాలోకూడా తోచలేదు మూర్తికి. అలానే నిలుచుండి పోయాడు విగ్రహంలాగా. వసుధ అతడివేపు చూసింది. లేచి నిలుచుంది.

'ఇప్పుడే వస్తాను' వుండండి, అని వేదనా భరితమైన స్వరంతో చెప్పింది. వంట ఇంట్లోకి నెళ్ళింది.

మూర్తికి గడుస్తున్న ప్రతిక్షణమూ బాధాకరంగానే వుంటున్నది. కొద్దిసేపటి తర్వాత వసుధ వచ్చి అతడి దగ్గరగా నిలుచుంది.

ఆమె ముఖం కడుక్కుని వచ్చిన సూచనలు కనపడు తున్నా, దుఃఖం యావత్తూ ఆమె ముఖంలోనే తాండవిస్తూ వున్నందువల్ల ఆమె వదనం మలినంగానే వుంది.

వసుధ అన్నది. "నాకు పిచ్చెత్తిపోతున్నది. నేను మీతో వస్తాను. కాసేపు నన్నెక్కడన్నా తిప్పి తీసుకురండి."

సత్యన్నారాయణమూర్తికి కాళ్ళు తేలిపోయినయ్.

వసుధేనా ఇలా మాట్లాడుతున్నది – అని ఆమెవేపు యెగాదిగా విహ్వాలంగా చూశాడు.

"అవును. ఈ ఇంటిలో వున్నంతసేపూ నా చుట్టూ పెద్దపెద్ద సాలీళ్ళు గూళ్ళు కడుతున్నట్లు అనిపిస్తుంది. ఒక్క నిమిషం సేపైనా మనసున ఏ ఆలోచనా పెట్టుకోకూడదను కున్నా వీలుపడకుండా వుంది. నాకు ఏ విషయాలూ తెలీవు. ఎవరిమీదనో కసితీర్చుకోవాలనివుంది. ఇన్ని మాట్లాడటం కూడా బాధగానే వుంది. నేనేం చెప్పలేను. నన్నెందు కేడి పిస్తారు. చప్పున నో రిక్షా పిలవండి."

వసుధకు మనస్సు చెడిపోయింది. పిచ్చి పట్టింది. ఇది ప్రాథమికావస్థ. ఇప్పుడు తానేం చెయ్యాలి? అనుకున్నాడు మూర్తి.

వసుధ ముందు నడిచింది. వాకిటదగ్గర నిలుచుకుని వెనక్కు తిరిగి "మీరు రారా అయితే" అన్నది.

సత్యన్నారాయణమూర్తి దగ్గరకు వెళ్ళి నిలుచున్నాడు.

"మీ మనసు చాలా చెడిపోయింది. మీరు యేం మాట్లాడుతున్నారో, యేం చేస్తున్నారో మీకు తెలియటం లేదు" అన్నాడు అనుత్తప్త స్వరాన.

"నాకు తెలియవలసిన దేమీ లేదు."

"కష్టాలు వచ్చినప్పుడు మనస్సును చిక్కబట్టుకోవాలి. మరి యేం చేస్తాం. మీకు చెప్తూతున్నాను. ఒక్కొక్కసారి నాకు ఆత్మహత్య చేసుకోవాలనిపిస్తుంటూంది. అయినా ఒక్కొక్కసారి చెప్ప లేని ఆశకూడా కలుగుతుంటుంది. రోజులు గడిచిపోయినయ్. రోజులు గడిచిపోతున్నాయి. ఇకముందు గడచిపోతాయి. నిన్నను ఇవాళ మరచిపోయినట్లే ఇవాళను రేపు మరిచిపోతాం."

"నాకు చెప్పవలసిన దేమీ లేదు" అన్నది వసుధ.

"అవును మీకు అన్నీ తెలుసు."

"నా కేమీ తెలియదు".

"ఇంట్లోకి రండి. మీ మనసు కుదుటబడ్డ తరువాత నేను వెళ్ళిపోతాను."

"నేను రాలేననిపిస్తున్నది. మీరూ రండి. కాసేపు అలా తిరిగి వద్దాం. ఒక వేళ నాకు మళ్ళీ వచ్చేందుకు బుద్ధి పుట్టకపోతే ఆ సంగతి మీరొచ్చి వీళ్ళకు చెప్పవచ్చును."

సత్యన్నారాయణమూర్తికి నిజంగా భయమైంది.

"ఎక్కడికి వెళ్ళాలని?"

"నాకు తెలుసునా. అలా ఊరంతా వోసారి తిరిగి వస్తాను. అయినా ఇలా మీతో మాట్లాడుతూ కూచోవటం నాకు చేతకావటం లేదు."

సత్యనారాయణమూర్తి వాకిలిదాటి వీధిలోకివచ్చాడు.

"ఇంట్లో చెప్పండి మరి" అన్నాడు.

వసుధ మాట్లాడలేదు.

అతడు పరంధామయ్యగారి వేపు చూస్తే ఆయన తన వేపే చూస్తున్నాడు.

వసుధ ముందుకు నడిచింది.

అతడు వెనకనే నడిచాడు.

కొంతదూరం వెళ్ళిన తర్వాత రిక్షా వొకటి వీళ్ళను చూసి ఆగింది. వసుధ మాటాడకుండా యెక్కి కూచుంది. మూర్తివేపుచూసి ఎక్కమన్న భావం సూచించింది; అతడికేమిటో తొట్రుపాటు కలిగింది. అతి జాగ్రత్తగా వొక పక్కన వొదిగి కూచున్నాడు. రిక్షావాడు యెక్కడికని అడిగాడు.

అతడు పలకలేదు.

ఆమె చెప్పింది. పబ్లిక్ గార్డెన్సుకు పోనియ్యమని.

సత్యన్నారాయణమూర్తికి యెంతో సిగ్గుగానూ, బాధగానూ వుంది వసుధనుచూస్తుంటే. వసుధమాత్రం నిర్లిప్తంగా వుండి పోయింది. రిక్షా ఊపులలో అతడు ఆమె స్పర్శను ప్రత్యణువునా తెలుసుకో గలుగుతున్నాడు. కాని ఆమెకు ఆతడు 'అతడన్న' విషయంకూడ తెలియటంలేదు.

ఆమెలో యెలాంటి ప్రకృతి భావమూ లేదు. ఆ సమయంలో, దుఃఖానికి ఆ మాత్రం శక్తి వుంది.

అతడి చెయ్యి యాచించింది ఆమె రిక్షా దిగేప్పుడు. అతడి కామెతో నడుస్తున్న పదపదమునా ద్వంద్వ ప్రకృతుల మధ్య వూగిస లాడుతున్నట్లు తోచింది.

ఆమె నిర్లిప్తతతో నడుస్తుంటే, యెవరైనా తనను చూస్తున్నారేమోనని తొట్రుపడుతూ దిక్కులు చూస్తూ నడుస్తున్నాడతను. ఆమె తన పక్క పక్కన నడుస్తుంటే, తనకు తెలిసినవాళ్ళు యెవరూ కనపడకుండా వుంటే బావుండును అనిపిస్తున్న దతడికి. ఇవాళ యిలా జరిగిందేమిటి? వసుధ యేమైపోతున్నది. తనను యెవరైనా చూస్తే వాళ్ళు యెలా వూహించుకుంటారు అని ఆలోచిస్తున్నాడతను.

రంగు రంగుల పువ్వుల కేసి, చిన్న చిన్న పిల్లల కేసీ, ఆడవాళ్ళ కేసీ, మగవాళ్ళ కేసీ అమాయకంగా చూస్తూ నడుస్తున్న దామె. ఆమె కేమీ తెలియటం లేదు; ఆనందమూ లేదు, అటువంటి దృశ్యాలను చూస్తున్నప్పుడు. మనసు విచారపడటమూ మానేసింది ఇల్లు బయలుదేరినప్పటినుంచీ.

నిశ్చలంగా, నిర్మలంగా, తెల్ల కాగితంలా వుండిపోయింది ఆమె మనసు.

ఒక చోటినుంచి వొక చోటికి తిరిగారు. వచ్చిన చోటికే మళ్ళీ వచ్చారు. అతడికి తెలుస్తూవుంది. ఆమెకు తెలియటం లేదు. కేవలం అచేతనమైన విగ్రహంలా నడుస్తున్న దామె.

అతడు భయపడుతున్నంత పనీ జరిగింది.

ఎదురుగా ఒక స్నేహితుడు వచ్చి పలకరించాడు. అతడు తన క్లాసు చదువుతున్నాడన్న మాటేకాని అతడితో విశేషించి పరిచయమేమీ లేదు మూర్తికి. కాని ఆ స్నేహితుడు వచ్చి పలకరించటంలో ఒక విశేషం వుంది. ఎంతో ఆప్యాయంగా వచ్చి పలకరించాడు. మూర్తి సిగ్గుతో కృంగిపోయాడు. ఆ స్నేహితుడు అర్థమైందిలే అన్నట్లుగా చూసి, నవ్విపోయాడు. అతడు తనను అలా చూసి, అలా నవ్వినందుకు మూర్తికి యెంతైనా సిగ్గయింది. వసుధమాత్రం యీ విషయం పట్టించుకోలేదు.

చీకటి పడింది.

రంగురంగుల లైట్లు వెలిగాయి.

లైట్ల కాంతులలో పూలు రంగురంగులుగా మెరిసిపోతున్నాయి.

హెల్త్ మ్యూజియంలోకి దారితీశారు. జీవితాన్ని ఎక్సరేలో చూసినట్లైంది. వసుధ ఐదు నిముషాలుకూడా వుండలేకపోయింది అక్కడ. ఆమెకు యెందుకో భయమైంది. అక్కడ భయంకరమైన వ్యాధులు, అవి యెలా సంక్రమించేదీ, వాటి వివిధదశలు గురించిన బొమ్మలు, పటాలూ వున్నాయి. వసుధ అందుకే అక్కడ నిలబడలేకపోయింది. ఆమెకు ఏడుపొచ్చింది. అతడి చేతిని లాగి అక్కడినుంచి వచ్చేట్లు చేసింది. పెద్ద మైదానంలో అక్కడక్కడ ఇద్దరు, ముగ్గురు, నలుగురు కూచుని, కృత్రిమమైన ప్రశాంతతను అనుభవిస్తున్నారు. నాగరికత మనస్సుకింత శాంతిని ఇటువంటిచోట్ల మాత్రమే ఇవ్వగలదు.

వాళ్ళుకూడా ఒక పెద్ద పచ్చిక మైదానములో కూచు న్నారు.

మూర్తికి ఇష్టంలేదు అలా కూచోటం. ఇందాకటి నుంచీ ఆ స్నేహితుడు తనని గురించి యేమి ఆలోచించుకుంటు న్నాడా అని ఆలోచిస్తున్నాడు మూర్తి.

హెల్త్ మ్యూజియంనుండి రికార్డులు వినబడుతున్నాయి.

ఎటుచూసినా రంగురంగుల లైట్లు.

మనుష్యులు ఆనందంగా నడుస్తున్నారు.

వాళ్ళు అక్కడనుంచి ముందుకు నడిచారు.

రంగురంగుల లైట్లు కాంతి పూసుకుని, ఒక్కొక్కసారి ఒక్కొక్క రంగుగా నీళ్ళు పైకి లేస్తున్నాయి. అక్కడ కాసేపు చిన్నపిల్లలవలె నిలుచుని చూశారు.

అక్కడనుంచి ఇంకో చోటికి వెళ్ళారు.

మధ్యదారిలో నడుస్తుంటే వొక చిన్నపిల్లవాడు కని పించాడు.

వసుధ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

అతను చూడనేలేదు.

అతడికి తెలీనేలేదు.

బయట గేటుదాకా నడచివచ్చేసరికి రిక్షావాళ్ళిద్దరు, ముగ్గురు చుట్టుముట్టారు.

"మనం సినిమాకు వెళదాము" అన్నది వసుధ.

"వద్దు" అన్నాడతడు. "మొదలుపెట్టి వుంటారు!"

"నే నొక్కదాన్నే వెళతాను. నేను సినిమా చూడాలని పోవటంలేదు. సంతోషంగా బ్రతుకుతున్న మనుషులని చూదామని."

"నేనూ వస్తాను"

రిక్షాయెక్కి కూచున్నారు.

లిబర్టీ టాకీస్ వేపు రిక్షా పరుగెత్తింది.

సినిమా మొదలుపెట్టారు.

వెళ్ళి మౌనంగా కూచున్నారు.

పదినిముషాల్లోనే మూర్తి వుత్సాహకరంగా మారిపోయాడు.

అరగంటన్నా కాకముందే వసుధ 'వెళ్ళిపోదాం' అన్నది.

మూర్తికి విసుగైంది.

తెరమీద చిన్నపిల్లవాడి కెవడికో జబ్బుచేసింది.

వాడి తండ్రి డాక్టరుని బతిమాలుకుంటున్నాడు.

తల్లి వాణ్ణి గుండెల కదుముకొని యేడుస్తోంది.

వసుధ లేచింది. అతడూ వెనకనే లేవాల్సివచ్చింది.

మళ్ళీ రిక్షాలో కూచున్నారు.

ఉస్మాన్‌పురాలో యిల్లు చేరుకునేసరికి ఎనిమిదిన్నరైంది.

అతడు లోపలికైనా పోలేదు.

వసుధ లోపలికి వెళ్ళిపోగానే అదే రిక్షాను చెప్పల్ బజార్ పోనీమన్నా డతడు.

చెప్పల్ బజారులోని అతడి రూము చేరుకునేసరికి తొమ్మిది గంటలైంది. చెక్కల మెట్లుయెక్కి పైకి వెళ్ళగానే సత్య

న్నారాయణమూర్తి కొయ్యబారిపోయాడు. బజారు లైటు వెలుతురు అక్కడికి కొద్దిగా ప్రసరిస్తోంది. పక్క గదిలో వెలుగుతున్న లైటు వెలుతురు కూడా కొద్దిగా పడుతున్నది. సత్యన్నారాయణమూర్తికి వొక్కసారిగా కాళ్లు వణికినై. అతడు తీయబోయే తలుపు దగ్గర గడప దగ్గర వైకుంఠాచార్లు కూచుని వున్నాడు. సత్యన్నారాయణమూర్తి గది తలుపుతీసి లైటు వెలిగించాడు. వైకుంఠం లోపలకు వచ్చాడు. సత్యన్నారాయణమూర్తి వైకుంఠం వేపు చూశాడు భయంగా.

వైకుంఠం కళ్లు ఎఱ్ఱగా వున్నాయి.

"సాయంకాలం యెక్కడకు పోయినావు నేను వుండమంటేను" అన్నాడు వైకుంఠం.

సత్యన్నారాయణమూర్తి తడబడ్డాడు. ఈ కథంతా చెపుదామా వద్దా అని అతడి మనస్సు తొట్రుపడ్డది. చెప్పుకోవాలని మనస్సు తహ తహ. చెప్పుకునేందుకు అసహ్యాం. భయం. సిగ్గు.

"నీ కోసం రెండు గంటలనుంచీ ఇంతే. వైకుంఠం అంటే యేమనుకున్నావో. ఇప్పటికయినా అర్థం చేసుకో. రేపు సాయంకాలం యెక్కడకూ పోవద్దు." వైకుంఠం చెక్కమెట్లు వూపుతూ దిగిపోయాడు.

సత్యన్నారాయణమూర్తికి కళ్ళు మంటలు పుడుతున్నాయి. ఒళ్ళంతా నొప్పులుగా వుంది. తల తిరుగుతున్నట్లనిపించింది.

నేలమీద ఓరాడుతూ వొక కవరు కన్పించింది పొడుగాటిది. పక్క పరచుకొని పడుకుని విప్పి చూసుకున్నాడు.

అన్నయ్య మేదో ఉద్యోగానికి ఎప్లై చేసేందుకు ఫారం పంపించాడు. పాతిక రూపాయలదాకా ఫీజు కట్టాలి. విసిరి అవతల వేశాడు. లైటు తీసేశాడు. పొద్దున లేచినప్పటినుంచీ జరిగిన దొక్కొక్క సంగతీ పునశ్చరణ చేసుకున్నాడు.

నిద్రపోయే ముందుకూడా అతడి కళ్ళల్లో వసుధే నిండి వుంది. అలానే మళ్ళీ నిద్ర లేచేప్పుడుకూడా అతడి కళ్ళల్లో వసుధే కన్పించింది.

వసుధ మాత్రం అవాళ రాత్రి నిర్వికారంగా నిద్ర పోయింది. ప్రొద్దున్నే లేచి నిన్న జరిగిన విషయాలు గుర్తుకు రాగానే ఒక్కసారిగా ఆశ్చర్యపోయింది.

జరిగిపోయినదంతా ఆమెకు కలవలె తోచసాగింది.

# 10

"మానవుడి అంతశ్శక్తులు మూడుగా గ్రహించాలి. ఒకటి హృదయము. రెండు బుద్ధి. మూడు మనస్సు. ఏం వింటున్నావా? అన్నిటికంటే బలమైనదీ వొక్కొక్కప్పుడు బలహీనమైనదికూడా యేదంటే హృదయమే. మనం ఒక పనిని చేయాలన్నప్పుడు, లేక ఒక గొప్పవిషయాన్ని గూర్చి ఆలోచించేటప్పుడు యీ మూడింట్లో రెండుఒకటై మూడవ దాన్ని అణగతొక్కుతుంటాయి. బుద్ధి కేవలం వేడుక దృష్టి కలది. లోకమందలి మంచి చెడ్డలను గురించి బుద్ధి తటస్థంగా వుంటుంది. అంటే మహా కుత్సితమైన గుణం కలదన్నమాట. లోక మంతా ఒక విషయాన్ని మంచి అంటే అది కాక పోయినా బుద్ధి వొప్పుకు తీరుతుంది. దానికి యితర విషయాలతో పనేమీ వుండదు. ఒక పెద్దమనిషి దగ్గర మనం అతడి కిష్టంకాని దేదైనా చెప్పదలచుకున్నప్పుడు అవతలవాడు నీకు బుద్ధి లేదనో; బుద్ధివుండి మాట్లాడుతున్నావా అనో అంటాడు. లేక ఆంతర్యంలోనైనా అనుకుంటాడు. లోకం వొప్పుకున్నది, బుద్ధి వొప్పుకుంటుంది. లోకం నిర్ణయించింది బుద్ధి విమర్శిస్తుంది. ఇక మనస్సు అటువంటిదికాదు. మనస్సుకి ఆలోచన అనే గుణం వుంటుంది. అది మనిషి పెరిగిన

పరిస్థితుల నాధారం చేసుకుని మానవుడిని శాసిస్తుంది. కొందరిలో మనస్సు యెదగదు. మనస్సు యెదగనప్పుడు హృదయం అసలు వుండదన్నమాట. మనుషుల్లో హృదయం లేనివాళ్ళు చాలామంది వుంటారు. మనస్సు పనిచెయ్యని వాళ్ళూ చాలామంది వుంటారు. కాని బుద్ధిలేనివాడు యెవడూ వుండడు. వుండకు. ఇదంతా యెందుకు. నా విషయంలో ఏం జరిగిందో చెప్తాను. మనుషు లందరికంటే విభిన్నంగా జరిగింది. మామూలుగా నేను చెప్పానుగా. మానవుడి అంతశ్శక్తులలో రెండుకలసి మూడవదానిని అణగ దొక్కుతాయని, నా విషయంలో అందుకు కేవలం విరుద్ధంగా జరిగింది. రెండు కలసి ఒకదానిముందు నోడిపోయాయి. హృదయం తక్కిన రెండింటినీ జయించింది. అందువలన నేను ఇలాటి పనిచేశాను. హృదయంగల యేమనిషీ నేను చేసింది తప్పనీ అనలేదు. విన్నావా? నీకు హృదయంలేదు. మనసు ఆలోచించే శక్తిని కోల్పోయింది. బుద్ధిమాత్రం పుష్కలంగా వుంది. నువ్వొట్టి బుద్ధిమంతుడివి!"

సత్యన్నారాయణమూర్తి వింటూ విస్తుపోయాడు.

తాను చెప్పదలచుకున్న విషయాలు కూడా మరచి పోయాడు. ఏం చెప్పిందీ అతడికి గుర్తులేదు.

ఎందుకొచ్చిందీ అతడికి తెలిసీ తెలియనట్లుగా వుంది. ఆమె చెప్పింది నిజం. మనస్సు ఆలోచించే శక్తిని మాత్రం కోల్పోయింది. అక్కయ్య యింత తెలివిగలదని అతడిదివరలో అనుకోలేదు. అతడు అక్కయ్యవద్దకు ఎంతో సందేహం తోనే వచ్చాడు. కాని విధిలేకనే వచ్చాడు.

ఆమె యేమో చెప్పింది.

ఆ యింటియొక్క కళగాని వైభవంగానీ అతడిని ఏ మాత్రమూ ఆకర్షించలేకపోయినై. వచ్చిన గంటసేపటినుంచీ అచేతనంగా కూర్చుండి పోయాడు. గంట తరువాత ఆమె వచ్చింది. అతడు చెప్పదలచుకున్నది మూడు మాటలలో ముగించాడు.

ఆమెమాత్రం ఏమిటేమిటో చెప్పసాగింది.

సత్యన్నారాయణమూర్తికి ఆమె మాటాడినదంతా కూడా అర్థంకాలేదు.

సాయంకాలంపూట వచ్చాడు.

పనిమనిషి చెప్పింది అమ్మగారు యింట్లోలేరని.

వరండాలో స్తంభాన్నానుకుని సత్యన్నారాయణమూర్తి కూర్చుండిపోయాడు. అతడి మనస్సు యేమీ పనిచేయటం లేదు.

చిన్నప్పటి జీవితం గుర్తుకు రాసాగింది.

మానవ సహజమైన బలహీనతవలన ఎప్పుడో గడిచి పోయిన రోజులు కష్టపు ఘడియలలోగుర్తు వస్తాయేకాని, ఇంత కంటెను కష్టపు ఘడియలు తాను గడచి వచ్చానన్న సంగతి గుర్తుండదు. మామూలుగా గడిచిపోయిన రోజులన్నీ మంచివి అనిపిస్తాయి. వర్తమానమంతా వ్యథాభరితమైనదిగా అని పిస్తుంటుంది. భవిష్యత్తు మనిషినిబట్టి సుఖమయమైనదిగానో, దుఃఖకర మైనదిగానో తలంపు కలుగుతుంటుంది. కష్టపు ఘడియలలో కష్టపు ఘడియలను గుర్తుకు తెచ్చుకుంటే యింత విధురత్వం అనుభవించాల్సిన అవసరం వుండదు.

ఎప్పుడో గడచిపోయిన మధురస్మృతులనుకుంటున్న వాటిని మనం వర్తమాన పథాన గుర్తుకు తెచ్చుకుంటే యీవిధురత్వం మరీ చిక్కబడి పోతుంది. నిజంగా ఎప్పుడోకాని, సామాన్యంగా సామాన్యుడికి మంచి రోజులు కాని, మధురోహలు కాని వుండనేవుండవు. అయితే కాలమనేది గారడీచేసి సుగర్ కోటెడ్ పిల్స్‌లాగా, గడచి వచ్చిన తర్వాత ఆరోజులు మంచివని, మధురమైనవని చెపుతుంది. కాలాన్ని ఏనాడూ వంచించలేని మానవుడు నిజమే కాబోలు ననుకొని చింతిస్తాడు. కాలం మాత్రం ఇటువంటి వాళ్ళను చూసి నవ్వుకుంటుంది.

"ఇప్పుడు నువ్వు నా వద్దకు ఎందుకువచ్చావో చెప్పక పోయినా నేను గ్రహించ గలిగేదాన్నే" అన్నది సత్యన్నారాయణమూర్తి అక్కయ్య. సత్యన్నారాయణమూర్తి క్రుంగిపోయినాడు. ఎందుకు వచ్చానా అనిపించిందతడికి. ఏమనాలో తోచలేదు. "ఇక నేను మీతో యెలాంటి సంబధమూ పెట్టుకోదలచలేదు. కాబట్టి నన్ను నిశ్చింతగా బ్రతకనియ్యండి."

ఆమెను నిశ్చింతగా బ్రతకనివ్వాలట. ఆమే తమకు యిన్ని కష్టాలు తెచ్చిపెట్టింది. ఆమెను తామంతా బాధిస్తున్నట్లు మాట్లాడుతున్నది. ఆ దిగులుతో కాదూ అమ్మపోయింది.

"ఇక యెప్పుడూ మిమ్ములను గురించి ఆలోచించను".

సరే, నిన్నెవరు ఆలోచించమన్నారు? అనుకున్నాడు మూర్తి.

అయినా మీ రంతా కలసి నన్ను వెలివేసినప్పుడు ఇలాంటి సమయంలో నువ్వు నా వద్దకు వస్తే సానుభూతిని నువ్వు పొందలేవు. మిమ్మల్ని మీరు వంచించుకుంటున్నారు.

అతడి కాశ పోయింది.

చెప్పా పెట్టకుండా లేచి వచ్చేశాడు. గేటుదాకా నడిచినదాకా వెనక్కి పిలుస్తుందేమోనన్న ఆశ పీడించ సాగింది. కాని సరోజిని పిలువలేదు. ఆమె మనసు కేమిటో వుద్రేకంగావుంది. సత్యన్నారాయణమూర్తి బజారు వెంట పిచ్చివాడిలా నడిచాడు. అతడి అస్తిత్వాన్ని గురించే అతడి కొక విధమైన అనుమానం కలుగసాగింది. బయట ప్రపంచంలో కార్లూ, రిక్షాలూ, జనం కదులుతున్నారు. అక్కయ్య అలా మాటాడిందేమిటి ?

సరిగ్గా సాయంకాలం ఐదుగంట లప్పుడు వెళ్ళాడు మూర్తి. అక్కయ్య లేదు. పని మనిషి కాబోలు అడిగింది. మూర్తి కేమి చెప్పాలో తోచలేదు.

"అయ్యగారు లేరు" అని చెప్పింది పని మనిషి.

"ఆయనగారి కోసమైకాదు నేనువచ్చింది." అన గలిగాడు మూర్తి.

"అమ్మగారు లేరు. పేరంటానికి వెళ్ళారు. ఇంకా గంట పైనే పడుతుంది."

అతడు అక్కడే కూచుండిపోయాడు.

"బంధువులా..." అని అడిగింది పనిమనిషి అతడి వాలకం చూసి. మూర్తి కేమని చెప్పాలో తోచలేదు.

ఆ గంటసేపూ ఎన్నెన్నో ఆలోచించాడు.

ఆలోచనలు తెగనే లేదు.

అక్కయ్య వచ్చింది.

తనను చూసింది. నిరీహులర్రాలై చూసింది. తరువాత లోపలికి వెళ్ళి వచ్చింది.

"ఏం ఇట్లా వచ్చావు సత్యం..." ఆ స్వరంలో యెంత మార్దవమో, అంత యీసడింపు. ఎంత అభిమానమో, అంత వెటకారం.

"నిన్ను సత్యమనే అంటాను ఏమీ అనుకోకు. ఎంత తీసేసుకుందామన్నా ఆడవాళ్ళు అంత త్వరగానే తీసేసుకోలేరు బంధాలను. నువ్వు వసుధతో అనగలిగావు మా అక్కయ్య కాదని, నేను అనలేకపోయాను. కాని ఇవాళ అనేవచ్చానులే."

తాను వచ్చినందుకు కన్నీళ్ళు పెట్టుకుంటుందేమో, ఆమెను యెలా ఓదార్చాలి? ఏమిటి? అని భయపడుతూ వచ్చాడతడు. కాని ఆమె తనని యీసడిస్తోంది. గంటసేపు కూచున్నాడతడక్కడ. ఆమె యెదురుగా కూచుంది. ఆమె అలానే వుట్టి నేలమీద కొత్త చీరతోనే అతడి యెదురుగా కూచుని మాటాడటం చూసి పనిమనిషి విస్తుపోయింది. గబగబా లోపలకు వెళ్లి చాప తీసుకుని వచ్చింది. కాని దాని సంగతి యెవరూ పట్టించుకోకపోవటంతో మరీ విస్తుపోయింది. కాసేపు తలుపుచాటున నిలబడి సంభాషణ విన్నది. కాని, అమ్మగారు చెపుతున్న దేమిటో అర్థంగాకపోయేసరికి ఇంట్లోకి వెళ్లి కాసేపు పని చూసుకుని, ఇంటికి వెళ్ళిపోయింది.

హిమాయత్ నగర్‌లో అంత దూరంనుంచి తాను యెలా నడచి వచ్చాడా? అని ఆశ్చర్యపోయాడు మూర్తి

చెప్పల్ బజారులోని రూము చేసుకుని. నాలుగు రోజులైన ట్లుంది అమావాస్య వెళ్ళిపోయి. ఆకాశాన అర్ధచంద్రాకృతి బావుంది. క్రింద మాంసపు దుకాణం మూసివేసి వుంది. బజారంతా సందడిగానే వుంది.

మూర్తి చెక్కమెట్లు భారంగా యెక్కి గది ముందుకు చేరేసరికి నిన్నటిలాగానే వైకుంఠాచార్లు కూచునే వున్నాడు. మూర్తికి విపరీతంగా భయం వేసింది. కాని ఆ భయం ఒక్క నిమిషంకన్నా యెక్కువ వుండలేదు. వెంటనే యెక్కడలేని నిర్లిప్తతా వచ్చేసింది.

"ఇవాళకూడా యెక్కడికి పోయినావు మహానుభావా! చూడచూడ నీ బాగు నువ్వే చూసుకునేట్లున్నావే, నా సహాయము అవసరం లేదులావుంది. అయితే మంచిదే" అన్నాడు వైకుంఠం.

మూర్తి యేమీ మాట్లాడలేదు. అతడి కెంతో దిగులుగా వుంది. పైన చెప్పలేని విసుగ్గా వుంది.

లైటు వెలుతురులో మూర్తి ముఖం చూసి వైకుంఠం షాక్ తిన్నవాడిలా అయిపోయినాడు. ఇంతలోనే మళ్ళీ మామూలు ధోరణిలో పడి "ఏమిటి కథ. ఇంతవిషాద మెందుకోయ్. నా చిన్నతనంలో సారంగధరుడి వేషం వేశాను వొకసారి. అప్పుడుకూడ ఇటువంటి ఫీలింగ్సు చూపలేకపోయాను" అన్నాడు.

మూర్తికి అతగాణ్ణి త్వరగా వదుల్చుకుందామని కోరికగా వుంది.

"ఇవాళ నా మనసు బాగులేదు. దయవుంచి నా జోలికి రాకు. ఇలా అంటున్నందుకు మరేమీ అనుకోవద్దు" అన్నాడు యెంతో అనునయంగా.

"అందుకే నేను వచ్చాను. మనసు బాగుచేయడానికే, ఇప్పుడు నాతో రా. కలకలలాడి పోతావు!" అన్నాడు వైకుంఠం.

"నన్ను చంపవద్దు. నాకు చాలా నీరసంగా వుంది."

"రిక్షాలో పోదాం!"

"ఎక్కడికి?"

"మనసు బాగుపడే చోటికి!"

సత్యన్నారాయణమూర్తికి తెలుసు. అతణ్ణి వదుల్చుకోవటం సాధ్యమైనదిగాదు. అతడికెన్ని చెప్పినా తలకెక్కవు. అతడికి విధిలేకపోయింది. మనసు రాయి చేసుకున్నాడు.

"అన్ని దురదృష్టాలలో ఇది వొకటి. అన్ని దుఃఖాలలో ఇది వొకటి. అయినా తానిక్కడ వొంటరిగా వుండి మాత్రం చేసేదేమిటి? ఏమీలేదు. అయినా మనసుకి శాంతి కావాలి. పిచ్చి యెక్కేలా వుంది. విపరీతంగా నవ్వాలని వుంది. గుడ్డలు చించుకోవాలని వుంది. పోనీ, యెక్కడకు తీసుకువెళ్తాడో చూస్తాను. ఈ బ్రతుకును విచ్చలవిడిగా వదిలెయ్యవలసిందే. అసలు ఆలోచించకూడదు. ఏ పూట యెలా గడచిపోతుందో తెలీకుండా గడచిపోవాలి. అబ్బ? కాసేపు జుట్టు పీక్కుంటే బావుండును. వైకుంఠానికి నేను చచ్చినా రాను అని చెసితే యేంచేస్తాడు? అతడి ముఖం చూడాలంటేనే అసహ్యంగా వుంది. అయినా వదుల్చుకోలేను. చూడు ఎలా వున్నాడో.

Surveen a m a.
Grandhalayam



ఈ బ్రతుకులో పూర్తిగా పతనమైపోవాలి. మనస్సు మొద్దు బారిపోవాలి. వీళ్ళందరితో తనకు యే మాత్రమూ సంబంధం లేదు. డబ్బు కావాలి. డబ్బుంటే సుఖాలను కొనుక్కో వచ్చును. పతనమేమిటి? పతనం. అర్థంలేదు. చాలా గొప్పవాళ్ళందరూ పతనమైపోయినవాళ్లే. ఏం వాళ్ళు సుఖపడటంలేదూ. వాళ్ళ మనసును ఇంత అశాంతి బాధిస్తున్నదా? వైకుంఠం సంగతి తనకు చూచాయగా తెలుసు. వైకుంఠం హాయిగా లేడూ? వైకుంఠం తీసుకువెళ్లిన చోటికల్లా తను పోవడం మంచిదే. వెళ్లాల్సిందే. వైకుంఠం చాలా మంచివాడు. నిర్మల హృదయం కలవాడు. పాపం, తనకోసం యెందు కతడు కష్ట పడాలి. వైకుంఠా న్నడుగుతే యేమైనా డబ్బుసహాయం చెయ్యలేకపోతాడా? అయినా ఇప్పుడడగకూడదు. లేకపోతే బాధపతాడు".

మూర్తి యేమిటేమిటో ఆలోచించాడు.

గది తాళం నొక్కి వైకుంఠం వెనకనే మెట్లు దిగి కిందకు వచ్చాడు...వైకుంఠం వెంటనే రిక్షాను పిలిచాడు. వైకుంఠమే యేదో మాట్లాడాడు.

బేరం చేశాడు. వాణ్ణి వెళ్ళగొట్టాడు. రెండవవాణ్ణి పిలిచాడు. వాణ్ణి పంపించి, మళ్లీ మొదటివాణ్ణే పిలిచాడు. వైకుంఠం ప్రక్కనే సత్యన్నారాయణమూర్తి కూచున్నాడు.

వైకుంఠం అన్నాడు: "వెధవ వేషాలెయ్యక నేను చెప్పినట్లు వినాలి. మనం సినిమాకు వెళదాం?"

మూర్తి మనసుకి సంతోషం కలగలేదు. సినిమాకు పోతే తలనొప్పి తప్ప వేరేముంది. రిక్షా జోరుగా పోతున్నది.

ఏవేవో మలుపులు తిరుగుతున్నది. మూర్తికి తెలిసీ తెలియ నట్లుగా వుంది.

వైకుంఠం దిగమంటే దిగాడు. ఏదో హోటలుముందు రిక్షా ఆగింది. రిక్షావాడు వాళ్ళకేసి నిర్లక్ష్యంగా చూసి, అసూయతో చూసి వెళ్లిపోయాడు. వైకుంఠాచార్లను అనుస రిస్తుంటే సత్యన్నారాయణమూర్తి కాళ్ళు గజ గజా వణికి పోయినై. అయినా యేమిటో యెవరిమీదనో పగదీర్చుకుం టున్నట్లుగా, ప్రపంచాన్ని సాధిస్తున్నట్లుగా మూర్తికి అనుభూతి కలగసాగింది. రంగు రంగుల లైట్లు వెలుగుతున్నాయి. ఎంతో నిశ్శబ్దం తాండవిస్తున్నది. అటువంటి హోటలుకు యెవరు పోతారో, వాళ్ళను గురించి అదివరలో తాను యేమనుకునే వాడో గుర్తువచ్చి మూర్తికి రోమాంచం కలిగింది. కాళ్లు వణికి పోతూనే వున్నాయి. ఎవరైనా చూస్తారేమోనని సిగ్గుగా వుంది. భయంగా వుంది. కౌంటర్ వద్ద కూచుని వున్న యజ మాని వైకుంఠాచార్లను చూసి ఆదరంగా నవ్వటం చూసి మూర్తి హడలిపోయినాడు. వైకుంఠం యెక్కడికో తీసుకు పోతున్నట్లనిపించిం దతడికి. ఒకమూల యెవరూ లేనిచోట రెండే కుర్చీలు ఒక గదిలో అమర్చివున్నచోట వొక కుర్చీ మీద మూర్తిని కూచోబెట్టి బుజం గట్టిగా చరిచాడు వైకుంఠం.

మూర్తిముఖం వాలిపోయింది.

అయినా లేని చిరునవ్వు తెచ్చిపెట్టుకున్నాడు.

“ముందు ఘాటుదివద్దులే. ఇప్పుడే ఘాటుది అలవాటు చేసేనా, నువ్వు నాచేతికి చిక్కవు” అన్నాడు వైకుంఠం.

ఏమిటో తినటానికి వచ్చింది.

"తీసుకో యేమీ అనుమానం లేకుండా" అన్నాడు వైకుంఠం.

తాను తినటం ప్రారంభించాడు.

సత్యన్నారాయణమూర్తికి ప్రాణాంతకమైంది.

వైకుంఠం అతణ్ణిచూసి నవ్వాడు.

సత్యన్నారాయణమూర్తి యెలానో కొద్దిగా తినగలిగాడు.

తరువాత గ్లాసులనిండా వెయిటరు పట్టుకొచ్చాడు యేదో పానీయాన్ని. ఆ గ్లాసులని చూడగానే మూర్తి కళ్ళు బైర్లుకమ్మినై. ఒళ్ళుతిరిగింది. తాను రసాతలానికి క్రుంగిపోతున్నాడు. ఆకాశానికి యెగిరిపోతున్నాడు. తాను చెడ్డాడు. వైకుంఠాన్ని చూస్తే భయమేసింది. అసహ్యమేసింది. వైకుంఠం గ్లాసు ఖాళీచేశాడు. వెయిటరుకు సైగచేసాడు. మూర్తి కళ్ళు మూసుకుని చెయ్యి వణికిపోతుండగా నోటికందిచ్చాడు. మళ్ళీ తీసివేశాడు. మళ్ళీ నోటిదగ్గరకు తీసుకున్నాడు. వగరు వగరుగావుంది. అయితే యేమిటో తేలిపోతున్నట్లుగా వుంది. కళ్ళు తిరుగుతున్నట్లుగావుంది. వైకుంఠం రెండో గ్లాసు ఖాళీ చేశాడు.

మూర్తిని చూసి వెయిటరు నవ్వాడు.

మూర్తికి యెంతో అభిమానమైంది. కళ్ళుమూసుకుని త్రాగేశాడు. కాసేపటికి బయటికి వచ్చాడు సత్యన్నారాయణమూర్తి. కౌంటర్ దగ్గర వైకుంఠం పదిరూపాయల నోటిచ్చి చిల్లర అణాలూ, బేడలూ తీసుకుంటూ నోరు ఆవలించాడు.

వైకుంఠం పాన్ కొని యిచ్చాడు సత్యన్నారాయణమూర్తికి. సిగరెట్ వెలిగించాడు.

రోడ్డుమీద నడుస్తుంటే వైకుంఠంతో నడవలేక పోతున్నాడు మూర్తి. వెనకబడిపోతున్నాడు. వైకుంఠం వెనక్కు తిరిగి "ఏమిటలా నడుస్తావు? మామూలుగా నడవరాదూ" అన్నాడు. సత్యన్నారాయణమూర్తికి అమితంగా భయమైంది. తనకాళ్ళ వేపునిలిచి చూసుకున్నాడు. కాళ్లువణుకుతున్నాయి. వైకుంఠం మామూలుగా నేవున్నాడు. మూర్తికికోపం వచ్చింది. వైకుంఠం ముందుకునడిచాడు. మూర్తి నడిచాడు. అడుగులు తడబడుతూనే వున్నాయి. వైకుంఠంతో పాటుగా నడవలేక పోతున్నాడు. వైకుంఠం మళ్ళీనవ్వాడు. మూర్తి ముఖం పక్కకు తిప్పుకున్నాడు.

"ఒళ్ళంతా వెచ్చగా హాయిగావుంది. ఏయ్ రిక్షా ఇటురా..."

వైకుంఠం రిక్షాని పిలిచాడు.

రిక్షా వచ్చింది.

మూర్తి రిక్షా యెక్కి కూచున్నాడు. ఇంకా అదురు తగ్గలేదు. వైకుంఠం యెక్కడకు తీసుకు వెళుతున్నాడో అతడికి తెలియటంలేదు. రిక్షా వెళుతున్నది. మూర్తికి యేడుపొచ్చింది. రూముకి వెళ్ళి లైటుతీసివేసి కటిక నేలమీద పడుకుని వొక్కసారి యేడిస్తే బావుండును అనిపించింది.

రిక్షా వెళ్ళి యేదో సినిమా హాలుముందు ఆగింది.

వైకుంఠమే వెళ్ళి టిక్కెట్లు తీసుకుని వచ్చాడు.

ఏదో తెరమీద బొమ్మలు చూస్తున్నాడన్న మాటే కాని మూర్తికి యేమీ తెలియటంలేదు. ఇంగ్లీషు పిక్చరు. మధ్యమధ్య వైకుంఠం బుజం చరుస్తుంటే అమితమైన విసుగు పుట్టింది మూర్తికి. ముళ్ళమీద కూర్చున్నట్లుగా కూచున్నాడు ఆ రెండు, రెండున్నర గంటలూ.

బయటకురాగానే వైకుంఠం యేవేవో కామెంట్సు చేశాడు. పిచ్చిపిచ్చిగా మాట్లాడాడు. మూర్తి వేటికీ సమాధానం చెప్పలేదు. వైకుంఠానికి జాలి కలిగింది మూర్తిని చూసి. రిక్షాయెక్కి చెప్పల్ బజార్ చేరుకునేసరికి పన్నెండు కావస్తోంది. "మరేం భయంలేదులే. ఏమీ బాధపడకు. కాస్తంత ఆమ్లెట్టు, కూస్తంత విస్కీ తాగినంతమాత్రాన యేమీ చెడిపోయినట్టుకాదు" వైకుంఠం వెళ్ళిపోయాడు.

మూర్తి లైటుతీసివేసి అలానే పడుకున్నాడు. విపరీతమైన చలిపుడుతోంది. దోమలు వంటినిండా మూగుతున్నాయి. దుప్పటి కప్పుకుని నిద్రపోదామని యెంతో ప్రయత్నం చేశాడు. అతడికి తెలీకుండానే కన్నీళ్ళు రాసాగినయ్. నిద్రరావడంలేదు. గుండెల్లోనొప్పి, తలకాయ నొప్పి, కళ్ళమంటలు. పెద్దగా యేడుపువస్తే బావుండును. యేడుపు రావటంలేదు. వాంతి చేసుకుంటే బావుండును. వాంతి వచ్చేటట్లులేదు. కళ్ళనీళ్ళు తుడుచుకుంటూనేవున్నాడు. మళ్ళీమళ్ళీ కళ్ళు తడిఅవుతూనే వున్నాయి. తాను పూర్తిగా భ్రష్టత్వం చెందాడు. సంపూర్ణంగా భ్రష్టుడైపోయాడు. సర్వనాశనం జరిగింది. ఇక తాను యేమిచూసుకుని బ్రతకాలి? తన బ్రతుకు తన విలువను కోల్పోయింది.

అమ్మ గుర్తొచ్చింది.

'అమ్మా, అమ్మా, ఇటువంటి పాపాత్ముడు నీ కడుపున యెలా పుట్టేడమ్మా!' అతడి కోరిక ఫలించింది. హృదయం తేలికపడేటట్లుగా యేడుపు వచ్చింది. 'నాన్నా ఇక నిన్ను చూడలేను' అనుకున్నాడు. ఇంట్లో వాళ్ళొక్కరు అంతా గుర్తుకువచ్చారు. అక్కయ్య గుర్తుకువచ్చింది. 'అక్కయ్యా నువ్వు నిజంగా మంచిదానవు. దేవతలాంటిదానివి. కాని నువ్వెందుకు నన్ను పాడుచేశావు చెప్పమ్మా. నువ్వు నన్ను ఆదరించి వున్నట్లైతే అక్కడే వుండిపొమ్మన్నట్లైతే ఇలా జరిగేదా. నాకు అమ్మ అయినా గుర్తువచ్చేదిగాదు.' అతడు మళ్ళీ కళ్ళు తుడుచుకున్నాడు.

జరిగినదేదో జరిగిపోయింది. నిజమే మరి. సర్వనాశనం జరిగింది. ఇప్పుడేమి చేసేట్లు. తాను భ్రష్టుడైపోయాడు. నిజమే. రేపు ఒక అట్టముక్క కత్తిరించి దానిమీద భ్రష్టుడు, అని వ్రాసి తన ముఖానికి కట్టుకుంటే, ఎవరైనా చూసి నవ్వితే...వాళ్ళను చీల్చి పారెయ్యవలసిందే...ఎందుకు?

మూర్తికి తల బద్దలైపోతుందేమోననిపించింది. ఈఆత్మ అనేది చిక్కితే బావుండును. దానిని కాల్చి బూడిదచేస్తే బావుండును. అది తనని బ్రతకనిచ్చేటట్లు లేదు. ఎప్పుడూ యేదో తనని వేలెత్తి విమర్శిస్తూనే వుంటుంది. కళ్ళు మూసుకోనివ్వదు. ప్రత్యక్షం. ఏదో ఎప్పుడూ మాట్లాడుతూనే వుంటుంది.

మూర్తి తూలుతూ లేచి లైటువేశాడు. తన చిన్న అద్దం తీసుకుని అందులో తనని చూసుకున్నాడు. తనంటే అసహ్యమైంది. తిట్టుకున్నాడు. తరువాత జాలికలిగింది.

'నిజమైన మానవుడు' కన్పించింది. తీసుకుని కళ్ళకద్దుకున్నాడు. మళ్ళీ అన్నయ్య వ్రాసిన ఉత్తరం ఒక్కసారి చదువుదామనిపించింది. ఇవాళ కాలేజీనుంచి వచ్చినప్పటి నుంచీ మనస్సుకి యెనలేని వ్యధ కలుగజేసిన ఉత్తరమదే- అవాళ ఆ ఉత్తరమే ఇతణ్ణి ఇలా చేసింది.

గోడ కానుకుని తడికళ్ళతో ఆ ఉత్తరాన్ని మళ్ళీ మళ్ళీ ఇలా చదువుకున్నాడు.

"తమ్మునికి ఆశీర్వదించి వ్రాయున దేమనగా యీ ఉత్తరము చూసి గాబరాపడవద్దు. బయలుదేరి రావద్దు. నేను చెప్పినట్లు విన్నావుకావు. మనబోటి వాళ్ళకా నాయనా, యీ పెద్ద చదువులు అంటే నువ్వు వినలేదు. అందువల్ల చెడుపు యేమీ జరగకపోయినప్పటికీ, వున్న నలుగురమూ వొక్కచోటవుంటే బావుండేది. మొన్న సోమవారం నాన్నను హాస్పిటల్‌లో చేర్చాను. పొత్తికడుపువద్ద యేదో ఆపరేషన్ జరిగింది. ఎంతో ప్రమాదకర పరిస్థితులలో బ్రతికి బయటపడ్డారు. ఇప్పుడేమీ ఫరవాలేదు. వాసు క్షేమంగానే వున్నాడు. హాస్పిటల్‌కు తిరగటం, ఫ్యాక్టరీకి పోవటం, అన్ని పనులూ చూసుకోలేక యిబ్బందిగావుంది. బొత్తిగా డబ్బు లేదు. ఏమైనా వీలుచూసుకుని కొంతడబ్బు యెవరివద్దనైనా తీసుకుని పంపించు. ఇక్కడ యెవరూ నాకు యిచ్చేట్లులేరు. బొత్తిగా యేమీ తోచకుండావుంది. నువ్వు యీ పరిస్థితులలో చదువు మానుకుని రావటమే ఉత్తమ మనిపిస్తున్నది. ఎక్కడైనా వుద్యోగం చూసుకుంటేనే మంచిది. మా ఫ్యాక్టరీలోనే వొక గుమస్తా చెపితే, ఏదో ఉద్యోగానికి ఫారము

తెప్పించి నీకు పంపించాను గదా, అదే బావుంటుంది. తప్ప కుండా అప్లైచెయ్యి. మరేమీ గాభరాపడవద్దు. నాన్న కోలు కున్నాడు. నీకుఉత్తరం కూడా వ్రాయ నవసరం లేదన్నాడు. వెంటనే ఉత్తరం వ్రాస్తాను. మరేమీ దిగులు పెట్టుకోకు"

ఆ ఉత్తరం సారాంశం అది.

సత్యన్నారాయణమూర్తి కళ్లుతుడుచుకున్నాడు. లైటు తీసివేశాడు.

కొంత సేపటికి నిద్రా - మెలుకవా కాని అనుభూతు లలో అతడికి పాడుపాడు దృశ్యాలెన్నో కళ్ళముందు కట్టినై. సినిమా బొమ్మలు కనపడినై. అక్కయ్య తనని యీసడిం చటం మనసులో మెదిలింది. అమ్మ చచ్చిపోయింది. నాన్న ఆస్పత్రిలో బెడ్ మీద కన్నీళ్ళు పెట్టుకుంటున్నాడు. అన్నయ్య పనిచేసి, పనిచేసి రాత్రి పదిగంట లప్పుడు ఫ్యాక్టరీ నుండి ఇంటికి వస్తున్నాడు. వాసు యెందుకో అర్ధరాత్రివేళ పక్క మీదలేచే కూచుని యెవరికీ వినపడకూడదన్న వుద్దేశ్యంతో అణచుకుని, అణచుకుని యేడుస్తున్నాడు. ఏమిటేమిటో దృశ్యాలు.

పొద్దున నిద్రలేచేసరికి అతడికి కళ్ళు మంటలు పుట్టినై. శరీరాన్నంతా నీరసం అలుముకుంది. గుండెల్లో నొప్పి అలానే వుంది. ఎలానో ముఖం కడుక్కున్నాడు. కాఫీతాగి వచ్చాడు. ఏమీ తోచటంలేదు. నిన్న జరిగిన సంఘటనలన్నీ కలలోని దృశ్యాలవలె కనిపించ సాగినయ్. ఇక ప్రెస్‌కు పోకూడదు. నైకుంతా చార్లకు కనిపించనే కూడదు అని నిశ్చయం చేసు కున్నాడు.

మధ్యాహ్నం పదిన్నరప్పుడు హోటలుకు వెళ్ళి భోజనం చేసి వచ్చాడు. రామారావు ఆఫీసుకు వెళ్ళి యేమైనా డబ్బు అడుగుదామని నిశ్చయం చేసుకున్నాడు. భోజనం చేస్తున్నంత సేపూ అరుచిగానేవుంది. చెయ్యికడుక్కుని బయటకురాగానే వొళ్ళు తిప్పినట్లైంది. నడవలే ననిపించింది. రిక్షాయెక్కి రూము చేరుకున్నాడు.

చెక్కమెట్లు యెక్కుతూ యెక్కుతూనే భళుక్కున వాంతి చేసుకున్నాడు. ఎలానో గదితాళం తెరచి పక్క పరచుకుని పడుకుంటే గుండెల్లో నొప్పి యెక్కువైనట్లని పించింది. గబ గబ చలి కమ్ముకుని వచ్చింది. తలనొప్పి అధిక మైంది.

రెండు గంటల వేళకు జ్వరం పూర్తిగా కమ్ముకుని వచ్చింది. చెక్క మెట్లమీద యెవరో నీళ్ళుపోస్తూ తనను గురించే మాట్లాడుకోవటం విన్నప్పటికీ, అతడు యెవరినీపిలిచి యేమీ చెప్పలేకపోయినాడు. దుప్పటి పూర్తిగా బిగించుకుని వొళ్ళు తెలీకుండా అలానే నిద్రకాని నిద్రలాంటి నీరసానికి గురైనాడు.

# 11

మర్రోజు సాయంకాలం ఆరుగంటలకు సాయంకాలవు కిరణాలు తెరచివున్న కిటికీలోంచి దూసుకునివచ్చి గదిలో పరచుకుంటున్నప్పుడు సత్యనారాయణమూర్తికి మెళుకువ వచ్చింది. విపరీతమైన దాహ మయింది. ఎక్కడలేని నీరసం అలుముకుంది. తను ఎక్కడవున్నదీ, ఏంచేస్తున్నదీ, ఏ పరిస్థితిలో వున్నదీ తెలియటం లేదు. అతడి మనసు కంపించింది. ఇంత దయనీయమైన పరిస్థితిలో తా నెన్నడూ లేడు. ఇంతటి దురదృష్టం ఎందుకు సంభవించింది? అని కుమిలిపోయాడు. ఇంత నిస్సత్తువ, యింత నిరాశ, నిస్పృహ, చచ్చిపోదామన్న తీవ్రమైన కోర్కె, మనుష్యు లందరిమీదను కసి- ఇదివరలో అతను అనుభవించి వుండడు. నిమిష నిమిషానికి నిన్ననో మొన్ననో తాను చేసిన పాడుపని గుర్తువస్తున్నది. నైతికమైన విలువను తా నేదో కోల్పోయినట్లు తాను పతితుడైనట్లు యీ ప్రపంచంలో మంచివాళ్ళంటూ యెవరైనావుం టే తాను వాళ్ళముఖం ఇంక చూడలేను అనీ, పరిపరివిధాల మనసు వూహాలు పెంచుకుని ఒక విధమైన ఆత్మ న్యూనతా శంకతో బాధపడసాగాడు మనిషి. మధ్యమధ్య ఆత్మహత్యను గురించి గూడా ఆలోచనలు కలిగినయ్. కాని తనకు తెలుసు. తాను

యెంత పిరికివాడో. ఎన్నిరకాలయిన కోర్కెలు తనను బంధించి వుంచుతున్నాయో తెలుసు. తాను చచ్చిపోలేదు. జీవితం మీద కసి కేసినప్పుడు, యీ ప్రపంచంమీద దురాగ్రహం కలిగినప్పుడు, ఆత్మహత్య చేసుకుందా మనిపించినా, తీరా తనను తాను స్వర్గం రచుకొని కొన్ని అభూత కల్పనలు గావించి, మనస్సురహదారిలో చల్లని చెట్లను నాటి, అందమైన దృశ్యాలు హృదయ ఫలకంమీద రచించుకుంటూ అడుగు ముందుకు కదలకపోయినా ముందు ముందుకు కదుల్తాడు మానవుడు.

ఇన్ని ఆలోచనలమధ్య చల్లని మంచినీళ్ళకోసం ప్రాణం తపన పడసాగింది. మనస్సు మంచినీటి రుచిని అదే పనిగా మననం చేయసాగింది. ఆ సమయంలో దేము డెవరయినా ప్రత్యక్షమయితే, నీకేం కావాలి కోరుకో అని అడిగితే, అతగాడు, ఆ మానవుడు నిస్సందేహంగా ఆత్రుతతో ఒక గ్లాసుడు చల్లటి మంచినీళ్ళు అని అడుగుతాడు. అటువంటిది యెవరూ వచ్చే దరీ దిక్కూ తోచటంలేదు. తాను లేచే స్థితిలో కూడా లేడు. అలానే గోడ నాధారం చేసికొని లేచి నిలుచున్నాడు. కళ్లు తిరిగినయి. కళ్లు మూసుకుని వాలికిదాకా జరిగాడు. వాకిలి దగ్గరగా వేసివుంది. ఎలానో తలుపులు తెరవ గలిగాడు. కాని ఆ మెట్లు పాతాళంలోకి పాముల మధ్యకి తీసుకునిపోయే మెట్లులా కన్పించసాగినయ్. క్రిందమెట్లు పక్కనే పంపువుంది. కాని పంపుదగ్గరకు చేరేదెట్లా, ప్రపంచంలో అతి చవుకగా లభ్యమయ్యే మంచినీళ్లు ప్రాణాధారమైన నీళ్ళు తనకు ఎవరు తీసుకుని వస్తారు యిప్పుడు. ప్రపం

చంలో పరిస్థితులనే వాటియొక్క బలం ఈ విధంగానే వుంటుంది కాబోలు. ఆశతో అతడు అలసి పోయిన కళ్లతో పంపువేపే చూడసాగాడు.

కాని అతడి అదృష్టం ఇంతలో మారిపోయే సూచన లభించింది. క్రింద మాంసపు దుకాణపు సాయెబు చెక్కమెట్ల పైన యెక్కి వస్తున్నాడు. మూర్తికి ప్రాణం లేచివచ్చింది. అతణ్ణి చివర మెట్టుకూడా యెక్కనిచ్చి మంచినీళ్లు కావాలని నీరసంగా చెప్పగలిగాడు. ప్రపంచంలో ఇటువంటి పరిస్థితులు తప్పవు. అతడు యెంతో ఆందోళనతో క్రిందికిదిగి గాజు గ్లాసుతో మంచినీళ్ళు తీసుకుని వచ్చినప్పుడు వేరే ఆలోచన లేకుండా, అమృతం లభించినంత ఆనందంతో, తృప్తితో ఆ మంచినీళ్లు గడగడా తాగేశాడు. అతడికి కొంతబలం వచ్చినట్లైంది. ఆ మాంసపు దుకాణదారుడు యెన్నెన్నో ప్రశ్నలు వేశాడు. కాని సత్యన్నారాయణమూర్తికి ఏ వాక్యముకూ అర్థంకా లేదు. అతడికిగల పరిమితమైన వుర్దూభాషయొక్క జ్ఞానంతో 'జ్వరం వచ్చింది' అని మాత్రమే చెప్పగలిగాడు. అప్పుడు సాయెబు లైటువేసి అతడి దగ్గరగా వచ్చి పరిస్థితి వొక క్షణంలోనే గ్రహించగలిగాడు. కాని అతడికి భావాలను వ్యక్తంచేయగలంత తెలుగురాదు. పక్కను దులిపి రెక్క పట్టుకుని తీసుకునివచ్చి పడుకోబెట్టాడు. క్రిందికి దిగిపోయాడు యేమీ చెప్పకుండానే. సత్యన్నారాయణమూర్తికి తన వంటరితనం తలుచుకుంటే యేడుపువచ్చింది. తన కెవరూ లేరు. తననెవరూ ఆదరించరు. తను యెందుకు బ్రతకాలి. ఎవరికోసం బ్రతకాలి. తనని అభిమానించేవాళ్ళు, ప్రేమించేవాళ్ళు యెవరున్నారు ?

ఇంతలోనే మాంసపు దుకాణపు యజమాని కూజాలో నీళ్ళునింపుకుని, గ్లాసు తీసుకునివచ్చి అక్కడపెట్టి పోయాడు. సత్యన్నారాయణమూర్తికి ఆశ్చర్యమైంది. ప్రపంచం యెంత చిత్రమైంది? తాను ఎవరికోసం బ్రతకాలి? అని ఆలోచించటంలో అర్థంలేదు. ఈ మాంస మనుష్యుకునే మంచి మనిషి కోసం యెందుకు బ్రతకగూడదు. సత్యన్నారాయణమూర్తి అలసిపోయి కళ్లవెంట దొన దొన కన్నీళ్లు జారినయ్.

మళ్లీ వచ్చాడా మంచిమనిషి. ఒక చేతిలో ఇంత రొట్టె, మరొ చేతులో కప్పులో టీ పట్టుకుని.

సత్యన్నారాయణమూర్తి కళ్ళు తుడుచుకో లేదు. మనుషులెందుకు బ్రతుకుతున్నారో, యెందుకు బ్రతకవలెనో అర్థమైంది. మంచిమనిషి ఆ కాస్తరొట్టె ఆ కాసిని 'టీ' తీసుకోమని మూర్తిని బ్రతిమలాడాడు. మూర్తి వొక్కముక్క రొట్టెతిని, వొక్క గుక్క టీ చప్పరించాడు. మంచిమనిషి నొచ్చుకుంటూనే వెళ్లి పోయాడు.

బాగా చీకటిపడిపోయింది. మసీదులో బాబా ప్రార్థన చేస్తున్నాడు. ఎన్నో కంఠాలు వొకటిగా ఆత్మవేదనను యెవరి ముందో వెళ్ళ బోసుకుంటున్నాయి. ఆ దేవుడనేవాడు వున్నాడో లేడో యెవరూ చెప్పలేరు. కాని ప్రపంచంలో మనుష్యులు కన్నీళ్ళు తుడుచుకోడానికి ఆ దేవుడే ఆధారభూతుడవుతున్నాడు.

సత్యన్నారాయణమూర్తికి మనస్సుకు సంబంధించిన నీరసం కొంతమటుకు తొలగిపోయింది. కాని శరీరం పూర్తిగా అలసిపోయేవుంది. నిద్రపట్టడంలేదు. కాసేపు గతంలోనూ,

కొంతసేపు భవిష్యత్తులో వర్తమానాన్ని గురించి చింతిస్తూ గడపసాగాడు. ఎన్నెన్నో సంఘటనలు కండ్లముందు పరిచిత దృశ్యాలవలె కనిపించసాగినయ్. ఆకలి వేస్తున్నది. వెనుక గడచిపోయిన రోజుల్లో తనకు జ్వరం వచ్చినప్పుడు, అమ్మ యెంత ఆందోళనపడేదో గుర్తుకువచ్చింది. తినకు పండ్లువొలిచి ప్రేమతో తినిపించేవాళ్ళు లేరు. దగ్గరకూచుని భయంలేదని చెప్పేవాళ్ళు లేరు. శరీరమంతా ఒకచల్లటి హితస్పర్శను, ఒక చల్లటిచూపుకు, ఒక చల్లటిమాటకు తపనపడసాగింది. ఎవరైనా తనపక్కన కూచుని, వొళ్ళు నిమిరితే చాలును తన బాధంతా తీరిపోతుంది. తన కెవరున్నారు? ఆక్షణంలో సత్యన్నారాయణ మూర్తికి వైకుంఠం గుర్తువచ్చాడు. అతడిశరీరం భయంతో కుంచించుకొని పోయింది. ఒక విధమైన కంపరం పుట్టింది. మళ్ళీ వస్తాడేమోనని కాసేపు బాధపడ్డాడు.

అక్కయ్య గుర్తు వచ్చింది. కనీసం యీ పరిస్థితులలో రిక్షాచేసుకొని చిన్నగా అక్కయ్య దగ్గరకు వెళ్ళితే - ఆమె తనను ఆదరిస్తుందా? అతడికావూహ కలిగినందుకే సిగ్గయింది. ఆమె తనని చూసి ముఖం పక్కకి తిప్పుకుంటే తాను సిగ్గుతో దుఃఖంతో చచ్చిపోవాల్సి వుంటుంది. పోనీ పరంధామయ్యగారింటికి వెళితే-? అతడి కావూహ కలిగినందుకు మనసు తన మీద తనే యెంతో అసహ్యపడింది. తనని తాను నిందించుకున్నాడు. కళ్ళవెంట నీళ్ళువచ్చినై. రామారావుదగ్గరకు వెళితే బావుంటుంది. పాపం రామారావు తనకోసం కష్టపడాల్సి వుంటుంది. మరి తాను యేమి చెయ్యగలడు. రేపు యెలాగూ రామారావు రూముకి వెళ్ళాలని అతడు సంకల్పించుకున్నాడు.

అన్నయ్య గుర్తు వచ్చాడు. వాసు గుర్తు వచ్చాడు. అన్నయ్య ఉత్తరం వ్రాశాడు. దానికి కనీసం సమాధానం కూడా తాను వ్రాయలేక పోయినాడు. పాపం డబ్బుకోసం అన్నయ్య యెంత బాధపడుతున్నాడో. ఫ్యాక్టరీ గుమస్తాగా అన్నయ్య రక్తాన్ని కుటుంబంకోసం ఖర్చుపెడుతున్నాడు. నిజంగా అతడు ఒక్కడే యెందుకింత శ్రమపడాలి న్యాయానికి. అక్కయ్య లాగా కుటుంబంలో యెవరిసుఖం వాళ్ళు చూసు కుంటే, యేమయ్యేను? వాసు గతి యేమవుతుంది. ముసలి తనంలో తండ్రిగతి యేమికాను. అన్నయ్యను తలచుకోగానే కడుపులో యేమిటో ఆత్మీయతా భావం నిండుకొని దుఃఖం పెల్లుబికి అతణ్ణి వివశుణ్ణి చేసింది. తాను ఇంతదూరం రావటం చాలా తెలివితక్కువ. తానుగూడా వాళ్ళను కనిపెట్టుకుని వుండవలసింది. అందువలన కుటుంబానికి క్షేమం కలిగివుండేది. అన్నయ్య వ్రాసిన ఉత్తరం పక్కనేవుంది. మళ్ళీ తీసుకుని చదువుకున్నాడు. అన్నయ్య పంపించిన అప్లికేషన్ ఫారము అలానేవుంది. పూనావద్ద యెక్కడో ఒక ఫ్యాక్టరీలో కెమిస్టు ఉద్యోగం. జీతం ఫరవాలేదు. అలాటి ఉద్యోగం తనలాటి అదృష్ట హీనుడికి వస్తుందా? అది పూర్తిచేసి రేపు మాంసపు దుకాణా దారుడి కిచ్చి పోస్టులో వేయిస్తే సరిపోతుంది. ఆ ఫారాన్ని పూర్తి చేశాడు మూర్తి. మనసులో యేమిటో ఆరాటం యెక్కువైంది. లైటు తీసివేయడానికి కూడా బద్ధ కంగా వుంది. కళ్ళు మంటలు పుడుతున్నాయి. ఎవరైనా ఇంత వేడివేడి అన్నం పెట్టి దగ్గర కూచుని తినిపిస్తే బావుం డును-అన్న వూహా వస్తున్నది. పాపం మంచినీళ్ళు అతడు

తెచ్చి పెట్టిపోవటం మంచిదైంది. అలాగే యెన్నో వూహాలతో కళ్లు మూసుకున్నాడు. ఎప్పుడు నిద్ర పట్టిందో పట్టింది. ఎప్పుడు తెల్లవారిందో కూడా తెలీదు. అలానే నీరసంగా పడుకొని వున్నాడు. తెలుపురంగు కిటికీలోనుంచి వచ్చి గదంతా నిండిపోయింది. అతడికి కలలో జీవిస్తున్నట్లుగా వుంది.

నిద్రా కాదు, మెళుకువా కాదు, నీరసం, ఏమిటే మిటో అనుభూతులు. లేచి లైటుమాత్రం తీసివేసి మళ్ళీ పడుకున్నాడు. తెల్లవారింది. బయట వీధుల్లో కలకలం యెక్కువైంది. తూర్పు దిక్కున బయలుదేరిన సూర్యుడు కొంత దూరం ప్రయాణం చేశాడు.

ఎవరో సత్యన్నారాయణమూర్తి రూము ముందర నిలుచుని వాకిలి తలుపు తట్టారు. మూర్తి ఆ విషయం తెలుసుకునేందుకు నాలుగైదు నిమిషాలు పట్టింది. అతడు మాంసపు దుకాణదారుడేమో ననుకున్నాడు. నైకుంఠమేమోనని భయపడ్డాడు. అక్కయ్యని భ్రాంతిజెందాడు. రామారావని ఆశపడ్డాడు. పరంధామయ్యగారని మనసుకి బలం తెచ్చుకున్నాడు.

కాని వీరెవరూకాదు.

ఆ కంఠస్వరం వినేసరికి పుట్టలోని పాము మురళీరవం విన్నట్లైంది అతనిపని. ఆ కంఠ స్వరాన్ని చప్పున గుర్తుపట్ట గలడతడు. అతడికి ఒక సంతోషమైంది. ఒక దుఃఖ భావన కలిగింది. ఆ వచ్చిన వారెవరో కాదు. వసుధగారు.

అలానే లేచివెళ్ళి దగ్గరవేసివున్న తలుపునే తెరచి వచ్చి పక్కమీద కూచున్నాడు. వసుధ లోపలకు వచ్చింది.

ఆమె ఒక పక్కగా నిలుచునేవుంది. అతడు తల వంచుకుని కూచునివున్నాడు.

నిశ్శబ్దం మాటలు వెతుక్కుంటున్నది.

సత్యన్నారాయణమూర్తి తలయెత్తి చూచాడు.

ఆమె ముఖం కళావిహీనంగా వుంది. కనుగొనలందున దాచుకున్న కన్నీళ్లు అభిమానంకొద్దీ బయటకు రావటంలేదు. ఆమె అతడివేపు చూసింది. అతడు ఆమెవేపే చూస్తున్నాడు.

"మీరు కూచునేందుకు కూడా ఇక్కడ మంచి ప్రదేశం లేదు" అన్నాడతడు కాస్త దిగులుపడుతున్న స్వరంతో.

వసుధ మాట్లాలేదు.

"నాకు రెండు రోజుల నుంచీ యీ ప్రపంచం యెలా వుంటున్నదో తెలీయదు. అప్పుడప్పుడు కళ్లు తెరుస్తున్నాను. అంతమాత్రమే. కళ్లు మూసుకునే పడుకుని వున్నాను. అందువలన దుమ్మూ ధూళీ యిలా పేరుకునివుంది. చచ్చిపోతానేమోనని భయంవేసింది నిన్న. నన్ను చూసేవాళ్ళెవరున్నారని దుఃఖం వచ్చింది. నా కాశ్చర్యంగావుంది. మీరెలా వచ్చారు? ఎందుకు వచ్చారు. భగవంతుడు నాగురించి జాలిపడివుంటాడా? పోనీ యేమిటో చెప్పండి."

వసుధ కాసేపటిదాకా మాట్లాడలేదు.

తరువాత అతడిదగ్గరగా వచ్చింది.

"నా చెయ్యిపట్టుకుని లేవండి. కాసేపు అలా మెట్లమీద కూచుంటే గదిని శుభ్రం చేస్తాను" అని చెప్పింది.

సత్యన్నారాయణమూర్తి అలానే చేశాడు. గదిని శుభ్రపరచి, పక్క దులిపివేసింది వసుధ. సత్యన్నారాయణమూర్తి

వెళ్ళి గోడకానుకుని కూచున్నాడు...! "మీరు పడుకోండి. పంపు దగ్గర చేతులు కడుక్కుని వస్తాను" అని చెప్పింది వసుధ.

వచ్చిన తర్వాత "పోనీ మా యింటికి రాకూడదా? మరేం భయంలేదు. నాలుగు రోజుల్లో తగ్గిపోతుంది. మీరు వినలేదా? ఊళ్లో ఫ్లూ, ఫ్లూ అని చెప్పుకుంటున్నారు. దాని తాలూకై వుంటుంది. పోనీ సాయంకాలం నేను రానా - మా ఇంటికి పోదాం -" అన్నది వసుధ.

మూర్తి అందుకు వొప్పుకోలేదు.

వసుధ చెప్పింది: "ఇవాళ స్కూలుకి రెండు గంటలు ముందుగా రావలసి వచ్చింది. నాన్నగారన్నారు. పోనీ నువ్వే వెళ్లి ఆ కార్డు అతడి రూములో వేసిరామ్మా - అని. మీ అన్నయ్యగారు వ్రాశారట. నాన్న చదివారు. మీరు సమాధానమైనా వ్రాశారు కాదుట. పాపం, మీకు జ్వరం వస్తున్న సంగతి వాళ్లకు తెలిసివుండదు. అయినా ఆరోగ్యం సరిగ్గా కాపాడుకోవలసిన సంగతి మీకు తెలియదా? దూరాన వుంటున్నారాయె. చిన్న పిల్లలవలె తిరిగితే జర్వం పట్టుకోదా." సత్యనారాయణమూర్తి కళ్లనిండా నీళ్లు తిరిగినై. ఆత్మీయులైన వాళ్లు కోపంతో తిట్టినా యెదుటి వారి కళ్లలో నీళ్లు తిరగటంలోని ఆంతర్యం యిదే. తనకంటే చిన్నది. పైన ఆడపిల్ల అని అయినా సిగ్గులేకుండా సత్యనారాయణమూర్తి కళ్ళ నీళ్ళు పెట్టుకుంటే, వసుధ విస్తుపోయింది. ఆమెకు అతణ్ణి యెలా వోదార్చాలో కూడా తెలియలేదు. కాసేపటికి ఆమెకు పాపం అతడు హాస్పటల్లో వున్న తండ్రిని గురించి ఆలోచిస్తున్నాడేమో

నన్న భావం కలిగింది. "మరేం ఫరవాలేదు. నాన్నగారికి త్వరగానే తగ్గిపోతుంది లెండి" అన్నది.

అతడు అర్థం చేసుకోలేదు.

అతడిలోని వేదన అతణ్ణి నిశ్చింతతో వుండనీయలేదు. వెయ్యి శక్తులు లోపల విజృంభించి, తన హైన్యాన్ని ఆమె ముందు వెళ్ళబోసుకునేందుకు దోహదం చేసినయ్.

"మీరు నన్ను క్షమించగలరా?"

వసుధ జీవితంలో ఇదివరలో పొందనంత ఆశ్చర్యం పొందింది. ఆమె కళ్లు చిట్లించి, తన పుస్తకాలలోంచే కార్డు తీసి అతడిచేతి కిస్తూ, "నేను స్కూలునుంచి ఇంటికిపోయే ముందు వస్తాను. నాన్నగారికి చెబుతాను. ఆయన యెలా చెబితే అలా విందురుగాని" అని కదలబోయింది.

"మీరు పది నిమిషాలు వుండలేరా?" అన్నా డతడు.

ఆమె పెదవులమీద లేని చిరునవ్వును తెచ్చిపెట్టుకుని "ఎందుకు చెప్పండి" అన్నది. అన్నదేకాని ఆమె స్వరంలో ప్రసన్న భావం లేనేలేదు.

"అలా నా పెట్టెమీద కూచోండి" అన్నాడతడు.

"నాకు టైమయినట్లుగా వున్నది" అన్నది వసుధ.

"సరే మీరు వెళ్ళండి. సాయంకాలం మాత్రం తప్పక నోసారి వస్తే చెపుతాను. ఈ లోపున చచ్చిపోతే విషయం తెలియకపోయినా నన్ను క్షమించండి" అన్నాడు మూర్తి.

ఆమె కనిపించినా, అంతకన్నా యెక్కువ అసహ్యం ఆమెను వశ్యురాలను చేసుకుంది. ఆ క్షణాన అతడు అలా మాట్లాడకపోయినట్లైయితే ఆమె ఆ రోజుకు స్కూలుకు

సెలవు పెట్టేది. అతణ్ణి ఇంకా యెక్కువ ప్రేమించి వుండేది. అలానే దిగులుగా, దీనంగా, బరువుగా, బాధగా ఒక ప్రక్కన ఆర్ద్రత, ఒక ప్రక్కన అసహ్యం హృదయంలో సందడించగా ఆమె గదిలోంచి బయట పడింది. కాని అతడి నీళ్ళునిండిన కళ్లూ, యేడ్పు నణచుకుంటున్న స్వరమూ, ఒక్క మెట్లమీదనే కాకుండా, క్లాసులో పుస్తకం తీసుకుని, గోలచేస్తున్నాడన్న నెపంతో, ఇంకో చిన్నపిల్లవాణ్ణి యేడ్పించినదాకా ఆమెను వెన్నంటుతూనేవున్నాయి. ఎన్నడూ లేంది ఆ చిన్నపిల్లాణ్ణి వాళ్ళోకి తీసుకుని "అల్లరి చేయకూడదు కదమ్మా. అల్లరిచేస్తే దెబ్బలు తగలవూ" అని అనునయిస్తుంటే ఆమె కళ్ళల్లోని నీళ్ళను సంభ్రమాశ్చర్యాలతో పరిశీలించి ఆ చిన్న హృదయాలు మూగపడిపోయినయ్. ఎప్పుడూ పిల్లలను కొట్టను – అనుకుంది వసుధ.

క్లాసులో కూచున్నదే కాని, ఆమె మనసు పశ్చాత్తాప పడసాగింది. అతణ్ణి తాను ఓదార్చి వుండవలసింది. మధ్యాహ్నం అతడి రూముకు వెళ్ళాలనుకున్నా ఆమె వెళ్ళలేకపోయింది. ఆమె కెందుకో దిగులయింది.

సత్యన్నారాయణమూర్తి వసుధ వెళ్ళిపోగానే చాలా నిరీహుడైపోయినాడు. ఈ సంఘటన అతడికి చాలా విచిత్రంగా కనపడసాగింది. సాయంకాలానికి వసుధ మళ్ళీ తన వద్దకు రావాలని హృదయంలో వెయ్యిసార్లు కోరుకున్నాడు. తొమ్మిది గంటలప్పుడు మాంసపు దుకాణపతడు పైకివచ్చాడు. సత్యన్నారాయణమూర్తి కతడిని చూడగానే సంతోషమైంది. జ్వరం తగ్గిపోయింది అని చెప్పాడు. అతడుకూడా సంతోష

పడ్డాడు. కాస్త బ్రెడ్ తెచ్చిపెడతాను అని చెప్పి సత్యన్నారాయణమూర్తి చెప్పేది వినిపించుకోకుండా వెళ్లిపోయాడు. సత్యన్నారాయణమూర్తి రాత్రి తాను పూర్తిచేసిన అప్లికేషను ఫారము చూసుకున్నాడు. మూర్తికి వొంట్లో కాస్త నీరసం తగ్గింది. ఆట్టే జర్వంకూడా అలేనట్లుతోచింది. ఇంతలో అతడు వచ్చాడు. ఆ బ్రెడ్ ఇంత తిని, అతడు తీసుకునివచ్చిన టీ కాస్త త్రాగి మూర్తి తేరుకున్నాడు. అయినా అతడి మనసున దిగులు పీకుతూనే ఉన్నది. ఏమిటో చెప్పలేని అసంతృప్తి పీడిస్తున్నది. ఆ అప్లికేషన్‌ఫారం మాంసపు దుకాణాదారున కిచ్చి, అడ్రసు వేరే కాగితంమీద వ్రాసి ఇచ్చి రిజిష్టర్డు పోస్టులో పంపమని ప్రాధేయపడి చెప్పాడు. అతడు సరేనని చెప్పి పోయాడు.

సాయంకాలం వసుధ వచ్చింది.

ఆమె వదనమంతా మేఘాచ్ఛన్నమైవుంది. దుఃఖం ఆమె ముఖంలో ప్రస్ఫుటంగా కనపడుతున్నది.

సత్యన్నారాయణమూర్తి ఆమెను చూసి విచలితుడైనాడు. వసుధ వచ్చి రాగానే "మీ వంట్లో ఎలా వుంది. మా యింటికి రాగలరా?" అని ప్రశ్నించింది.

"అవును కాస్త తగ్గిపోయింది. అందుకనే కళ్ళు తెరచుకొని వున్నాను. కింద మాంసపు దుకాణమతడు వున్నాడు చూశారా? అతడంటే నాకు ఇదివరలో చెప్పలేని అసహ్యం. చూశారా - నేను ఎప్పుడైనా అనుకున్నానా! అతడే నన్ను ఆదుకోవాలని. మరి చిత్రమైంది ప్రపంచం. ఎందుకు పుడుతున్నామో, ఎలా బ్రతుకుతున్నామో ఎవరు ఎవరికి దొరుకు

తారో, యెవరి అదృష్టం యెలావుందో, ఎవరు ఎప్పుడు ఎలా చచ్చిపోతారో యెవరూ చెప్పరుగదా ? ఏ మనిషి యెన్ని పాపాలు చేయాలో అతడికే తెలియదు గదూ - కూచోండి."

అంత విచారంలోనూ వసుధ ముఖంలో హాస రేఖ తళుక్కున మెరిసింది. సత్యన్నారాయణమూర్తి ముగ్ధుడై పోయినాడు. "మీరు యెప్పటినుంచి వేదాంతులైనారు. ఇంత వేదాంతం మీకు తెలుసునని నాకు తెలీదు. చూడండి. జీవితాన్ని గురించి నేను ఆలోచించను. ఎందుకంటారా, ఆలోచిస్తే వొక్క అడుగు ముందుకు వెయ్యలేము. కళ్లు వాచిపోతాయి. భోజనంచేస్తే ఆకలి తీరదు. కళ్ళు మూసుకుంటే నిద్రపట్టదు. ఏమిటేమిటో ఆలోచించి యెందుకేడవాలి చెప్పండి ? ఒక్కొక్క రోజుపోయి ఒక్కొక్కరోజు వస్తుంటే చాలును నాకు. అంతకంటె యెక్కువ నేనేమీ కోరుకోను. ఎలాగూ ఒకరోజుపోయి ఒకరోజు రాక యేం చేస్తుంది ?"

వసుధ తాపీగా కూచుంది.

సత్యన్నారాయణమూర్తి అడిగాడు !

"ప్రొద్దున నన్ను క్షమించగలరా ? అని అడిగితే మీ కెందు కంత కోపం వచ్చింది చెప్పండి ?"

వసుధ మౌనంగా వూరుకుంది. అతడు మళ్ళీ అడిగాడు.

"అంత బలహీనులైన మనుషులను చూస్తే నాకు కోపమూ అసహ్యమూ."

"చెపుతాను వినండి."

సత్యన్నారాయణమూర్తి జరిగిన కథ యావత్తూ యెక్కువ విశేషణాలు లేకుండా చెప్పాడు. వైకుంఠంతో తన

పరిచయమూ, తాము వెళ్ళి అవాళ సాయంకాలం చేసిన ఘన కార్యం, అన్నీ చెప్పాడు.

వసుధ అంతా విని నిట్టూర్చింది.

"చాలా గొప్పపని చేశారు" అన్నది వాత్సల్యమూ, అభిమానమూ, ప్రేమా మేళవించి చెప్పుతున్న స్వరంతో.

"ఒకటి చెపుతాను వింటారా ?" అన్నది.

"చెప్పండి" అన్నాడు? అతడు పెద్ద బుద్ధిమంతుడిలాగా.

"నవ్వులాటకు కాదు చూడండీ! అసలు నా తత్వానికే సరిపడ దది. నాకు తెలిసినంతమటుకు ఇంతవరకు యెవరితోనూ పరిహాసప్రసంగము చేయలేదు నేను. ఏమిటంటారా? త్వరగా పెళ్ళి చేసికోండి. మీకు తోడు అవసరం. మీ రొక్కరూ బ్రతకలేరు. నిజానికి మీరు చాలా చిన్నపిల్లలలాటివారు. మీకు స్నేహం కావాలి. అంటే యెలా చెప్పమంటారు! ఎవరో యెప్పుడూ వెన్ను నిముకుతూ ముందు దారి చూపుతుండాలి. కన్నీళ్ళు రాకుండా చూడాలి. అథవా వస్తే చందమామను చూపి చిన్న పిల్లలను బుజ్జగించినట్లు బుజ్జగించాలి. ఈ అభిప్రాయం నావొక్కర్తెది కాదు." వసుధ యెంత దాచుకుందామన్నా ముఖంమీది చెంగలింపుని దాచుకోలేకపోయింది. సిగ్గులాటి అపరిచితభావం బుగ్గమీద ప్రసరించింది. కళ్ళు అదోరకమైన కాంతి తెచ్చుకున్నాయి.

ఆమెకంటె సిగ్గుపడిపోయాడు సత్యనారాయణమూర్తి. ఆమె అలా మాట్లాడుతుందని అతడు యెన్నడూ అనుకొని వుండడు. అతని కళ్లలో నీళ్ళు నిండుకొచ్చాయి. ఈ ప్రపంచంలో కొన్ని దుర్బలమైన ఆత్మలు ఉన్నాయి.

ఆ ఆత్మల కెప్పుడూ ఒక చల్లటి పలకరింపు, ఒక అభిమానంతో కూడిన పరామర్శ కావాలి. వాటికోసం యెప్పుడూ తహ తహ లాడిపోతారు. తపన పడతారు. ఆ విషయం వాళ్ళకు తెలవక పోవచ్చును.

సత్యన్నారాయణమూర్తికి వొంట్లో యెంతో బలం వచ్చినట్లయింది. నిజమే అతడికి స్నేహం కావాలి. తన యావత్తు భారమూ యెవరైనా మీదవేసుకుని తనని చిన్న పిల్లవాడి లాగా చూసుకుంటే అంతకంటే ఇంకేమి కావాలి తనకు. వసుధ నిజమే చెప్పింది. ఆమెవేపు ధైర్యంగా చూడలేక పోయాడతడు. ఆమె హృదయంలో తాను ఇలా మాటాడి నందుకు యెంతో సిగ్గుపడి పోయింది.

"ఇంకా యెవరెవరు ఇలా అభిప్రాయ పడుతున్నారో చెప్పండి" అని అతడు నవ్వాడు. వసుధ ఆ విషయమే గనుక ముందు చెప్పివుంటే అతడు నవ్వగలిగేవాడు కాదసలు.

"మీ అక్కయ్యగారు. ఇంతకుముందు కనిపించారు. చెప్పాను. చూడండీ యెలాగైనా మేము ఆడవాళ్ళం. అంత తేలిగ్గా బంధనాలు తెంచుకోలేము. ఆమె దుఃఖించూసి వున్నట్లయితే ఆమెకు యెంత అన్యాయం చేస్తున్నారో తెలిసి వుండేది మీకు. ఆమెకూడా ఇలానే అభిప్రాయపడింది."

ఒకసారిగా ఆతడిలోని ప్రసన్నభావం అంతరించి పోయింది.

"మా అక్కయ్య అలా అన్నదా ?" అన్నాడతడు. అలా అనివుండే వాడుగాదు. తొందరలో అలా అన్నాడు.

"పోనీండి ఇప్పుడు మిమ్మల్ని మాయింటికి తీసుకు వెళ్తాను."

"అంత శ్రమ అవసరం లేదులెండి."

ఆమె కుపితస్వరంతో "నామాట వినక తప్పదు. ఇప్పుడు నాతో రాకపోయినారా, మీ అక్కయ్యగారిని పిలుచుకొని వస్తాను" అన్నది.

అతడు మారుమాటాడలేదు.

ఆమె క్రిందికివెళ్లి రిక్షాను పిలుచుకుని వచ్చింది. రిక్షా అలా నేవుంది. వసుధకంటె ముందుగా వైకుంఠం మెట్లు యెక్కి వచ్చాడు. సత్యన్నారాయణమూర్తి వణికిపోయాడు. అతడి ముఖం వెలవెలపోయింది. వైకుంఠం అతడిదగ్గరగావచ్చి ముఖం మీదను, రొమ్ముమీదను చేయివేసి చూశాడు. నాతో రా - అని చెపుతున్నాడు. ఇంతలో వసుధ రానేవచ్చింది. వైకుంఠం వసుధను చూశాడు. సత్యన్నారాయణమూర్తికేసి చూసి అసహ్యంగా నవ్వాడు.

"నీ జబ్బు వుట్టినే నయమౌతుంది. నా కెప్పుడూ చెప్పావుకాదు. భలే అదృష్టవంతుడివి."

వసుధ సత్యన్నారాయణమూర్తిని "తాళం యెక్కడ వుందో చెప్పండి. వెళ్ళిపోదాం" అన్నది.

దానికి వైకుంఠం, "యెక్కడికి" అన్నాడు. సత్యన్నారాయణమూర్తి సమాధానం చెప్పలేదు.

"మీరు వెళ్ళిపొండి. ఎక్కడికైతే మీ కెందుకు? మీ రెవరో నాకు తెలిసింది" అంది వసుధ కోపంతో.

వైకుంఠం ఆమె మాటలకు అసహ్యంగా నవ్వుతూ, సత్యన్నారాయణమూర్తితో "పులిని మచ్చిక చేస్తున్నానని నాతో మాటమాత్రం అనలేకపోయావ్? నిన్ను బాగు చేద్దామన్న తాపత్రయం నాకుండేదికాదు. నువ్వే ఘనుడవి. రైట్, విష్ యు గుడ్ లక్..." వైకుంఠం నవ్వుకుంటూ మెట్లు దిగిపోయినాడు. వసుధ కోపంతో పెదవి నొక్కిపట్టి బుద్ధిహీనుడు, గాడిదలాంటి పదజాలాన్ని మనసులో మననం చేసుకుంటూ గొణుక్కుంది.

ఆమె చెయ్యి పట్టుకుని సత్యన్నారాయణమూర్తి మెట్లు దిగాడు. రిక్షాలో యిల్లుచేరుకున్న తర్వాత సత్యన్నారాయణమూర్తికి పరంధామయ్యగారి చనిపోయిన చిన్నపిల్లవాడు గుర్తువచ్చినప్పుడు, ఆపుకుందామన్నా ఆగకుండా దుఃఖం వచ్చింది. పరంధామయ్యగారు యెంతో ఆదరం కనపరిచారు. ఆమె— ఆ ఇంటి ఇల్లాలు అతణ్ణి చూసి యెంతో జాలిపడ్డది. కాని సత్యన్నారాయణమూర్తికి పదేపదే ఆ పిల్లవాడు కళ్ళలో మెదులుతున్నాడు. అతడి కిప్పుడు చచ్చిపోతానేమో నన్న భయం పోయింది. దుఃఖం పోయింది.

నాలుగు రోజుల్లో అతడు కోలుకున్నాడు. కాని మామూలు మనిషి కాలేకపోయినాడు.

కాని ఇంతలోకే వొక మరదృష్టం సంభవించింది. తెనాలినుంచి సత్యన్నారాయణమూర్తిని వెంటనే రమ్మని టెలిగ్రాం వచ్చింది.

ఆవాళ సాయంకాలం అతణ్ణి రైలెక్కించి ఇంటికి వచ్చిన తండ్రిని "నాన్నా అతడికి మీరు బాగా ధైర్యం చెప్పారుకదూ" అని అడిగింది వసుధ.

# 12

చాలా రోజుల తరువాత సంగతి.

సరోజినికి వొంట్లో బావుండటంలేదు. ఆరోగ్యం అలానే వుంది. పైన మానసికమైన బాధలు రోజురోజుకూ ఆమెను కృంగదీస్తున్నాయి. ఒకరోజున ఆమెను హృదయానికి చేర్చుకుని శ్రీనివాసమూర్తి అడిగాడు: "నువ్వెందుకు బాధ పడుతున్నావు. నీ బాధ యేమిటో నాకు చెప్పరాదా? నువ్వు చెప్పకపోతే నేను యెంత బాధపడతానో వూహించలేవా? నేననుకుంటాను అప్పుడప్పుడు – నువ్వు నాతో వచ్చినందుకు ఇప్పుడు కుమిలిపోతున్నావు. అదే నీ బాధ. పశ్చాత్తాప పడుతున్నావా – అందుకేనా నీ దుఃఖం. నిన్ను నేనెలా దక్కించుకోవాలి చెప్పు. ఇలా కృశించిపోతే కొన్నాళ్లకు నాకు మిగలవేమో ననిపిస్తున్నది. అప్పుడు నేనెలా బ్రతకాలి?"

సరోజిని వెక్కి వెక్కి యేడ్చింది.

"ఇంకెప్పుడూ ఇలా అనుకోనని, అనని మాట యివ్వండి. నామీద వొట్టే. నాకు కవిత్వం రాదాయె; మిమ్మల్ని మాటల్లో వర్ణించుకునేందుకు. నా అదృష్టం యెంత మందికి పడుతుందండి! బహుకొద్దిమందే వుంటారు నా అంత అదృష్టం కలవాళ్లు. పూర్వజన్మ సుకృతము, అదృష్టం, నోచు

కున్న నోములు అంటారే అలాటివేవైనా వుంటాయని విశ్వసిస్తే, పూర్వజన్మలో నేను సుకృతం చేశానని, మంచినోములు నోచానని, భగవంతుణ్ణి బంగారు పూలతో పూజచేశానని అనుకోవాల్సి వుంటుంది. అయితే పూజలో యెక్కడో లోపం వుండివుంటుంది. అందుకనే మధ్యమధ్య ఇలాటి బాధలు. నేనేం చిక్కిపోతున్నాను. మీ కళ్ళకు అలా కనిపిస్తున్నానేమో కాని, నిజానికి ఇదివరలోకన్నా ఇప్పుడే నేను బాగున్నాను" అన్నది సరోజిని యేడుపులాటి నవ్వుతున్న స్వరంతో.

"రేప్రొద్దున హాస్పిటలుకు తీసుకుని వెళ్తాను నిన్ను. ఆఫీసుకు శెలవు పెట్టాను. గవర్నమెంటు హాస్పిటలులో డాక్టరు నా స్నేహితుడొకడు వున్నాడు. ఏమంటావు. ఒప్పుకోకపోతే నేను నీతో అసలు మాటాడను."

"ఎన్ని రోజులు మాట్లాడరో చెప్పండి ప్రభూ !"

"ఎప్పటికీ..."

"అమ్మో నేను బ్రతకగలనా ? అయినా పంతానికి చూదాం. ఒక్క గంటసేపు నాతో మాటాడకుండా వుండండి."

అతడు నవ్వాడు.

చుబుకాన్ని బుజంమీద రాస్తూ అతడి కంఠాన్ని రెండు చేతులతోనూ చుట్టి "తప్పకుండా వెళ్దామండీ" అన్నది సరోజిని. కాని సరోజిని హాస్పిటల్‌లో తన కలాటి సంఘటన ఎదురవుతుందని తలిస్తే పోవటానికి వొప్పుకునేది కాదు. ఆమె అతిలోకంగా అలంకరించుకుంది. అతడి పక్కనే కూచుని

హాస్పిటల్‌కు వెళ్ళింది. కాని ఆమెకు తెలీదుగదా దురదృష్టం తన వెనుకనే నడచివస్తున్నదని.

ఆమె తన కళ్ళను తాను నమ్మలేకపోయింది. కాని ఆమె జీవితంలో అటువంటి దృశ్యాలు కేవలం ఆమెకు కొత్తవి కావు. ఆమె బాటలో అలాటి ఆఘాతాలు కొన్ని కొన్ని అధిగమించి వచ్చింది. అయితే యీ దృశ్యం ఆమెను ఎంతగా విచలితురాలిని చేసిందంటే, చెప్పలేనంతగా చేసింది. ఆమె నిల్వలేకపోయింది. కళ్లు తిరిగిపోయినయ్. ఆవరణదాటి వరం డాలో అడుగు పెట్టగానే యీ దృశ్యం ఆమెకంట పడ్డది. ఆమె నవనాడులూ కృంగిపోయినయ్. ఒక్కసారిగా మృత్యువు హఠాత్తుగా యెదురు వచ్చినప్పుడు మానవుడు ఎంత భయ విహ్వలతలకు లోనవుతాడో అంతగా ఆమె చలించిపోయింది.

వరండాలో క్యూలో మందులు తీసుకొనిపోవడానికి రోగ గ్రస్థులూ, రోగగ్రస్థులకు సంబంధించిన వాళ్లూ అంతా నిల్చుని వున్నారు. అందులోఆమెకు పెద్దతమ్ముడుకన్పించాడు. బొమికల గూడులా, పిచ్చివాడులా తల్లి చనిపోయినప్పుడు యెంత దైన్యా వస్థలో కనపడ్డాడో అంతకంటే సర్వం పోగొట్టుకున్నవాడిలా చొక్కాకు గుండీలు లేవు. కాళ్ళకు పాదరక్షలు లేవు. వేసు కున్న పైజమా చిరిగిపోయివుంది. తలంతా శుభ్రంగా గొరి గింపబడి వుంది. కాని ఆమె తమ్ముడుకాడని మనసు సరిపెట్టు కుందామని తలచింది. కాని ముఖం పక్కకు తిప్పేసరికి అక్క డున్న చిన్న బెంచీమీాద చిన్న తమ్ముడు వాసు కనిపించాడు. వాడు యింతకంటే దైన్యావస్థలో వున్నాడు. మృత్యువు

వాళటి రెండు రోజుల్లో యెత్తుకుపోవటానికి తయారయిన వాడిలా వున్నాడు. ఆమెకు కెవ్వున కేక లేయా లనిపించింది.

తమ్ముళ్ళు అలా ఎందుకువున్నారో ఆమెకు క్షణంలో తెలిసిపోయింది. ఇంకా వాళ్ళు తనకు సంబంధించినవాళ్ళు కాదేమోనన్న ఆశ ఎక్కడో యే మూలో మినుకుమినుకు మంటూంటే, ఆమె కంఠానికి యమపాశం తగిల్చి యీడ్చి నట్లుగా బెంచీమీద కూర్చున్న ఆ మృత్యువు కబళిద్దామని చూస్తున్న కుఱ్ఱవాడు అక్కయ్యా, అని చెప్పలేనంత సంతోషంతో, బలమంతా కూడగట్టుకుని, కడుపులోంచి మాట తెంచుకుని, అవ్యక్తమైన ఆనందం ముఖాన్ని కలిగించగా, ఆవుదూడ అంబా అని అరచినట్టు అరిచాడు.

సరోజిని విరుచుకుని పడిపోయింది.

శ్రీనివాసమూర్తికి కళ్ళముందు నల్లటి పొరలుదిగవేసి నట్లు, కత్తులు తళతళలాడిపోయినట్లు, పాములు మెలికలు మెలికలు తిరిగి బుసలుకొట్టినట్లు, తాను బ్రతికివుండగానే, యెవరో మోసుకుని వెళుతున్నట్లు – మనస్సు, మనస్సు... చెప్పింది.

అందరి ముందరనే ఆమెను బలమంతా వుపయోగించి లేవదీసి హృదయానికి అదుముకుని సరూ, సరూ, సరూ... డాక్టరుగారూ...

ఆమె బెడ్ మీదకు చేర్చబడ్డది.

మరేమీ భయంలేదంటాడు డాక్టరు.

నవ్వు దిగులుగా నవ్వుతుంది. శ్రీనివాసమూర్తి కళ్ళ వెంట నీళ్ళు నవ్వుకి తుడుద్దామనిపిస్తుంది. అతడు తుడుచుకోడు.

డాక్టరు అతణ్ణిచూసి చిరునవ్వుతో "ఏమీలేదు".

అయినా ఆతడు కళ్ళు తుడుచుకోడు.

నవ్వుహృదయంలో యీర్ష్యలాంటి, దిగులులాంటి, ప్రేమలాంటి, అసూయలాంటి, మంచి తలంపులాంటి అనుభూతి.

సరోజిని కళ్ళు తెరచి "ఏమిటీ ఇదంతా—" అన్నది.

శ్రీనివాసమూర్తి ప్రక్కనకూచుని నోటమాటరాక తదేకంగాచూస్తూ వుండిపోయాడు.

సరోజిని మందు తాగి ఆవరణలో కారుదగ్గరకు భర్త నానుకుని నడుస్తున్నప్పుడు వరండా దాటినదాకా కళ్ళుమూసు కుంది. కారు యెక్కుతున్నప్పుడు వెనక్కుతిరిగి చూసినప్పుడు వరండాలో అంతపొడుగు క్యూ వుందిగాని బెంచీమీద అంగా అని అరచిన కుజ్జువాడు లేడు.

దారిలో శ్రీనివాసమూర్తి అడిగాడు సరోజినిని "ఏమిటైంది" అని. ఆమె సమాధానం చెప్పలేదు.

ఇంటికి వెళ్ళగానే మళ్ళీ అడిగాడు వొళ్ళోకి తీసుకుని.

"కళ్ళుతిరిగినై" అని మాత్రమే చెప్పింది సరోజిని.

అవాళంతా శ్రీనివాసమూర్తి ఆమెను విడిచి వొక్క క్షణంకూడా యెక్కడకూ పోలేదు.

మర్రోజు అతడు ఆఫీసుకు పోనంటే బ్రతిమిలాడి, భంగ పడి సరోజిని, అతడు ఆఫీసుకు వెళ్ళేట్టుచేసింది. సాయంకాలం ఏడుగంటల ప్రాంతంలో ఒకరోజు తాను వసుధతో కలసి వచ్చి చూసిపోయిన చెప్పల్ బజార్‌లోని, మాంసపుదుకాణపు పై భాగంలోగల, చెక్కమెట్లు యెక్కిపోవాల్సిన రూమునద్దకు వచ్చింది. 'ఆ' అని నిర్లిప్తతతో వొక్కొక్క మెట్టేయెక్కి

క్షణంసేపు గది తలుపుల ముందర నిలుచుంది. కాని ఆమె హృదయంలోని వాత్సల్యం యెక్కువసేపు ఆమెను నిలువనివ్వ లేదు. తటపటాయించటానికి ఆస్కారం ఇవ్వలేదు. తలుపులు త్రోసుకుని లోపలకు వెళ్ళింది.

వాసువచ్చి కాళ్ళు చుట్టుకున్నాడు.

"అన్నయ్య యేడమ్మా వాసూ?"

"ఏమో నాకేమీ తెలీదు. ఎప్పుడో వస్తాడు. ఎప్పుడో పోతాడు."

నిశ్శబ్దంగా యెంతోసేపు ఇద్దరూ యేడ్చారు.

ఆమె వాణ్ణి తండ్రి మృతిని గురించిన యెన్నో ప్రశ్నలు అడగాలనుకుంది. కాని, ఆ చిరుహృదయాన్ని భయంకరమైన తలంపులతో మళ్ళీ గాయపరచడం యిష్టంలేక నోరు నొక్కుకుని వూరుకుంది. అయినా యెంత నిగ్రహించుకున్నా, హృదయంలోనే యెంత అణచిపెట్టుకున్నా "నాన్న నా గురించి యేమన్నా అనుకున్నాడమ్మా వాసూ?" అని అడగకుండా వుండలేకపోయింది.

వాసు వెక్కి యేడుస్తాడేమోనని వాణ్ణి గట్టిగా హృదయానికి హత్తుకుంది. కాని వాడు యేడవలేదు.

ముఖం చిట్లించి "ఏమో నాకు తెలియదక్కయ్యా. హాస్పిటల్‌నుంచి సాయంకాలం వచ్చాను. మామూలుగానే నిద్రపోయాను. ఒక రాత్రివేళ పెద్దన్నయ్య నన్ను లేపి యెత్తుకుని పెద్దగా యేడ్చాడు. అప్పుడు నాకు తెలిసింది.

"అన్నయ్యా యేడ్చి మన మేంచేస్తాము. అమ్మ చనిపోయినప్పుడు యేం చేశాము. మనం పాపంచేసుకున్నా

మన్నయ్యా-" అన్నాను. అన్నయ్య నా మాటలు విని మరీ పెద్దగా యేడ్చాడు."

వాసు చెప్పాడు.

సరోజిని వెక్కి-వెక్కి యేడ్చింది. దుఃఖాన్ని యెంత ఆపుకుందామన్నా ఆమెకు సాధ్యం కాకపోయింది.

వాసు చెప్పాడు.

"మర్రోజు సాయంకాలానికి చిన్నన్నయ్య రాలేదు. అందరూ ఎంతో ఇదిగా చెప్పుకున్నారు. నేను చూడలేదు. తరువాత ఎప్పుడో చిన్నన్నయ్య వచ్చాడు. మన బజారులో చిన్నన్నయ్యకు పిచ్చిపుట్టిందని అంతా అనుకున్నారు. చిన్నన్నయ్య ఇక్కడికి వచ్చేటప్పుడు "నాతో వస్తావమ్మా వాసూ" అని డడిగాడు. నాకు అక్కడ వుండటం బాగాలేదు. పైన ఇక్కడకు వస్తే యెప్పుడైనా నువు కనపడకపోతావా? అని ఆశ కలిగింది. చిన్నన్నయ్యతో వచ్చేశాను. నువు కనపడ్డావు. అక్కయ్యా, నేను నీ దగ్గరవుంటే నీకు కష్టంగా వుంటుందా?"

"నేను చచ్చిపోయానమ్మా - నా నాన్నా... నేను పాపిష్టిదాన్ని. నా తండ్రీ నిన్ను నాతో తీసుకుపోతాను. నా దగ్గరే వుంచుకుంటాను, ఏమైనాసరే. నేనెంత చెడ్డ దాన్నమ్మా- నాకు భగవంతుడు చావైనా రాసి పెట్టాడు గాడు..."

వాసు అక్కయ్య నోరు చేతితో మూశాడు.

సరోజిని యేడుస్తూనే వుంది.

కాయుడ్రైవరు పైకివచ్చి యీ దృశ్యాన్ని చూసి విచలితుడై పోయినాడు. "అమ్మా అయ్యగారు ఆఫీసునుంచి వచ్చి యెంతోసేపు అయివుంటుంది, పోదాం రాండి" అని పిలిచాడు.

అయినా సరోజిని వాసును వదలిపెట్టి వెళ్ళలేకపోయింది.

"నువ్వు అన్న మెక్కడ తింటున్నావమ్మ వాసూ" అని అడిగింది.

"బొత్తిగా ఆకలివుండదు అక్కయ్యా. చిన్నన్నయ్యను చూస్తే దిగులవుతుంది. ఎప్పుడో అన్నయ్య హోటలుకు తీసుకవెళ్తాడు. తాను యెప్పుడు తింటాడో, తినడో, నాకాకలి లేదనో, నే నిదివరకే భోజనం చేశాననో చెపుతాడు. నేనేదో కాస్త తినివస్తాను. ఇక ఇద్దరమూ పడుకుంటాము ఒకరికి తెలియకుండా ఒకరం యేడుస్తూ వుంటాము. నాకు తెలియకూడదని చిన్నన్నయ్యా, చిన్నన్నయ్యకు వినపడకూడదని నేనూ యేడుస్తూనే వుంటాము."

సరోజినికి కడుపు తరుక్కుపోయింది.

తన మూలాన ఆ కుటుంబం ఇలా నాశనమైందని యెవరో రాక్షసుడు తన యెదురుగా నిలబడి విషదృష్టులతో, వికృత హాసంతో చెపుతున్నట్లు ఆమె గజగజ వణకిపోయింది. ఆమె అలా యెంతసేపు కూచుందో ఆమెకే తెలీదు. సత్యన్నారాయణమూర్తి వచ్చాడు. అక్కయ్యను చూడగానే ఇదివరలోవలె అతడి హృదయంలో మాత్సర్యం పొడసూపలేదు.

భోరున యేడ్చాడు.

సరోజిని పెద్దతమ్ముడి చెయ్యి పట్టుకుని దగ్గర కూర్చో బెట్టుకుంది. ఒళ్ళంతా నిమిరింది. ముగ్గురూ కలిసి యేడ్చారు.

"నాన్నా నేను పాపిష్టిదాన్నిరా మంచిదాన్ని కాదు. నా వల్ల నేకదూ మీకిన్ని కష్టాలు వచ్చినై" అన్నది సరోజిని.

"నువ్వేం చేసేవు అక్కయ్యా! నేనింత దూరం రాకుండా వుండాల్సింది. పాపం అన్నయ్య వొక్కడూ వొంటరి వాడై పోయాడు." సరోజినికి పొర్లిపొర్లి దుఃఖం వచ్చింది.

"అన్నయ్యనుకూడా నీవెంట తీసుకరాక పోయినావా—" అన్నది సరోజిని.

"రమ్మన్నాను కాని వినలేదు. అటెటో ఐదారు నెలలపాటు దేశంమీద తిరిగొస్తానని వెళ్ళిపోయాడు."

"నాయనా నేనేదో తప్పుచేశాననే అనుకుందాం. అంతా ముగిసి పోయిందికదూ. మనం కష్టదశలో వున్నప్పుడు లోకం సానుభూతి చూపదు. అవహేళన చేస్తుంది. మనం బాగా వున్నప్పుడు ఆశ్రయింపు కోసం ప్రాకులాడుతుంది. అటువంటిది లోకంకోసం మీ అక్కయ్యను వదులుకుంటావా? ఒకే రక్తాన్ని పంచుకొని పుట్టిన వాళ్ళము కాదా మనం. అయినా మారిపోతున్న కాలంతో మనుష్యులుకూడా మారి పోవాల్సిందేగదా – లేకపోతే కష్టాలు తప్పవు. నన్ను సానుభూతితో అర్థం చేసికొని వున్నట్లయితే ఇన్ని కష్టాలు వచ్చేవే గావు. ఏవేవో పెంచుకుని నాకు దూరమైనారు. నేను దూరమైనాను."

వాసుచు కార్లో తన పక్కనే కూచోబెట్టుకుని సరోజిని వెళ్ళిపోయింది. సత్యన్నారాయణమూర్తి అలానే నిర్లిప్తుడులా

వుండిపోయాడు. సరోజిని ఇంటికి వెళ్లేసరికి శ్రీనివాసమూర్తి పిచ్చిపట్టినవాడిలా కూర్చున్నాడు. సరోజినిని చూడటంతో మళ్ళీ అతడి పంచప్రాణాలు వాటివాటి స్థానాలు చేరుకున్నాయి.

కొద్ది రోజుల తరువాత సంగతి.

సత్యన్నారాయణమూర్తి తిరిగి తిరిగి రూముకు చేరుకున్నాడు. మాంసపు దుకాణ దారుడు ఇతడి కోసమే ఎదురుచూస్తున్న వాడులా వచ్చి వొక కవరు ఇచ్చిపోయాడు. రిజిష్టరు కవరు. రిసీటుమీద సంతకం చేయించుకుని ఆ కాయితాన్ని అతడు తీసుకున్నాడు. తాను మర్రోజు పోస్టుమాన్ కిస్తానని చెప్పివున్నాడు. సత్యన్నారాయణమూర్తి ఆ కవరు చించి చదువుకుని ఆశ్చర్యపడవలసిన విషయమైనా ఆశ్చర్యపడ లేదు. జీవితంలో యెన్నోరకాల దుఃఖ సంఘటనలను యెదుర్కొన్న తర్వాత ఉత్సాహం ఎక్కడనుంచి వచ్చేను? నిర్లిప్తతతో ఓహో అనుకున్నాడు. అతడికి అప్పాయింట్ మెంట్ ఆర్డరు వచ్చింది. ఫార్మల్ గా ఇంటర్వ్యూకి రమ్మన్నారు. అందులోనే వుంది ఆ సంగతి. సంతోషపడ లేదతడు యెక్కువగా. కాస్తో కూస్తో సంతోషపడ్డాడు. చిత్ర విచిత్రమైన అనుభూతుల మధ్య ఆ రాత్రి యెలానో నిద్రపోయినాడు.

ప్రొద్దున్నే అక్కయ్యకు వినిపించాడు మొట్టమొదట. తరువాత పరంధామయ్యగారింటికి వెళ్లాడు.

వసుధ కళ్ళు మిలమిలా మెరిసినయ్.

ఇంటర్వ్యూకు వెళ్ళవలసిన రోజు రానేవచ్చింది.

గది ఖాళీచేసి పరంధామయ్యగారింట్లో పెట్టె బెడ్డింగు పెట్టాడు. సరోజిని రమ్మని తమ్ముణ్ణి యెంతగానో కోరింది.

కాని, పరంధామయ్యగారు అక్కా తమ్ముళ్ళ నిద్దర్నీ వొప్పించాడు, సత్యన్నారాయణమూర్తి ఆ రాత్రి తమ యింట్లో వుండేట్లు; అక్కడినుంచే బయలుదేరిపోయేట్లు.

పరంధామయ్యగారి కవాళ్లా యేమీ తోచలేదు. మనసులో నిల్చున్నా కూచున్నా యే పని చేస్తున్నా సరోజిని మాటలే ప్రతిధ్వనిస్తున్నాయి. సరోజిని అంది: "బాబాయి గారూ - ఇకముందు ఇలా పిలవకూడ దనుకోండి. మాట ఇవ్వండి. మాట ఇవ్వకతప్పదులెండి. మిమ్మల్ని మామయ్యగా రని పిలవాలి కాబోలు. మీరూ, నాన్నా చిన్ననాటినుంచీ స్నేహితులు. అటువంటిది మా కుటుంబం చితికిపోయింది. అందువలన ఆదుకోవాల్సిన బాధ్యత మీమీద ఎంతైనా వుంది. ప్రపంచం ఎన్నోరకాల మారుతున్నది. అర్థంలేని ఆచారాలు, మూఢనమ్మకాలు, ఇవన్నీ వదిలేయవలసిందే. వసుధ తెలివికలది. ఆత్మవిశ్వాసంకలది. జీవితాన్ని పరిశీలించింది. ఆత్మశక్తిపైన నాకెంతో ప్రబలమైన విశ్వాసం వుంది. వసుధకుకూడా ఇష్టమే. పోనీ ఆ విషయం నాకు వదిలేసెయ్యండి. మాట ఇవ్వక తప్పదు మీరు. మా సత్యం నిజంగా చిన్నపిల్ల వాడిలాటివాడు. మీకూడా తెలుసును ఒంటరిగా వుంటే జీవితాన్ని, సమస్యలను యెదుర్కోలేడు. వాడికి తెలివిగల పిల్ల ఆసరావుంటే తప్ప సుఖంగా జీవించలేడు. వసుధ వాడి జీవితానికి వెలుగు నివ్వగలదు."

ఏ పనిచేస్తున్నా, నిల్చున్నా వసుధకు కళ్ళన్నీ వీధి వాకిలిమీదనే వున్నాయి. ఆమె ఇప్పటికే నాలుగుసార్లు విసుక్కుంది. ఏంమనిషి ? అనుకుని. అప్పుడే విసుక్కుంటున్నందుకు

తనకు తానే నవ్వుకొని, నువు భోజనం చెయ్యి తల్లీ అని తల్లి అంటే, అతడు రాలేదని పైకి అని, మళ్ళీ ఇంతలోనే సిగ్గుపడి, ఇకనుంచీ వారనాలి కాబోలని సుతారంగా బుగ్గలు నొక్కుకుని, తొమ్మిదిన్నరకు భోజనానికి కూచుంది. ఇంతలో వసుధకు వారు కాబోతున్న అతడు రావటం, ఆమె లేవటం, అతడు సిగ్గుపడటం, ఆమె సిగ్గుపడటం, అనుకోకుండానే ఒకర్నొకరు దొంగ దొంగ చూపులు చూసుకోవటం – ఇత్యాదయః – రామారావుకి చెప్పివచ్చాడు. ప్రొఫెసరుగారింటికి వెళ్ళి చెప్పి వచ్చాడు. ఆఖరికి వైకుంఠానికి గూడా చెప్పివచ్చాడు. "అందరికీ చెప్పిరావటంతో ఆలస్యమైంది. అక్కయ్య ఏవో కబుర్లు చెపుతూ కదలనియ్యలేదు." అని ఆమెతో చెప్తూ కుంటే, ఆమె "ఇది మరీబాగుంది నే నేమన్నానిప్పుడు" – అని సాగదీసింది. ఇద్దరూ ఒకేసారి కూచుని భోజనాలు చేస్తుంటే పెద్దవాళ్ళ కళ్ళు వెన్నెల పోసుకుని చల్లపడ్డయ్. తెల్లవారి ఎనిమిదిన్నరకు రైలు బయలుదేరుతుంది. పరంధామయ్యగారు అడిగినప్పుడు "అక్కయ్యా వాసూ తెల్లవారీ తెల్లవారక ముందే కారు తీసుకుని వస్తారు" అని చెప్పాడు సత్యన్నారాయణమూర్తి.

సత్యన్నారాయణమూర్తికి పక్కమీద చేరగానే గాఢనిద్ర పట్టింది. పరంధామయ్యగారికి వొకవైపున దిగులు, ఒక వైపున చెప్పలేని సంతోషం మిశ్రితమైనాయి. వసుధకు నిద్రపట్టడంలేదు. తియ్యతియ్యని భావాలు మనసుని కల్లోల పరుస్తున్నాయి. ఆకాశంమీద చుక్కలు పువ్వుల్లాగా కనపడ్డాయి. చందమామ పొద్దుపోయి కాని రాడు. ఎక్కడ

నుంచో పుప్పొల వాసన తేలివస్తోంది. మనస్సు మధురమై యెక్కడెక్కడో సౌందర్య లోకాల్లో విహరిస్తోంది. ముత్యాల తలంబ్రాలు పోసుకున్నట్లు, పూలచెండ్లాడుకున్నట్లు అనుభూతులు. ఎప్పుడు నిద్రపట్టిందో. తల్లి వచ్చి లేపింది. చందమామ వెన్నెల కురిపిస్తూ లోకానికంతకూ ఆహ్లాదం చేకూరుస్తున్నాడు. నిమిషంలో నీళ్ళు కాగినయ్. ఆ ప్రశాంత మధుర వాతావరణం, ఆ వేకువఝాము, తూర్పునుంచి పడమటి దిక్కుకు ఆకాశంలో వొక్కొక్కటే తెల్లని మబ్బులు తేలిపోతుంటే, వసుధ మనసు యెంతో ఉల్లాసంగా వుంది. ఆమె స్నానం చేసింది. తల దువ్వుకుంది. మనస్సు వూరికే వురకలు వేస్తున్నది. ఆ చీకట్లోనే ఒకమూల చిన్న అద్దంముందు కూచుని, కాటుక దిద్దుకుంది సోగ్గా.

తనను తానే వెక్కిరించుకుంది - నవ్వుకుంది.

గడియారం ఐదుగంటలు కొట్టింది.

ఇప్పటికి ఐదుసార్లు వెళ్ళింది అతగాడి మంచం వద్దకు.

"ఎంత నిశ్చింతో చూడు" అనుకుంది.

వరండాలో నిల్చుని కాసేపు తూర్పుదిశను అలుముకుంటున్న రంగులకేసి చూసింది. దూరంగా మసీదు గోపురాలు, పక్కనే పెద్ద రావిచెట్టూ కనపడుతున్నాయి. వేకువఝాము యెంతో అందంగా వుంటుందో - ఒక్క రోజైనా ఇది వరలో తాను చూడలేదుకదా ఇంత అందం అనుకుంది. చల్లటి గాలులు తేలివస్తున్నాయి.

ఐదున్నర.

వీధిలో కలకలం.

వీధిలో వో పెద్దగుంపు ప్రాతఃకాల సంకీర్తన చేసుకుంటూ వెళుతున్నారు. అందరి గొంతులూ కలవకపోయినా, బృందగానం యెంతో అందంగా వుంది. "రండయ్యో రండయ్యో, పండారీ పురమునకూ, పోదాము రండయ్యో"— అని ఆ పాట భావం. వసుధకు యెందుకో నవ్వువచ్చింది. వాళ్ళు కనపడుతున్నంతవరకు వీధివాకిట్లో నిల్చుని చూసింది. దూరంగా రావిచెట్టుమీద పక్షులు కలకలారావాలు చేస్తున్నాయి. ఆకులు కదులుతున్నాయి. ప్రాతఃకాలపు శోభను చూసి ఆమె మనసు పులకరించిపోయింది. తలుపు వోరగావేసి ఇంట్లోకి వెళ్ళిపోయింది.

మళ్ళీ అతగాడి మంచంవద్దకు వెళ్ళి తొంగిచూసింది.

"చిన్నపిల్లవాడిలా ఎంత నిశ్చింతో"— అని మళ్ళీ అనుకుంది.

తల్లిదగ్గరకు వెళ్ళింది.

ఆమె యేదో టిఫిన్ చేసే పనిలో నిమగ్నురాలై వుంది.

అయినా తీరికచేసుకుని కూతురి ఆర్భాటం చూసి, వొకసారి నవ్వి, మళ్ళీ తన పనిలో తాను నిమగ్నురాలైంది.

పక్కింటివాళ్ళ గడియారం ఆరు కొట్టింది.

"ఎనిమిదిన్నరకు రైలు బయలు దేరుతుంది. ఎంత నిశ్చింతో చూడు." ఈసారి వసుధకు కోపమొచ్చింది.

కాసేపు వరండాలో వచ్చి నిలుచుంది.

చందమామ తెల్లబడిపోతున్నాడు.

ప్రపంచమంతా తెల్లబడిపోతోంది.

రావిచెట్టుమీద ఆకులు కదులుతున్నాయి. మసీదు గోపురాలు అందంగా కన్పిస్తున్నాయి. వసుధ అతడి మంచం దగ్గరకు వెళ్ళి అతడివేపు పరామర్శగా చూసింది. ఆమె హృదయంలో పువ్వులు వికసించాయి. ఇంత అందంగా యెప్పుడూ కనపడలేదే - అని ఆశ్చర్యపోయింది. ప్రశాంతంగా నిద్రపోతున్న అతని ముఖాన్ని తనివితీరా చూసింది. తరువాత అతడి చేతిని తన చేతిలోకి తీసుకుని మృదువుగా నొక్కింది. అతడు కళ్ళు తెరచి చూసి మహా సిగ్గుపడిపోయాడు; మహదానందపడ్డాడు. ఆమె ముగ్ధమోహనరూపం చూసి అతడి కళ్ళు మెరసిపోయినయ్. అతడి చేతిని వదిలేస్తూ "ఇంకా నిద్రేనా, చూడండి తెల్లవారింది" అని చెప్పింది వసుధ.

(సంపూర్ణము)







| | |
|---|---|
| | పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TDLA105 B178 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 24-10-24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | No |
| మొత్తం పేజీలు | 203 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | 8,4 |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | pratyusha |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | pratyusha |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | No |
| తప్పులు | No |
| పరిస్థితి | good |